ప్రవక్తుం తదేవం వైవస్వత మనువంశో సోమవంశ ప్రస్తావేన శ్రీకృష్ణావతార చరితాని న ప్రపంచమను వర్ణితాని. అథేదానీం భావీ సోమ వంశః కలౌ విజాతీయ సంకరాది మలీమసో వైరాగ్య ద్వారా శ్రీకృష్ణైక భక్తి నిగమ నాయాను వర్ణ్యతే తత్రతు సోమవంశ శాఖాసు చరకాలాను వర్తితయామాగధవంశోఽను క్రమ్యతే తత్రచపూరోర్వంశే ఉపరిచరోవసుః తస్య బృహద్రథః తస్య జరాసంధః తస్య సహదేవః పుత్రోఽభూదిత్యుక్తం నవమస్కంధే తత్రైవ సహదేవాన్మార్జారిః తతః శ్రుత శ్రవా ఇత్యాదయో రిపుంజయాంతా వింశతిర్భావినోరాజానో నిరూపితాః తదుపరితనం వంశం సంకరాదిదోషైః ప్రశ్న పూర్వకం యోఽంత్య ఇత్యాదినా ప్రపంచయతి స్వధామేతి. (1)

ప్రభావముచే సాంకర్య దోషభూయిష్ఠులైన మగధవంశరాజుల కథ చెప్పబడినది. ఇట్టి సోమవంశమున ముకుందుని స్వేచ్ఛా క్రీడ వర్ణితము. కృష్ణుని వీడినచో ముక్తి లేదనెడి సత్యమిందు బోధింపబడినది. వైవస్వతమనువంశములో సోమవంశ ప్రస్తావనతో శ్రీకృష్ణావతారచరితము పూర్వమే విశదముగ వర్ణింపబడినది. ఇప్పుడు రాబోవు సోమవంశము కలియుగమున విజాతీయ సాంకర్యముచే దూషితమై, వైరాగ్యము ద్వారా శ్రీకృష్ణుని యందలి భక్తితో విలీనమగుననెడి విషయము వర్ణింపబడుచున్నది. సోమవంశములోని అనేక శాఖలలో చిరకాలమనుసరించియున్నందున మగధవంశమును గూర్చి ప్రస్తావింపబడుచున్నది. పురువంశములో ఉపరిచరవసువు జన్మించెను. ఆతనికి బృహద్రథుడు, ఆతనికి జరాసంధుడు, ఆతనికి సహదేవుడు, పుత్రులుగా జన్మించిరని నవమస్కంధములో పేర్కొనబడినది. ఆ స్కంధములోనే సహదేవునకు మార్జారియు, ఆతనికి శ్రుతశ్రవుడు మొదలుకొని రిపుంజయుని వరకు గల ఇరవైమంది రాజులు కలిగిరని చెప్పబడినది. తదనుసారముగ ఈ శ్లోకమున.....



ప్రథమోఽ ధ్యాయః

**రాజోవాచ**

శ్లో ॥ స్వధామానుగతే కృష్ణే యదువంశ విభూషణే
కస్య వంశోఽభవత్ పృథ్వ్యామేతదాచక్ష్వమేమునే ! - 1

**శ్రీ శుక ఉవాచ.**

శ్లో ॥ యోఽన్త్యః పురంజయో నామ భవిష్యో బార్హద్రథః
తస్యామాత్యస్తు శునకో హత్వా స్వామినమాత్మజమ్ - 2

శ్లో ॥ ప్రద్యోతసంజ్ఞం రాజానం కర్తా యత్పాలకః సుతః
విశాఖ యూపస్తత్పుత్రో భవితా రాజకస్తతః - 3

టీ:- యోఽంత్య ఇతి. రిపుంజయ ఏవ పురంజయ ఇతి స్వామినం పురంజయం హత్వా స్వపుత్రం ప్రద్యోతం రాజానం కరిష్యతి. యస్య పాలకోనామ సుతో భవిష్యతి. (2,3)

శ్లో ॥ నంది వర్ధనస్తత్పుత్రః పంచే ప్రద్యోతనా ఇమే
అష్టత్రింశోత్తరశతం భోక్ష్యన్తి పృథివీం నృపాః - 4

ప్రథమాధ్యాయము

రాజు శ్రీశుకుని - 'ఓ మహామునీ! యదువంశమునకు అలంకారమువంటి వాడైన శ్రీకృష్ణుడు తన మహిమను చాటుచుండగా, ఈ భూమండలమున ఏ వంశముద్భవించునో తెలుపుము' అని - అడిగెను. (1)

**శ్రీశుకుడు పలుకుచున్నాడు.**

పురువంశములో చివరి రాజు పురంజయుడు. రిపుంజయుడే పురంజయుడు. ఇతని మంత్రి శునకుడు. శునకుడొకనాడు ప్రభువైన పురంజయుని చంపి, తన కొడుకైన ప్రద్యోతుడనువానిని రాజుగా నొనర్చును. ఆ ప్రద్యోతునికి పాలకుడను సుతుడు కలుగును. వానికి విశాఖయూపుడను పుత్రుడు కలుగును. వానికి రాజకుడను సుతుడు కలుగును. (2,3)

రాజకునకు నందివర్ధనుడు పుత్రుడుగా లభించును. ప్రద్యోత, పాలక, విశాఖయూప, రాజక, నందివర్ధనులను ఈ అయిదుగురు ప్రద్యోతనులని పిలువబడుదురు. (4)



శ్లో ॥ శిశునాగస్తతో భావ్యః కాకవర్ణస్తు తత్సుతః
క్షేమధర్మా తస్య సుతః క్షేత్రజ్ఞః క్షేమధర్మజః - 5

శ్లో ॥ విధిసారః సుతస్తస్యాజాత శత్రుర్భవిష్యతి
దర్భకస్తత్సుతో భావీ దర్భక స్యాజయః స్మృతః 6

శ్లో ॥ నందివర్ధన ఆజేయో మహానందిః సుతస్తతః
శిశునాగా దశైవేతే షష్ట్యుత్తర శతత్రయమ్ - 7

శ్లో ॥ సమా భోక్ష్యంతి పృధివీం కురుశ్రేష్ఠకలౌ నృపాః
మహానందిసుతో రాజన్! శూద్రీగర్భోద్భవో బలీ - 8

టీ :- విశాఖయూప ఇతి. ప్రద్యోతనాః ప్రద్యోతనసంజ్ఞాః భవితా చాజ్జక ఇతి చ పాఠాంతరం. (4 -8)

శ్లో ॥ మహాపద్మపతిః కశ్చిన్నందః క్షత్రవినాశకృత్
తతో నృపా భవిష్యంతి శూద్రప్రాయా స్త్వధార్మికా ః 9

టీ :- మహానందీతి. నందో నామ కశ్చిన్మహాపద్మసంఖ్యాయాః సేనాయాః పతిః. ధనస్య వా పతిర్భవిష్యతి అత ఏవ మహాపద్మపతిరిత్యపి తస్యనామ. (9)

నందివర్ధనునకు శిశునాగుడు, శిశునాగునకు కాకవర్ణుడు, కాకవర్ణునకు క్షేమధర్ముడు, క్షేమధర్మునకు క్షేత్రజ్ఞుడు, క్షేత్రజ్ఞునకు విధిసారుడు, విధిసారునకు అజాతశత్రువు, అజాతశత్రువునకు దర్భకుడు, దర్భకునకు అజయుడు, అజయునకు నందివర్ధనుడు, నందివర్ధనునకు మహానంది, మహానందికి శిశునాగుడు అను ఈ పదిమంది రాజులు ఈ భూమండలమును మున్నూటరువది సంవత్సరములు పాలించగలరు. మహానందిసుతుడైన శిశునాగుడు శూద్రి గర్భమున జన్మించినాడు. బలశాలి. (5,6,7,8)

క్షాత్రధర్మమును నశింపజేయువాడైన నందుడనువాడొకడు మహాపద్మమను పేరుగల సేనకుగానీ, ధనమునకు గానీ అధికారి కాగలడు. అందుకే వానికి మహాపద్ముడనియుపేరు. వారికి అధార్మికులు, శూద్ర ప్రాయులునైన రాజులు జన్మింపగలరు. (9)



శ్లో ॥ స ఏకచ్ఛత్రాం పృథివీయనుల్లంఘితశాసనః
శాసిష్యతి మహాపద్మో ద్వితీయ ఇవ భార్గవః - 10

టీ :- ఏకేతి. ఏకమేవ ఆత్మనః ఛత్రం యస్యాం తాం పృథివీం శాసిష్యతి పాలయిష్యతి. క్షత్రోత్సాదనే దృష్టాంతః. భార్గవః పరశురామ ఇతి. (10)

ఆ మహాపద్ముడు ఎదురులేని శాసనముగలవాడై ఈ భూమండలమును పరశురామునివలె శత్రునిర్మూలనమొనర్చి ఏకచ్ఛత్రముగ పరిపాలింపగలడు. (10)

శ్లో ॥ తస్య చాష్టౌ భవిష్యన్తి సుమాల్యప్రముఖాః సుతాః
య ఇమాం భోక్ష్యంతి మహీం రాజానః స్మశతం సమాః - 11

టీ :- తస్యేతి. సమాః సంవత్సరాన్. (11)

ఆ మహాపద్మునకు సుమాల్యుడు మొదలగుగా గల ఎనిమిది మంది పుత్రులు జన్మింపగలరు. వారు ఈ భూమిపై నూరు సంవత్సరములు పరిపాలింపగలరు. (11)

శ్లో ॥ నవనందాన్ ద్విజః కశ్చిత్ ప్రపన్నానుద్ధరిష్యతి
తేషామభావే జగతీం మౌర్యా భోక్ష్యంతి వైకలౌ - 12

టీ :- నవేతి. నవనందాన్ నందం చ తత్పుత్రాంశ్చేత్యేవం ప్రపన్నాన్ విశ్వస్తాన్ విఖ్యాతాన్ వా. ద్విజః కౌటిల్యవాత్స్యాయనాది పర్యాయశ్చాణక్యః ఉద్ధరిష్యతి. ఉన్మూలయిష్యతి. తేషామభావే మౌర్యాః మౌర్య్యసంజ్ఞాః. (12)

ఈ సుమాల్యాదులు ఎనిమిదిమంది, మహాపద్మనందుడు కలిసి మొత్తము తొమ్మిదిమంది నందరాజులు విఖ్యాతులుగాను, విశ్వస్తులుగాను ఉందురు. వారిని కాటిల్య వాత్స్యాయనాది పర్యాయ నామములు గల చాణక్యుడను బ్రాహ్మణుడు నిర్మూలింప గలడు. వారు ఈ విధముగ మరణింపగానే మౌర్యులను పేరుగల రాజులు ఈ జగత్తును అనుభవింపగలరు.(12)



శ్లో ॥ స ఏవ చంద్రగుప్తం వై ద్విజో రాజ్యేఽభిషేక్ష్యతి
తత్సుతో వారిసారస్తు తతశ్చాశోకవర్ధనః - 13

ఆ చాణక్యుడను బ్రాహ్మణుడే మౌర్యులలో మొదటి వాడైన చంద్రగుప్తుని రాజ్యసింహాసనముపై కూర్చొనబెట్టును. ఆ చంద్రగుప్తునకు వారిసారుడు, ఆతనికి అశోకవర్ధనుడు జన్మింపగలరు. (13)

శ్లో ॥ సుయశా భవితా తస్య సంగతః సుయశః సుతః
శాలిశూకస్తతస్తస్య సోమశర్మా భవిష్యతి - 14

అశోకవర్ధనునకు సుయశుడు, సుయశునకు సంగతుడు, సంగతునకు శాలిశూకుడు, శాలిశూకునకు సోమశర్మ జన్మింపగలరు. (14)

శ్లో ॥ శతధన్వా తతస్తస్య భవితా తద్బృహద్రథః
మౌర్యాహ్యేతే దశనృపాః సప్తత్రింశచ్ఛతోత్తరమ్ - 15

శ్లో ॥ సమాభోక్ష్యన్తి పృథివీం కలౌ కురుకులోద్వహ!
అగ్నిమిత్రస్తతస్తస్మాత్సుజ్యేష్ఠో: థ భవిష్యతి - 16

శ్లో ॥ వసుమిత్రో భద్రకశ్చ పులిందో భవితా తతః
తతో ఘోషః సుతస్తస్మాద్వజ్రమిత్రో భవిష్యతి - 17

టీ :- కథం భోక్ష్యంతి తదాహ - స ఏవేతి. చంద్రగుప్తం మౌర్యం ప్రథమం తేషాం చరమో దశరథః పరాశరాదిభిరుక్తోఽత్రాప్యనుసంధేయః. మౌర్యా ఇతి. తేన చరమేణ దశరథేన సహ ఏతే మౌర్యాదశ. సప్తత్రింశచ్ఛతోత్తరం సప్తత్రింశదుత్తరం శతంసమా. (13 -17)

సోమశర్మకు శతధన్వుడు, శతధన్వునకు బృహద్రథుడు జన్మింపగలరు. ఈ మౌర్యులలో ఐదవవాడు దశరథుడను వాడని పరాశరాదులు చెప్పిన మాటను ఇచట అనుసంధానించుకొన్నచో మౌర్యులు పదిమంది, వీరు నూటముప్పది యేడు సంవత్సరములు రాజ్యమును పాలించెదరు. అటుపిమ్మట అగ్నిమిత్రుడు, సుజ్యేష్ఠుడు, వసుమిత్రుడు, భద్రకుడు, పులిందుడు, ఘోషుడు, వజ్రమిత్రుడు వరుసగా రాజ్యములను పాలింపగలరు. (15,16,17)



శ్లో ॥ తతో భాగవతస్తస్మాద్దేవభూతిరితి శ్రుతః
శుంగా దశైతే భోక్ష్యన్తి భూమిం వర్షశతాధికమ్ - 18

టీ :- హత్వేతి. బృహద్రథస్య సేనాపతిః. పుష్యమిత్రోనామ స్వామినం హత్వా రాజ్యం కరిష్యతి. స చ శుంగానాం ప్రథమః. శుంగా ఇతి. తతోఽగ్నిమిత్రాదయో నవేత్యేవం శుంగాః దశ. వర్షశతాధికం వర్షశతం. శృంగా ఇతి చ పాఠాంతరం. (18)

బృహద్రథుని సేనాపతియగు పుష్యమిత్రుడనువాడు ప్రభువైన బృహద్రథుని చంపి, రాజ్యమును పాలించును. ఈతడే శుంగవంశ రాజులలో ప్రథముడు. అతని తరువాత అగ్నిమిత్రాదులు తొమ్మిదిమంది శుంగరాజులు నూటపన్నెండు సంవత్సరములు రాజ్యములను పాలింతురు. పుష్యమిత్రునితో కలిసి శుంగరాజులు పదిమంది కాగలరు. (18)

శ్లో ॥ తతః కణ్వానియం భూమిర్యాస్యత్యల్పగుణాన్నృప !
శుంగం హత్వాదేవభూతిం కణ్వో: మాత్యస్తు కామినమ్ - 19

టీ :- కథం కణ్వాన్ యాస్యతి? తదాహ - శుంగమితి. పరస్త్రీ కామినం దేవహూతినామానం శుంగం హత్వా. తదమాత్యో వసుదేవనామా కణ్వో రాజ్యం కరిష్యతి. (19)

తదుపరి పరస్త్రీకాముకుడైన దేవభూమియను శుంగరాజును ఆతని మంత్రియగు వసుదేవుడను కణ్వవంశీయుడు చంపి రాజ్యసింహాసనమునధిష్ఠించుట చేత ఈ భూమండలము కణ్వరాజుల పరిపాలన లోనికి వెళ్ళును. (19)

శ్లో ॥ స్వయం కరిష్యతే రాజ్యం వసుదేవో మహామతిః ।
తస్య పుత్రస్తు భూమిత్ర స్తస్య నారాయణస్సుతః ॥ -20.

టీ :- తస్యేతి. కణ్వానాం చతుర్థః సుశర్మా ఇమే వసుదేవాదయః కణ్వాయనాః. (20)

మహాబుద్ధిశాలియగు వసుదేవుడు తాను స్వయముగానే రాజ్య పాలన చేయును. ఆతనికి భూమిపుత్రుడనువాడు, ఆ భూమిపుత్రునకు నారాయణుడనువాడు సుతులై జన్మింపగలరు. ఆ కణ్వరాజులలో సుశర్మ నాల్గవవాడని తెలిసికొనవలెను. (20)



శ్లో ॥ కాణ్వాయనా ఇమే భూమిం చత్వారింశచ్చ పంచ చ
శతాని త్రీణి భోక్ష్యన్తి వర్షాణాం చ కలౌ యుగే ॥ - 21

టీ :- వర్షాణాం త్రీణి శతాని పంచ చత్వారింశద్వర్షాణి చ భూమిం భోక్ష్యంతి. (21)

వసుదేవుడు మొదలగు కాణ్వాయనులు కలియుగమున భూమండలమును మున్నూటనలుబదియైదు సంవత్సరములు పాలింపగలరు. (21)

శ్లో ॥ హత్వా కాణ్వం సుశర్మాణం తద్భృత్యోవృషలోబలీ
గాం భోక్షత్యంధ్రజాతీయః కించిత్కాలమసత్తమః ॥ - 22

కాణ్వరాజులలో చివరివాడైన సుశర్మను అతని భృత్యుడైన బలియను పేరుగల ఆంధ్రజాతీయుడు చంపి, కొంతకాలము రాజ్యమును పాలింపగలడు. (22)

శ్లో ॥ కృష్ణనామాథ తద్భ్రాతా భవితా పృథివీపతిః
శ్రీశాన్తకర్ణస్తత్పుత్రః పౌర్ణమాసస్తు తత్సుతః ॥ - 23

శ్లో ॥ లంబోదరస్తు తత్పుత్రః తస్మాచ్చిబిలకో నృపః
మేఘస్వాతిశ్చిబిలకాదటమానస్తు తస్య చ ॥ -24

శ్లో ॥ అనిష్ట కర్మా హాలేయస్తలకస్తస్య చాత్మజః
పురీషభీరుస్తత్పుత్రస్తతో రాజా సునందనః ॥ - 25

టీ :- హత్వేతి. కణ్వానామంతిమం సుశర్మాణం హత్వా బలీ బలినామా తద్భృత్యో గాం భోక్ష్యంతి. (22 -25)

తదుపరి బలి సోదరుడైన కృష్ణుడు రాజగును. ఆ కృష్ణునకు శ్రీశాన్తకర్ణుడు, శ్రీశాన్తకర్ణునకు పౌర్ణమాసుడు, పౌర్ణమాసునికి లంబోదరుడు, లంబోదరునకు చిబిలకుడు, చిబిలకునికి మేఘస్వాతి, మేఘస్వాతికి అటమానుడు, అటమానునకు అనిష్టకర్మ, అనిష్టకర్మకు హాలేయుడు, హాలేయునకు తలకుడు, తలకునకు పురీషభీరువు, పురీషభీరువునకు సునందనుడు జన్మించి, భూమిని పాలింపగలరు. (23-25)





శ్లో ॥ చకోరో బహవో యత్ర శివస్వాతిరరిందమః
తస్యాపి గోతమీపుత్రః పురీమాన్భవితా తతః - 26

సునందునకు చకోరుడు అను పుత్రుడు కలుగును. చకోరునకు కలిగిన ఎనిమిది మంది పుత్రులలో చివరివాడైన శివస్వాతియనువాడు పాలింపగలడు. శివస్వాతికి గోతమీపుత్రుడు, గోతమీపుత్రునకు పురీమంతుడు, పురీమంతునకు మేదశిరుడు, మేదశిరునకు శివస్కందుడు, శివస్కందునకు యజ్ఞశ్రీ, యజ్ఞశ్రీకి విజయుడు, విజయునకు భావ్యుడు, భావ్యునకు చంద్రవిజ్ఞుడు, చంద్రవిజ్ఞునకు సలోమధియనువారు జన్మించి భూమిని పాలింపగలరు. ఈ ముప్పదిమంది రాజులు నాలుగువందల యేబదియారు సంవత్సరములు పాలింపగలరు. (26,27,28)

శ్లో ॥ మేదఃశిరాః శివస్కందో యజ్ఞశ్రీస్తత్సుతస్తతః
విజయస్తత్సుతో భావ్యశ్చంద్రవిజ్ఞస్సలోమధిః -27

శ్లో ॥ ఏతే త్రింశన్నృపతయశ్చత్వార్యబ్దశతాని చ
షట్పంచాశచ్చ పృథివీం భోక్ష్యంతి కురునందన! - 28

టీ :- చకోర ఇతి. యత్ర యేషు బహుసంజ్ఞేషు అష్టసు చరమః శివస్వాతినామా భవితా. (26- 28)

శ్లో ॥ సప్తాభీరా ఆవభృత్యా దశ గర్దభినో నృపాః
కంకాః షోడశ భూపాలాః భవిష్యన్త్యతిలోలుపాః 29

అవభృతియను నగరమును రాజధానిగ చేసికొని, ఏడుగురు ఆభీరరాజులు, పదిమంది గర్దభరాజులు, పదహారుమంది కంకరాజులు, అమితరాజ్యలోభులై పాలింపగలరు. (29)

శ్లో ॥ తతోఽష్టౌ యవనాభావ్యాః చతుర్దశతురుష్కకాః
భూయో దశ గురుండాశ్చ మౌనా ఏకాదశైవతు - 30

టీ :- సప్తేతి. అవభృత్యాః అవభృతిర్నామ నగరీ తద్రాజానః. (29,30)

తదనంతరము ఎనిమిదిమంది యవనులు, పదునాలుగు మంది తురుష్కులు, పదిమంది గురుండులు, పదకొండుమంది మౌనులు భూమిని పాలింపగలరు. (30)



శ్లో ॥ ఏతే భోక్ష్యన్తి పృథివీం దశవర్షశతానిచ
నవాధికాంచ నవతిం మౌనా ఏకాదశక్షితిమ్ - 31

టీ :- ఏత ఇతి. ఏతే ఆభీరాదయో మౌనవ్యతిరిక్తాః అష్టషష్టిన్నృపాః ఏకోనశతాధికం వర్షసహస్రం పృథివీం భోక్ష్యంతి. తతః పూర్వోక్తా ఏవైకాదశమౌనాః త్రీణ్యబ్దశతాని క్షితిం భోక్ష్యంతి తైః సంస్థితేషు మౌనేషు తేషు కిలింకిలాయాం పుర్యాం నృపతయో భవిష్యంతీత్యుత్తరేణాన్వయః . కిల్కిలాయామితి చేతి పాఠాంతరః. (31)

ఆభీరులు మొదలైన అరువదియైదు మంది రాజులు ఒకవేయి తొంబదితొమ్మిది సంవత్సరములు భూమిని పాలింతురు. పదకొండు మంది మౌనరాజులు మున్నూరు సంవత్సరములు భూమిని పాలింతురు.(31)

శ్లో ॥ భోక్ష్యంత్యబ్ద శతాన్యంగ త్రీణి తైః సంస్థితే తతః
కిలికిలాయాం నృపతయో భూతనందోఽథ వంగిరిః - 32

వీరందరు మరణింపగా కిలికిలానగరములో భూతనందుడు, వాని పిదప 'వంగిరి' భూమిని నూటమూడు సంవత్సరములు పాలింతురు. (32)

శ్లో ॥ శిశునందిశ్చ తద్భ్రాతా యశోనందిః ప్రవీరకః
ఇత్యేతేవై వర్షశతం భవిష్యంత్యధికాని షట్ - 33

టీ :- కిలింకిలాయామితి. అధికాని షడ్వర్షాణి. (32,33)

అటుపిమ్మట శిశునంది, ఆతని సోదరుడు యశోనంది, ప్రవీరకుడు అనువారు నూట ఆరు సంవత్సరములు భూమిని పాలింతురు. (33)



శ్లో ॥ తేషాం త్రయోదశసుతా భవితారశ్చ బాహ్లికాః
పుష్పమిత్రోஉథ రాజన్యో దుర్మిత్రోஉస్యతథైవచ - 34

టీ :- తేషామితి. తేషాం భూతనందాదీనాం యథాయథం బాహ్లికా స్తన్నామాన స్త్రయోదశ మతా భవిష్యంతి. అథ పుష్యమిత్రో నామాన్యో రాజన్యః. తస్య చ దుర్మిత్రో నామ పుత్రః. (34)

భూతనందుడు మొదలైన వారికి పదమూడుమంది బాహ్లీకులు జన్మింతురు. అటుపిమ్మట పుష్పమిత్రుడనువాడు రాజ్యము చేయును. వానికి దుర్మిత్రుడను సుతుడు కలుగును. (34)

శ్లో ॥ ఏకకాలాః ఇమే భూపాః సప్తాంధ్రాః సప్త కోసలాః
విదూరపతయో భావ్యా నిషధాస్తత ఏవ హి - 35

టీ :- ఏకకాలా ఇతి. తథా ఆంధ్రాః కోసలాః వైడూర్యపతయః నైషధాశ్చ ఏతే తత్తద్దేశనామభిః ప్రఖ్యాతా స్తుల్యకాలాః ఖండమండలేషు భూపాః. తతస్తేభ్యో బాహ్లికేభ్యః ఏవభావ్యాః భవిష్యంతి. (35)

బాహ్లీకులవలన ఏకకాలములోనే ఎందరో రాజులు ఉద్భవింపగలరు. వారు ఆంధ్ర, కోశల, విదూరపతి, నిషధులనెడి ఆయా దేశనామములతోడనే ప్రఖ్యాతులై ఆయా ఖండమండలములను (సామంత రాజ్యములను) పాలింపగలరు.(35)

శ్లో ॥ మాగధానాం తు భవితా విశ్వస్ఫూర్జిః పురంజయః
కరిష్యత్యపరో వర్ణాన్పులిందయదుమద్రకాన్ - 36

టీ :- తతశ్చ. మాగధానామితి. మాగధానాం తు రాజా విశ్వస్ఫూర్జనామా భవితా. తస్యైవ విశ్వమూర్తిరితి చ నామాంతరం. స చ పూర్వోక్తాత్పురంజయాదపరః పురంజయ ఇతి ప్రసిద్ధస్సన్ వర్ణాన్

తరువాత మగధదేశమును విశ్వస్ఫూర్జి అనురాజు పాలించును. ఈతడే పూర్వము చెప్పిన పురంజయుని కంటె భిన్నుడైన పురంజయునిగా ప్రసిద్ధిని పొందును. ఈతడు సమస్త బ్రాహ్మణాదులను పులిందయదు మద్రలనెడి మ్లేచ్ఛప్రాయులుగా నొనర్చును. 36)

బ్రాహ్మణాదీన్ పులిందయదుమద్రక సంజ్ఞకాన్ మ్లేచ్ఛ ప్రాయాన్ కరిష్యతి. అపరానితి పాఠే అన్యాన్ పులిందాదిసంజ్ఞాన్ వర్ణాన్ కరిష్యతీత్యర్థః. (36)

శ్లో ॥ ప్రజాశ్చాబ్రహ్మభూయిష్ఠాః స్థాపయిష్యతి దుర్మతిః
వీర్యవాన్ క్షత్రముత్సాద్య పద్మవత్యాం స వై పురి
అనుగంగామాప్రయాగం గుప్తాం భోక్ష్యతి మేదినీమ్ - 37

టీ :- కించ. ప్రజా ఇతి. స చ ఏవం కృత్వా అబ్రహ్మభూయిష్ఠాః అత్రైవర్ణ్యప్రచురాస్సతీః ప్రజాః స్థాపయిష్యతి పాలయిష్యతి. స చ పద్మవత్యాం పురి పుర్యాం వసన్. అనుగంగాం గంగాద్వారమారభ్య ఆప్రయాగం ప్రయాగపర్యంతం. గుప్తాం పాలితాం మేదినీం భోక్ష్యంతి. (37)

విశ్వస్ఫూర్జియనుపేరు గల ఆ పురంజుయుడు ప్రజలను బ్రాహ్మణరహితులుగాను, త్రైవర్ణ్య రహితులుగాను ఒనర్చి, పరిపాలింపగలడు. ఆతడు పద్మవతియను పురమును రాజధానిగ చేసికొని, గంగాతీరము మొదలుకొని ప్రయాగవరకు గల భూభాగమును పాలింపగలడు. (37)

శ్లో ॥ సౌరాష్ట్రావన్త్యాభీరాశ్చ శూరా అర్బుదమాలవాః
వ్రాత్యాద్విజా భవిష్యంతి శూద్రప్రాయాజనాధిపాః - 38

టీ :- సౌరాష్ట్రేతి. తదనంతరం చ సౌరాష్ట్రాదిదేశవర్తినో నృపాః శూద్రప్రాయాః. ద్విజాః వ్రాత్యా ఉపనయనరహితాశ్చ భవిష్యంతి. (38)

పిదప సౌరాష్ట్ర, అవన్తి, ఆభీర, శూర, అర్బుద, మాలవ దేశములలోని బ్రాహ్మణులు ఉపనయనాది సంస్కార రహితులగుటచే వ్రాత్యులగుదురు. శూద్రులవంటి వారగుదురు. (38)



శ్లో ॥ సింధోస్తటం చంద్రభాగాం కౌన్తీం కాశ్మీరమండలమ్
భోక్ష్యన్తి శూద్రాం వ్రాత్యాద్యా మ్లేచ్ఛాశ్చా బ్రహ్మవర్చసః 39

టీ :- సింధోరితి. అబ్రహ్మవర్చసః వేదాచారశూన్యాః. (39)

వేదాచారశూన్యులైన వ్రాత్యులు మొదలైన వారును, మ్లేచ్ఛులును సింధు నదీతీరమును, చంద్రభాగనదీతీరమును, కుంతీదేశమును, కాశ్మీర మండలమును పాలింతురు. (39)

శ్లో ॥ తుల్యకలా ఇమే రాజన్ ! మ్లేచ్ఛప్రాయాశ్చ భూభృతః
ఏతేఽధర్మానృతపరాః ఫల్గుదాస్తీవ్రమన్యవః - 40

టీ :- తుల్యేతి. ఇమే మ్లేచ్ఛప్రాయాః భూభృతః తుల్యకాలాః భవిష్యంతి. కించ. ఏతే సర్వే అధర్మానృతపరాః అధర్మే అనృతే చ పరినిష్ఠితాః ఫల్గుదాః అల్పదాతారః. (40)

మ్లేచ్ఛులతో సమానులైన ఈ రాజులందరు ఏకకాలములో రాజ్యములను పాలింతురు. వీరందరును అధర్మమును, అసత్యమును అవలంబించువారై, అల్పదాతలై, తీవ్రావేశముగలవారై ఉందురు. (40)

శ్లో ॥ స్త్రీబాలగోద్విజఘ్నాశ్చ పరదారధనాదృతాః
ఉదితాస్త మితప్రాయాః అల్ప సత్త్వాల్ప కాయుషః - 41

టీ :- స్త్రీతి. ఉదితాస్తమితప్రాయాః హర్షశోకాదిబహులాః. (41)

వీరు స్త్రీలను, బాలకులను, బ్రాహ్మణులను చంపుచు, పరస్త్రీలను, పరధనములను అపహరించుచు, హర్షశోకాదులనను భవించుచు, అల్పబలులై, అల్పాయుష్మంతులై ఉండగలరు. (41)



శ్లో ॥ అసంస్కృతాః క్రియాహీనాః రజసా తమసావృతాః
ప్రజాస్తే భక్షయిష్యన్తి మ్లేచ్ఛా రాజన్యరూపిణః - 42

టీ :- అసంస్కృతా ఇతి. అసంస్కృతాః గర్భాదానాది సంస్కారరహితాః. ప్రజాః భక్షయిష్యంతి ధనాద్యపహారాదినా పీడయిష్యంతి. (42)

శ్లో ॥ తన్నాథాస్తే జనపదాస్త చ్ఛీలాచారవాదినః
అన్యోన్యతో రాజభిశ్చ క్షయం యాస్యంతి పీడితాః - 43

టీ :- కించ. తదితి. తన్నాథాః తే నాథాః యేషాం తే. జానపదాః దేశవర్తినో మనుష్యాః. తచ్ఛీలాచారవాదినః తేషామేవ శీలమాచారో వాదశ్చ తద్వదంతః. (43)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే ద్వాదశస్కంధే ప్రథమోఽధ్యాయః**

వీరు గర్భాదానాది సంస్కారములు లేనివారై, నిష్క్రియులై, రజోగుణ తమోగుణములచే ఆవరింపబడినవారై, రాజుల వేషములో ప్రజల ధనాదులను హరించుచు, వారిని పీడింతురు. (42)

వీరు పాలించు దేశములలోని ప్రజలును, వీరే దిక్కయినవారై, వీరివలెనే దురాచారపరులై అన్యోన్యము పీడించుకొనుచు, ఆ రాజులతో బాటే నశింతురు. (43)

**శ్రీమద్భాగవత మహాపురాణము యొక్క ద్వాదశస్కంధమునందలి ప్రథమాధ్యాయము సమాప్తము.**



ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ



## ద్వితీయోఽధ్యాయః

**శ్రీశుక ఉవాచ**

శ్లో ॥ తతశ్చానుదినం ధర్మః సత్యం శౌచం క్షమా దయా
కాలేన బలినా రాజన్! నంక్ష్యత్యాయుర్బలం స్మృతిః - 1

టీ :- ద్వితీయే తు కలేర్దోషవృద్ధౌ కల్క్యవతారతః, అధర్మిష్ఠే జనే నష్టే పునః కృతయుగాగమః. కలిధర్మాన్ ప్రపంచయతి. తతఇతి.(1)

శ్లో ॥ విత్తమేవ కలౌ నృణాం జన్మాచార గుణోదయః
ధర్మన్యా వ్యవస్థాయాం కారణం బలమేవ హి - 2

టీ :- విత్తమితి. జన్మాచారగుణానాం ఉదయః ఉత్కర్ష హేతుః ధర్మన్యాయయోర్వ్యవస్థాయాం బలమేవ. (2)

శ్లో ॥ దాంపత్యే: భిరుచిర్హేతుర్మాయైవ వ్యావహారికే
స్త్రీత్వే పుంస్త్వేచహి రతిర్విప్రత్వే సూత్రమేవ హి - 3

టీ :- దాంపత్యఇతి. దాంపత్యే భార్యాపతి భావే అభిరుచిరేవ హేతుః . న తు కుల మాచారో వా. (3)

## ద్వితీయాధ్యాయము.

**శుకమహర్షి పలుకుచున్నాడు.**

కలియుగమున దోషములు వృద్ధి చెందును. కల్కి అవతరించగా అధర్మనిష్ఠులైన జనులు నశింతురు. మరల కృతయుగము వచ్చును. కలియుగములో ప్రతిదినము ధర్మము, సత్యము, శౌచము, క్షమ, దయ, ఆయుష్యము, స్మృతి కాలానుగుణముగ నశించిపోవును. (1)

కలియుగమున ధనమే మానవులకు పుట్టుకతో వచ్చిన ఆచారమై, గుణమై, అభివృద్ధియై ఉండును. ధర్మన్యాయవ్యవస్థలలో బలమే ప్రాధాన్యమును వహించును. (2)

భార్యాభర్తలలో కులగోత్రాదుల విచారము లేక కేవలము అభిరుచియే ప్రధానమైయుండును. క్రయ విక్రయాదులలో మోసములుండును. స్త్రీ పురుషులలో రతికౌశలమే ప్రధానమై కులాచారాదులు పరిగణింపబడవు. (3)



శ్లో ॥ లింగమేవాశ్రమ ఖ్యాతావన్యోన్యాపత్తికారణమ్
ఆవృత్త్యా న్యాయదౌర్బల్యం పాండిత్యే చాపలం వచః 4

టీ :- లింగమితి. ఆశ్రమాణాం ఖ్యాతౌ జ్ఞానే లింగమేవ దండాజినాదికం హేతుః నత్వాచారవిశేషః. అన్యోన్యాపత్తికారణం ఆశ్రమాదాశ్రమాంతర ప్రాప్తౌచ కారణం. యద్వా బహూదక హంసాదీనామన్యోన్యావత్తౌ నమస్కారాది వ్యవహారే కారణం. ఆవృత్త్యా ముద్రార్పణాదిదానసామర్థ్యేన న్యాయదౌర్బల్యం పరాజయః చాపలం వచః బహుభాషణం. (4)

వర్ణాశ్రమములను తెలిసికొనుటలో ఆచార వ్యవహారములు కాక, దండము, అజినము మొదలైనవి మాత్రమే గుర్తులైయుండును. ఒక ఆశ్రమమువారు మరియొక ఆశ్రమమునకు మారుటకు ఇవియే కారణములగును. బహూదక హంసాదులలో ఏర్పడిన అన్యోన్యాపత్తి నమస్కారాదివ్యవహారమునకు కారణమగును. ముద్రార్పణము, దానములలో సామర్థ్యము లేని కారణముగ న్యాయమార్గమున పరాజయము కలుగును. పాండిత్యము బహుభూషణ దోషమునకు నెలవగును. (4)

శ్లో ॥ అనాఢ్యతైవా సాధుత్వే సాధుత్వే దంభ ఏవ తు
స్వీకార ఏవ చోద్వాహే స్నానమేవ ప్రసాధనమ్ - 5

టీ :- అనాఢ్యతేతి. అసాధుత్వే చౌర్యాద్యభియోగే. ప్రసాధనమలంకారః (5)

దొంగతనము మొదలైన దుష్టకర్మల వలన అసామర్థ్యము, సాధువుగా నటించుట వలన దంభము (బాహ్యాడంబరము) వివాహాదులయందు కేవలము పైపై స్వీకారమే కాని పరమార్థత ఉండదు. స్నానమే అలంకరణముగాని గుణములు కావు (5)

శ్లో ॥ దూరే వార్యయనం తీర్థం లావణ్యం కేశధారణమ్
ఉదరం భరతా స్వార్థః సత్యత్వే దార్ఢ్ష్యమేవహి - 6

దూరములో నున్న జలాశయమే తీర్థమగును గానీ, గురువులు మొదలైన వారు కాదు. కేశధారణమే లావణ్యమగును. కడుపునింపు కొనుటయే పురుషార్థమగును. దౌర్జన్యమే సత్యమగును.



శ్లో ॥ దాక్ష్యం కుటుంబభరణం యశోఽర్థే ధర్మసేవనమ్
ఏవం ప్రజాభిర్దుష్టాభిరాకీర్ణే క్షితిమండలే - 7

శ్లో ॥ బ్రహ్మవిట్ క్షత్ర శూద్రాణాం యోబలీ భవితా నృపః
ప్రజాహిలుబ్ధై రాజన్యైర్నిర్ఘృణైర్దస్యుధర్మభిః - 8

టీ :- దూరేతి. దూరే వర్తమానం వార్యయనం జలాశయస్తీర్థం న తు శుద్ధ్యాదిః గుర్వాదిర్వా. ఉదరంభరతా కుక్షిపూరణం స్వార్థః పురుషార్థః. (6)

టీ :- దాక్ష్యమితి. కుటుంబభరణ ఏవ దాక్ష్యం పటుత్వం. (7,8)

కుటుంబమును పోషించుటయే దక్షతయగును. ధర్మమునాచరించుట కీర్తి కొరకే యగును. ఈ విధమగు దుష్టప్రజలచే కూడిన భూమండలము నందు బ్రాహ్మణ వైశ్య క్షత్రియ శూద్రులలో బలవంతుడెవడో వాడే రాజగును. లోభులు, నిర్దయులు, దొంగలు అయిన రాజుల పరిపాలనలో ప్రజలు చిక్కుకొనెదరు. (6,7,8,)

శ్లో ॥ ఆచ్ఛిన్నదారద్రవిణాః యాస్యన్తి గిరికాననమ్
శాకమూలామిష క్షౌద్ర ఫల పుష్పాష్టి భోజనాః - 9

శ్లో ॥ అనావృష్ట్యా వినఙ్క్ష్యంతి దుర్భిక్షకరపీడితాః
శీతవాతాతప ప్రావృడ్ హిమై రన్యోన్యతః ప్రజాః - 10

శ్లో ॥ క్షుత్ తృడ్భ్యాం వ్యాధిభిశ్చైవ సంతప్స్యన్తే చ చింతయా
త్రింశద్వింశతివర్షాణి పరమాయుః కలౌ నృణామ్ - 11

అపహరింపడిన భార్యలు, ధనములగలవారై ప్రజలు కొండలు, అడవులకు తరలిపోయి, అక్కడ లభించు శాకములను, కందమూలములను, మాంసమును, తేనెను, పండ్లను, పుష్పములను, మొలకలను తినుచు ఆకలి తీర్చుకొందురు. అనావృష్టితో ఏర్పడిన దుర్భిక్షమునకు బలియై నశించెదరు. చలి, గాలి, ఎండ, మేఘములు, మంచు మొదలైన వానిచే బాధింపడినవారై నశింతురు. ఆకలి దప్పులతోడను, వ్యాధులతోడను, చింతతోడను తపించిపోయెదరు. కలియుగములో



టీ :- ప్రజాఇతి. ఆచ్ఛిన్నాని అపహృతాని దారాః ద్రవిణాని చ యాసాం తాః. (9)

టీ :- శాకేతి. అష్టిర్బీజం. (10,11)

శ్లో ॥ క్షీయమాణేషు దేహేషు దేహినాం కలిదోషతః
వర్ణాశ్రమవతాం ధర్మే నష్టే వేదపథేనృణామ్ - 12

టీ :- క్షీయమాణేష్వితి. క్షీయమాణేష్విత్యాదినాం ఇత్థం కలౌ గతప్రాయ ఇతి పంచమేనాన్వయః. క్షీయమాణేషు అల్పప్రాయేషు. (12)

శ్లో ॥ పాఖండ ప్రచురే ధర్మే దస్యుప్రాయేషురాజసు
చౌర్యానృత వృథాహింసా నానావృత్తిషు వై నృషు - 13

టీ :- పాషండేతి. దస్యుప్రాయేషు చోరతుల్యేషు చౌర్యానృతవృథా హింసాద్యాః నానావృత్తయో యేషాం తేషు. (13)

శ్లో ॥ శూద్రప్రాయేషు వర్ణేషు చ్ఛాగప్రాయాసు ధేనుషు
గృహప్రాయేష్వాశ్రమేషు యౌన ప్రాయేషు బంధుషు- 14

మానవులు ఇరువది ముప్పదిసంవత్సరములే పరమాయుష్యముగా గలవారై యుందురు. (9,10,11)

ఈ విధముగ కలిదోషమువలన జీవుల దేహములు క్షీణించును. వర్ణాశ్రమధర్మములు నశించుటవలన ధర్మమును తెలుపు వేదమార్గము నశించును. (12)

కలియుగమున ధర్మము పాఖండమతమై యుండును. రాజులు దొంగలవంటివారగుదురు. దొంగతనము, అసత్యభాషణము, వ్యర్థహింస మొదలైన పాపకర్మలను జనులాచరింతురు. (13)

కలియుగమున వర్ణములన్నియు శూద్రప్రాయములగును. గోవులు మేకల వంటి వగును. ఆశ్రమములన్నియు గృహముల



టీ :- శూద్రప్రాయేష్వితి. ఛాగప్రాయాసు ప్రమాణతః క్షీరతశ్చ అజాతుల్యాసు గృహప్రాయేషు పరిగ్రహాది బాహుల్యేన గృహతుల్యేషు యౌనప్రాయేషు స్యాలాదిప్రాయేషు. (14)

వంటివగును. బంధువులు ఎక్కువమంది యౌనసంబంధమే ప్రధానముగా గలవారై యుందురు.(14)

శ్లో॥ అణుప్రాయా స్వోషధీషు శమీప్రాయేషు స్థాస్నుషు
విద్యుత్ప్రాయేషు మేఘేషు శూన్యప్రాయేషు సద్మసు - 15

టీ :- అణుప్రాయాస్వితి. అణుప్రాయాసు శ్యామాకతుల్యాసు స్థాస్నుషు వృక్షేషు విద్యుత్ప్రాయేషు తటిద్బహులేషు శూన్యప్రాయేషు ధర్మాదిరహితేషు సద్మసు గృహేషు. (15)

కలియుగమున ఓషధులు అణువులవలె ఎంతో చిన్నవై యుండును. వృక్షములు జమ్మిచెట్లవలె నీడలు లేనివైయుండును. మేఘములు మెరుపులవంటివై జలరహితములై యుండును. గృహములన్నియు ధర్మాచరణాదులు లేక శూన్యములై యుండును. (15)

శ్లో॥ ఇత్థం కలౌ గతప్రాయే జనేతు ఖరధర్మిణి
ధర్మత్రాణాయ సత్త్వేన భగవానవతరిష్యతి - 16

టీ :- ఇత్థమితి. జనేషు ఖరధర్మిషు దుస్సహచేష్టితేషు కలౌ ఇత్థం గతప్రాయే సమాప్తప్రాయే. (16)

ఈ విధముగ గాడిదలవంటి చేష్టలుగల జనులతో కూడిన కలియుగము గడచిపోగానే, ధర్మమును రక్షించుట కొరకు మహాబలముతో భగవంతుడు అవతరించును. (16)

శ్లో॥ చరాచరగురోర్విష్ణోరీశ్వరస్యాఖిలాత్మనః
ధర్మత్రాణాయ సాధూనాం జన్మకర్మా పనుత్తయే - 17

చరాచరములకు గురువైనవాడును, అఖిలాత్ముడు,ఈశ్వరుడును అయిన విష్ణువు యొక్క అవతారము ధర్మమును కాపాడుట కొరకు మరియు సాధువులకు మోక్షమును ప్రసాదించుటకొరకే. (17)



టీ :- ఏతత్ప్రపంచయతి - చతుర్భిః. చరాచరేతి - చరాచరగురోః ఈశ్వరస్యేతిచ. ధర్మత్రాణే హేతుః గురుత్వేశ్వరత్వయోరుపపాదనం. అఖిలస్య విశ్వస్యాత్మనః. కారణస్యేతి. ఏవం భూతస్య విష్ణోర్జన్మ సాధూనాం ధర్మత్రాణాయ ధర్మత్రాణప్రయోజనమాహ - కర్మాపనుత్తయే మోక్షాయ. (17)

శ్లో ॥ శంభలగ్రామముఖ్యస్య బ్రాహ్మణస్య మహాత్మనః
భవనే విష్ణుయశసః కల్కిః ప్రాదుర్భవిష్యతి - 18

శంభలగ్రామములో ముఖ్యుడైన విష్ణుయశును బ్రాహ్మణుని ఇంటిలో కల్కి భగవానుడు అవతరించును. (18)

టీ :- శంభలేతి. శంభలగ్రామే ముఖ్యస్య ప్రధానస్య నామ్నా విష్ణుయశసో బ్రాహ్మణస్య భవనే గృహే. (18)

శ్లో ॥ అశ్వమాశుగమారుహ్య దేవదత్తం జగత్పతిః
అసినాఽసాధుదమనమష్టైశ్వర్యగుణాన్వితః - 19

టీ :- ధర్మత్రాణప్రకారమాహ - అశ్వమితి. అసాధవో దమ్యంతే యేన తమశ్వమారూహ్య అసినా దస్యూన్ కోటిశో నిహనిష్యతీత్యుత్తరేణాన్వయః. అసాధుదమన ఇతి పాఠే కల్కివిశేషణం. అణిమాద్యష్టైశ్వర్యాణి గుణాశ్చ సత్యసంకల్పాదయః తైరన్వితః. (19)

అసాధువులు దేనిచే చంపబడెదరో అది అసాధుదమనము అనెడి గుఱ్ఱము. దానిపై అధిరోహించిన కల్కిభగవానుడు సత్యసంకల్పాదులగు అష్టైశ్వర్యగుణములతో కూడినవాడై అసాధువులైన దొంగలను చంపగలడు. అసాధుదమనమనెడి గుఱ్ఱము దేవతలచే ఈయబడినందున దేవదత్తమని చెప్పబడినది. (19)



శ్లో ॥ విచరన్నాశునా క్షోణ్యాం హయేనా ప్రతిమద్యుతిః
నృపలింగచ్ఛదో దస్యూన్ కోటిశో నిహనిష్యతి - 20

టీ :- దుష్టదమనం ప్రపంచయతి. విచరన్నితి. ఆశునా శీఘ్రగామినా తేన హయేన క్షోణ్యాం విచరన్ నృపలింగచ్ఛదః రాజవేషచ్ఛన్నాన్. (20)

వేగముగా పరుగెత్తగల గుఱ్ఱముపై నిరుపమానతేజస్సు గలవాడై భూమండలమున సంచరించుచు ఆ కల్కిభగవానుడు రాజుల వేషమును కప్పుకొని పాలించుచున్న కోట్లకొలది దొంగలను చంపగలడు. (20)

శ్లో ॥ అథ తేషాం భవిష్యంతి మనాంసి విశదాని వై
వాసుదేవాంగరాగాతి పుణ్యగంధానిలస్పృశామ్
పౌరజానపదానాం వై హతేష్వఖిల దస్యుషు - 21

టీ :- తతశ్చ పునః కృతయుగప్రవృత్తిం వక్తుమాహ - అథేతి. తేషాం పౌరజనపదానాం మనాంసి విశదాని భవిష్యంతి తత్ర హేతుః వాసుదేవస్యాంగరాగేణ చందనాదినా అతిపుణ్యగంధోయః అనిలస్తం స్పృశంతీతి. తథా తేషాం. (21)

కల్కిభగవానుడు ఈ విధముగ దొంగలవంటి రాజులను అందరినీ సంహారింపగా పౌరజానపదుల మనస్సులు విశదములగును. అనగా తేలికపడును. భగవంతుడగు వాసుదేవుని తనువుపైనున్న చందనాదులపైనుండి వీచు గాలులు వారిని స్పృశింపగా ఆనందింతురు. (21)

శ్లో ॥ తేషాం ప్రజావిసర్గశ్చ స్థవిష్ఠః సంభవిష్యతి
వాసుదేవే భగవతి సత్త్వమూర్తౌ హృదిస్థితే - 22

టీ :- తేషామితి. స్థవిష్ఠః స్థూలః. (22)

సత్త్వగుణమునకు నెలవైన భగవంతుడు (వాసుదేవుడు) హృదయములో నివసింపగా ప్రజావినాశనము ఆగిపోవును. (22)



శ్లో ॥ యదాఽవతీర్ణో భగవాన్ కల్కిర్ధర్మపతిర్హరిః
కృతం భవిష్యతి తదా ప్రజాసూతిశ్చ సాత్త్వికే - 23.

టీ :-కృతయుగప్రవృత్తిమాహ-యదావతీర్ణ ఇతి.ప్రజానాం సూతిః 23

ధర్మరక్షకుడైన విష్ణువు కల్కిభగవానుని రూపములో అవతరింపగా ఆ సమయము కృతయుగముగ మారిపోవును. ప్రజాసృష్టియు సాత్త్విక గుణసంపన్నమగును. (23)

శ్లో ॥ యదా చంద్రశ్చ సూర్యశ్చ తథా తిష్యబృహస్పతీ
ఏకరాశౌ సమేష్యన్తి తదా భవతి తత్కృతమ్ - 24

టీ :- తదవతారకాలోపలక్షణమాహ - యదేతి. తిష్యః పుష్యః అయమర్థః చంద్రసూర్యబృహస్పతీనాం యదా పుష్యనక్షత్రయోగః తదా తత్కృతయుగం భవిష్యతీతి. యద్యపి ప్రతిద్వాదశాబ్దం కటకరాశౌ బృహస్పతౌ వర్తమానే ద్విత్రాస్వమావాస్యాసు తేషాం త్రయాణామపి పుష్యయోగస్సంభవతి. తథాపి తేషాం సహ ప్రవేశోఽత్ర వివక్షితః. సమేష్యంతీతి వచనాత్. అతో నాతి ప్రసంగః. (24)

చంద్రుడు, సూర్యుడు, బృహస్పతి పుష్యనక్షత్రములో నుండగా కృతయుగము వచ్చును. (24)

శ్లో ॥ యేఽతీతా వర్తమానా యే భవిష్యంతి చ పార్థివాః
తే త ఉద్దేశతః ప్రోక్తా వంశీయా సోమ సూర్యయోః - 25

నవమస్కంధములో శ్రూయతాం మానవో వంశః అను శ్లోకము నుండి ఆరంభించి చెప్పబడినవారగు అతీతులు, వర్తమానులు అయిన రాజులు సూర్యచంద్ర వంశీయులని సంగ్రహముగ చెప్పబడినది. (25)



టీ :- ఏవం నవమస్కంధమారభ్యో పక్రాంతం వైవస్వతమనోర్వంశ ద్వయం నిగమయతి. - యఇతి. ఉద్దేశ్యతః సంక్షేపతః.(25)

శ్లో ॥ ఆరభ్య భవతో జన్మయావన్నందాభిషేచనమ్
ఏతద్వర్ష సహస్రం తు శతం పంచదశోత్తరమ్ - 26

టీ :- కలియుగావాంతరవిశేషం వక్తుమాహ - ఆరభ్యేతి. వర్షసహస్రం పంచదశోత్తరం శతం చేతి కయాపి వివక్షయా అవాంతరసంఖ్యేయం. వస్తుతస్తు పరీక్షిన్నందయోరంతరం ద్వాభ్యామూనం వర్షాణాం సార్ధం సహస్రం భవతి. యతః. పరీక్షిత్సమకాలం మాగధం మార్జారిమారభ్యరిపుం జయాంతాః వింశతిరాజానః సహస్రసంవత్సరాన్ భోక్ష్యతీత్యుక్తం నవమస్కంధే యే బార్హద్రథభూపాలా భావ్యాస్తే సహస్రవత్సరమితి. తతః పరం చ ప్రద్యోతనా. అష్టంత్రింశోత్తరశతం శైశునాభాశ్చ షష్ట్యుత్తరశత త్రయం భోక్ష్యంతి పృథివీమిత్యత్రైవోక్తత్వాత్. (26)

శ్లో ॥ సప్తర్షీణాం తు యౌ పూర్వౌ దృశ్యేతే ఉదితౌ దివి
తయోస్తు మధ్యే నక్షత్రం దృశ్యతే యత్సమం నిశి 27

పరీక్షిత్తు, నందరాజుల మధ్యనగల కాలము తక్కువలో తక్కువగా సార్ధసహస్రము (అనగా ఒకవేయి, అయిదువందల సంవత్సరములు) ఎందుకనగా పరీక్షిత్తు సమాకాలికుడైన మగధరాజు మార్జారి మొదలుకొని రిపుంజయుని వరకు ముప్పదిమంది రాజులు ఒక వేయి సంవత్సరములు పాలింతురని నవమస్కంధములోని యే బార్హద్రథభూపాలాః భావ్యాః సాహస్రవత్సరమ్, అను శ్లోకములో చెప్పబడినది. ఆ తరువాత ఐదుగురు ప్రద్యోతనులు నూటముప్పది యెనిమిది సంవత్సరములు, శిశునాగులు మున్నూటరువది సంవత్సరములు భూమిని పాలింతురని అదే సందర్భములో చెప్పబడినది. కావున పరీక్షిత్తు జననము మొదలుకొని, నందరాజు రాజ్యాభిషేకము వరకు ఒక వేయి అయిదు వందల సంవత్సరములు గడచినవని తాత్పర్యము. (26)

కలియొక్క ప్రవృత్తిని, వృద్ధిని తెలుపుటకు ఈ రెండు శ్లోకములలో కాలజ్ఞానమును వివరించుచున్నాడు - తూర్పు దిక్కున పై భాగమున శకటాకారముననున్న ఏడు నక్షత్రములసముదాయమే

శ్లో ॥ తేనైవ ఋషయో యుక్తాస్తి ష్ఠన్త్యబ్దశతం నృణామ్
తే త్వదీయే ద్విజాః కాలే అధునా చాశ్రితా మఘాః - 28

టీ :- కలియుగస్య ప్రవృత్తిం వృద్ధిం చ నిరూపయితుం కాలజ్ఞానోప లక్షణమాహ - సప్తర్షీణామితి. అయమర్థః. ప్రాగగ్ర శకటాకారం తారాసప్తకం సప్తర్షిమండలం తత్ర కించిదున్నతే తేషామగ్రస్థానీయో మరీచిః తతః పశ్చాదానమ్రయుగకంధరాకారో వసిష్ఠస్సభార్యాః తతః పశ్చాదీషదుత్తరస్థానీయోఽంగిరాః తతః. పశ్చాచ్చతురశ్రతారాచ తుష్కే ఐశాన్యే అత్రిః. తతో దక్షిణతః పులస్త్యః పులస్త్యాత్పశ్చిమతః పులహః తత ఉత్తరతః క్రతుః. ఏవం స్థితే తేషాం మధ్యే యౌ పూర్వౌ. ఉదయసమయే ప్రథమముదితౌ దృశ్యేతే తౌపులహక్రతుసంజ్ఞౌ తయోస్తు మధ్యే తయోస్తు పూర్వయోస్తు మధ్యే తత్సమం దక్షిణతః సమదేశావ స్థితమశ్విన్యాదిషు యదన్యతమం నక్షత్రం దృశ్యతే. తేన తథైవ యుక్తాః నృణామబ్దశతం తిష్ఠంతి. తే చ ద్విజాస్త్వదీయే కాలే అధునా మఘా ఆశ్రితా వర్తంతే. (27,28)

శ్లో ॥ విష్ణోర్భగవతో భానుః కృష్ణాఖ్యోఽ సౌ దివంగతః
తదా విశత్కలిర్లోకం పాపే యద్రమతే జనః - 29

సప్తర్షిమండలము. వానిలో అగ్రస్థానముననున్నవాడు మరీచి, పిదప ఆనమ్రకంధరాకారములో నున్నవాడు భార్యాసహితుడైన (అరుంధతీ సహితుడైన) వసిష్ఠుడు. ఆ తరువాత కొంచెము ఉన్నతముగనున్న వాడు అంగీరసుడు. అటుపిమ్మట చతురస్రాకృతిలో నున్న నాలుగు నక్షత్రములలో ఈశాన్యముననున్నవాడు అత్రి. అతనికి దక్షిణమున నున్నవాడు పులస్త్యుడు. అతనికి పశ్చిమమున నున్నవాడు పులహుడు. అతనికి ఉత్తరదిశలోనున్న వాడు క్రతువు. ఈ విధముగనున్న వారి నడుమ ఉదయకాలమున ఎవరు తొలుత ఉదయించినవారై తూర్పుదిశలో కనబడుదురో, అట్టి పులహ, క్రతువుల నడుమ సమానముగ దక్షిణోత్తరరేఖలో అశ్విన్యాదులలో సమదేశమున ఏ నక్షత్రము కనబడునో, ఆ నక్షత్రముతో కూడిన ఋషులు మానవుల కాలమానములోని నూరు సంవత్సరములు నిలుతురో, ఆ ఋషులే పరీక్షిత్తుకాలమున, మఘానత్రములైయున్నవి. (27,28)

ఈ విధముగ మఘానత్రములుండగా విష్ణు భగవానుని యొక్క శుద్ధసత్త్వాత్మకమగు భానుదేహము వైకుంఠమునకు వెళ్ళును. అప్పుడే కలియుగము ప్రవేశించును. ఈ కలియుగమున జనులు పాపము



టీ :- విష్ణోరితి. తేషు మాఘాసు వర్తమానేషు సత్సు యదాతు విష్ణోర్భానుః భాతీతి భానుః శుద్ధసత్త్వాత్మకో దేహః. దివం వైకుంఠం గతః. తదా కలియుగమావిశత్. యత్ యస్మిన్ యుగే మనః పాపే రమత ఇతి కలియుగస్య లక్షణం. (29)

శ్లో ॥ యావత్సపాదపద్మాభ్యాం స్పృశన్నాస్తే రమాపతిః
తావత్కలిర్వై పృథివీం పరాక్రాన్తుం నచాశకత్ - 30

టీ :- నను శ్రీకృష్ణే పృథివ్యాం వర్తమానేఽపి సంధ్యారూపేణ కలిః ప్రవిష్ట ఏవాసీత్. సత్యం తథాపి తావత్తస్య పరాక్రమోనాభవదిత్యాహ - యావదితి. పరాక్రాంతుం అభిభవితుం. (30)

శ్లో ॥ యదా దేవర్షయః సప్త మఘాసు విచరన్తి హి
తదా ప్రవృత్తస్తు కలిర్ద్వాదశాబ్ద శతాత్మకః - 31

టీ :- అతో యథోక్తఏవ కలిప్రవేశకాల ఇత్యాహ. యదేతి. ద్వాదశాబ్ద శతాత్మక ఇతి. దివ్యేన మానేన సంధ్యాసంధ్యాంశాభ్యాం సహ యో ద్వాదశాబ్దశతాత్మకః. సకలిస్తదా సంధ్యామతిక్రమ్య ప్రవిష్ట ఇత్యర్థః 31

నందే రమింతురు. ఇది కలియుగ లక్షణము. (29)

శ్రీకృష్ణుడు ఈ భూమిపై ఉన్న సమయములోనే కలి సంధ్యా రూపమున భూమిపై ప్రవేశించినను, అతడు తన ప్రభావమును మాత్రము కృష్ణుడున్నంతవరకు చూపలేకపోయెను.(30)

మఘానక్షత్రములలో ఏడుగురు దేవర్షులు చరించినప్పుడు దేవమానములో పన్నెండు సంవత్సరములు గడచుచుండగా కలి సంధ్యనతిక్రమించి భూమిపై అడుగిడెను. (31)



శ్లో ॥ యదా మఘాభ్యోయాస్యన్తి పూర్వాషాఢాం మహర్షయః
తదా నందాత్ప్రభృత్యేష కలిర్వృద్ధిం గమిష్యతి - 32

టీ :- కలేః ప్రవేశకాల ముక్త్వా తస్య వృద్ధికాలమాహ - యదేతి. తదా ప్రద్యోతనాత్ప్రభృతి వృద్ధిం గచ్ఛన్నందాత్ప్రభృత్యతివృద్ధిం గమిష్యతీత్యర్థః. (32)

సప్తర్షులు మఘానక్షత్రములనుండి పూర్వాషాఢలోనికి ఎప్పుడు ప్రవేశింతురో ఆ సమయములో కలి, ప్రద్యోతనుని మొదలుగా వృద్ధి చెందుచు, నందుని మొదలుగా అమితవృద్ధి నందును. (32)

శ్లో ॥ యస్మిన్ కృష్ణోదివం యాతస్తస్మిన్నేవ తదా: హని
ప్రతిపన్నం కలియుగమితి ప్రాహుః పురావిదః - 33

టీ :- నను యదా కలేర్లింగ ముపలబ్ధం తదైవ ప్రవిష్ట ఇతి యుక్తం తతః పూర్వమేవ ప్రవేశః. తతః పరం వృద్ధిరిత్యత్ర కిం ప్రమాణం? తత్రాహ - యస్మిన్నితి. ప్రతిపన్నం ప్రవిష్టమితి జ్ఞానం పురావిదః పూర్వజ్ఞాతారః. (33)

కృష్ణుడు తన అవతారమును చాలించి, ఏ సమయమున వైకుంఠమునకేగెనో ఆ సమయముననే కలియుగము ప్రారంభమైనదని ప్రాచీనులు చెప్పిరి. (33)

శ్లో ॥ దివ్యాబ్దానాం సహస్రాంతే చతుర్థేతు పునః కృతమ్
భవిష్యతి యదా నృణాం మన ఆత్మప్రకాశకమ్ - 34

దేవతల కాలమానములో కలియుగమున వేయి సంవత్సరములు గడువగా, మానవుల మనస్సులలో ఆత్మప్రకాశము కలిగినప్పుడు మరల కృతయుగమావిర్భవించును. (34)





టీ :- కలేరంతం కృతయుగప్రవేశంచాహ - దివ్యాబ్దానామితి. చతుర్థే కలౌ ప్రవేశానాబ్దపరిమితేనాంశేనాపి సహ గతే సతీత్యర్థః కృతయుగ ప్రవేశచిహ్నమాహ - యదా నృణాం మన ఆత్మప్రకాశకం భవిష్యతి తదేతి. (34)

శ్లో ॥ ఇత్యేష మానవో వంశో యథా సంఖ్యాయతే భువి
తథా విట్శూద్రవిప్రాణం తాస్తా జ్ఞేయా యుగే యుగే - 35

టీ :- రాజవంశోక్తాం స్థితిం బ్రాహ్మణాదివంశేష్వపృతిదిశతి - ఇతీతి. యథా యాభిరుచ్చనీచావస్థాభిస్తాస్తా అవస్థాః వంశా ఇతి చ పాఠః 35

శ్లో ॥ ఏతేషాం నామలింగానాం పురుషాణాం మహాత్మనామ్
కథామాత్రావశిష్టానాం కీర్తిరేవ స్థితా భువి - 36

టీ :- ఏతత్కీర్తనస్య వైరాగ్యోపయోగితామాహ - ఏతేషామితి. నామైవ లింగం జ్ఞాపనం యేషాం తేషాం. కథామాత్రైనైవావశిష్టానాం కీర్తిరేవ స్థితా. న తు రాజ్యం పుత్రాదయో వా. (36)

ఈ విధముగ భూలోకమున బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రుల వంశములెట్లు చెప్పబడినవో, అట్లే ప్రతియుగమున సంభవించు చుండునని తెలిసికొనవలెను. (35)

ఇట్లు భూలోకమున పేర్కొనబడిన మహాత్ములగు పురుషులు కేవలము కథలలో మాత్రమే మిగిలిరి. వీరి పేర్లు వీరి గుర్తులు తప్ప వారి పుత్రులు మొదలైన వారు గానీ, రాజ్యములు గానీ మిగలవు. (36)





శ్లో ॥ దేవాపిః శన్తనోర్భ్రాతా మరుశ్చేక్ష్వాకువంశజః
కలాపగ్రామ ఆసాతే మహాయోగబలాన్వితౌ - 37

శ్లో ॥ తావిహైత్య కలేరన్తే వాసుదేవానుశిక్షితౌ
వర్ణాశ్రమయుతం ధర్మం పూర్వవత్ప్రథయిష్యతః - 38

టీ :- కలావుత్పన్నానాం రాజవంశాదీనాం పునః ప్రవృత్తిప్రకార మాహ - దేవాపిరితి. దేవాపిః సోమవంశజః కలాపగ్రామోనామ యోగినామావాసః ప్రసిద్ధః. (37,38)

చంద్రవంశములో జన్మించు దేవాపి, సూర్యవంశములో ఇక్ష్వాకు కులమున ప్రభవించు మరువు యోగులకు నివాసమైన కలాప గ్రామములో నివసింతురు. శ్రీకృష్ణుని మార్గదర్శనమున మరల వర్ణాశ్రమ ధర్మములను పూర్వమువలె కాపాడగలరు. (37,38)

శ్లో ॥ కృతం త్రేతా ద్వాపరం చ కలిశ్చేతి చతుర్యుగమ్
అనేన క్రమ యోగేన భువి ప్రాణిషు వర్తతే - 39

టీ :- ఇమమేవ ప్రకారం ప్రతిచతుర్యుగం దర్శయతి. కృతమితి. 39

కృత, త్రేత, ద్వాపర, కలియుగములు ఇదే విధముగ భూలోకమున ప్రాణుల విషయములో పరిణమింపగలవు. (39)

శ్లో ॥ రాజన్నేతే మయా ప్రోక్తా నరదేవాస్తథాపరే
భూమౌ మమత్వం కృత్వాన్తే హిత్వేమాం నిధనంగతాః - 40

టీ :- ఏతేషాం నామలింగానామిత్యాది యదుక్తం తత్ప్రపంచయతి - పంచభిః. రాజన్నితి. (40)

పూర్వము చెప్పిన రాజులు భూమండలమున స్వార్థమును పెంచి, చివరికి నశింపగలరు. (40)



శ్లో ॥ కృమివిడ్భస్మ సంజ్ఞాన్తే రాజన్నామ్నోపి యస్యచ
భూతద్రుక్ తత్కృతే స్వార్థం కిం వేద నిరయోయతః - 41

టీ :- మమత్వం కృత్వేత్యనేన సూచితాం భూతద్రోహప్రవృత్తిం నిందతి - క్రిమీతి. రాజనామ్నః రాజేతినామ యస్య తస్యాపి దేహస్యాంతే క్రిమయో విట్ నిష్ఠా భస్మేతి వా సంజ్ఞా భవిష్యతి. తత్కృతే. తదర్థం. యో భూతద్రుక్ భూతేభ్యోద్రుహ్యతీతి సః కిం స్వార్థం వేద. కింతు న వేద కుత ఇత్యపేక్షాయాం హేతుత్వేన భూతద్రోహం విశినష్టి - యతో భూతద్రోహాన్నిరయో భవతీతి.(41)

రాజులపేరుతో నున్న వీరి దేహములు క్రిమిరూపములు గానో, భస్మరూపములుగానో మిగులును. వీరు భూతద్రోహము (ప్రాణుల వంచన) చేసినందున ఏ దిక్కులేనివారై మరణింపగలరు.(41)

శ్లో ॥ కథం సేయమఖండా భూః పూర్వైర్మే పురుషై ర్ధృతా
మత్పుత్రస్యచ పౌత్రస్య మత్పూర్వా వంశజస్యవా - 42

టీ :- మమత్వప్రకారం ప్రపంచయతి - కథమితి. సేయమఖండా భూర్భూమిః. మే పూర్వజైః పురుషైః ధృతా సతీ. ఇదానీం మత్పూర్వా చ సతీ మత్పుత్రాదేః కథంస్యాదిత్యేవం. (42)

ఈ భూమండలమంతయు మా పూర్వపురుషులచే అనుభవింప బడినది కావున, నా పుత్ర పౌత్రులకు కూడ అనుభవయోగ్యము కావలెనను స్వార్థబుద్ధి కలవారై యుందురు.(42)

శ్లో ॥ తేజోఽబన్నమయం కాయం గృహీత్వాఽత్మతయాబుధాః
మహీం మమతయా చోభౌ హిత్వాంతే: దర్శనం గతాః - 43

దేహమునే ఆత్మగా భావించినవారై, ఈ భూమిని స్వార్థముతో అనుభవించి ఈ రాజులు చివరికి మృత్యువును చేరుకొందురు. (43)



టీ :- తేజ ఇతి. ఉభౌమహీం కాయం చ నిధనం మృత్యుం. (43)

శ్లో ॥ యే యే భూపతయో రాజన్ భుంజతే భువ మోజసా
కాలేన తే కృతాః సర్వే కథా మాత్రాః కథాసు చ - 44

టీ :- ఉపసంహరతి. - యఇతి. తే సర్వే చ. కథాసు క్రియమాణాసు కథామాత్రాః కాలేన కృతాః. (44)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే ద్వాదశస్కంధే ద్వితీయోఽధ్యాయః**

ఓజోగుణముతో ఈ భూమిని అనుభవించిన రాజులందరు కాలగర్భములో కలసినవారై కథామాత్రావశిష్టులగుదురు. (44)

**శ్రీమద్భాగవత మహాపురాణము యొక్క ద్వాదశస్కంధమునందలి ద్వితీయాధ్యాయము సమాప్తము.**



## తృతీయోఽధ్యాయః

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ దృష్ట్వాఽఽత్మని జయే వ్యగ్రాన్నృపాన్ హసతి భూరియమ్
అహోమా విజిగీషన్తి మృత్యోః క్రీడనకాః నృపాః - 1

టీ :- తృతీయే భూమిగీతైస్తు రాజ్యదోషాది వర్ణ్యతే, కలౌ చ దోషభూయిష్ఠే దోషహంత్రీ హరేర్నతిః. దేహేఽహంతాం భూమౌచ మమతాం కుర్వంతో బుధా ఇత్యుక్తం. తదేవ భూమిగీతైః ప్రపంచయతి. - దృష్ట్వేతి. ఆత్మని పృథివ్యాం జయే వ్యగ్రాన్ ఉద్యుక్తాన్ హాసప్రకార మేవాహ - అహో ఇతి. (1)

శ్లో॥ కామ ఏష నరేంద్రాణాం మోఘః స్యాద్విదుషామపి
యేన ఫేనోపమే పిండే యేఽతి విశ్రంభితా నృపాః - 2

టీ :- కామ ఇతి. యేన కామేన ఫేనోపమే పిండే దేహే అతి విస్రంభితాః విశ్వాసం నీతాః యే తేషాం నరేంద్రాణాం స ఏష కామః మోఘస్స్యాత్. (2)

## తృతీయాధ్యాయము

ఈ భూమండలమును దేహబలముతోనే జయింపగోరిన రాజులను చూచి భూదేవి - 'అహో! మృత్యువుతో క్రీడించు ఈ రాజులు నన్ను గెలుచుచున్నారు' అని పరిహసించుచున్నది. (1)

నురుగవంటి మానవదేహములో విశ్వాసము నుంచిన ఈ రాజుల కోరిక వ్యర్థమే యగును గాని సఫలము కాదు.(2)



శ్లో ॥ పూర్వం నిర్జిత్య షడ్వర్గం జేష్యామో రాజమంత్రిణః
తతః సచివ పౌరాప్త కరీంద్రానస్య కంటకాన్ - 3

శ్లో ॥ ఏవం క్రమేణ జేష్యామః పృథ్వీం సాగరమేఖలామ్
ఇత్యాశాబద్ధహృదయా న పశ్యంత్యంతికేఽన్తికమ్ - 4

టీ :- కామమేవ దర్శయతి. - ద్వాభ్యాం. పూర్వమితి. ఇంద్రియార్థ లంపటస్య న రాజ్యప్రాప్తిస్స్యాదితి ప్రథమమింద్రియ షడ్వర్గం నిర్జిత్య. రాజమంత్రిణో జేష్యామః వశీకరిష్యామః. సచివాః అమాత్యాః కరీంద్రాః హస్తిపాః తాంశ్చ జేష్యామః. కంటకాన్ ప్రతిపక్షాన్ అస్య అపాస్య అథ కంటకానితివా పాఠః.ఇతి ఏవం కేచిదాశాబద్ధ హృదయాః. (3,4)

మొదట కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యమలనెడి అరిషడ్వర్గములను జయించి, రాజులను, మంత్రులను, వశపరచుకొందుమనియు, అటు పిమ్మట సచివులను, పౌరులను, ఏనుగులు మొదలైన సంపదలను, ముళ్ళవంటి ప్రతిపక్షులను క్రమముగా వశపరచుకొని, సముద్రమే మొలత్రాడుగాగల ఈ భూమిని జయింతుమని ఆశాబద్ధ హృదయులైనవారు తమదరికి చేరుచున్న మృత్యువును చూడరు. (3,4)

శ్లో ॥ సముద్రావరణాం జిత్వా మాం విశంత్యబ్ధి మోజసా
కియదాత్మజయస్యైతన్ముక్తిరాత్మజయే ఫలమ్ - 5

టీ :- సముద్రావరణామితి. ఏవం కేచిత్పునర్మాం జిత్వాప్యతి తృష్ణయా అబ్ధిం విశంతి. తదేవమింద్రియజయేన యే రాజ్యం సాధయితుమిచ్ఛంతి తేఽతిమందా ఇత్యాహ - కియదితి. (5)

ఈ విధముగ కొందరు దురాశాపరులు సముద్రములచే ఆవరింపబడిన భూమిని జయించియు, అతితృష్ణచే సముద్రములో పడుచున్నారు. ఈ విధముగ ఇంద్రియములను జయించి రాజ్యమును సాధింపదలచినవారు మంద బుద్ధులే కాగలరు. (5)



శ్లో ॥ యాం విసృజ్యేవ మనవస్తత్సుతాశ్చ కురూద్వహ!
గతాయథాగతం యుద్ధే తాం మాం జేష్యంత్యబుద్ధయః - 6

టీ :- అతః అంతకం న పశ్యంతీత్యుక్తం. తదేవాహ - యామితి. కురూద్వహేతి భూమిగీతం కథయన్ శుకస్సంబోధయతి - కులోద్వహ - ఇతి పాఠస్సుగమః. (6)

మనువులు, వారి పుత్రులే నన్ను వదలి కాలగర్భములో కలిసిపోగా ఈ రాజులు నన్ను యుద్ధమున జయింతుమని పల్కుట వారి బుద్ధిలేని తనమునకు నిదర్శనము. (6)

శ్లో ॥ మత్కృతే పితృపుత్రాణాం భ్రాతౄణాం చాపి విగ్రహః
జాయతే హ్యసతాం రాజ్యే మమతాబుద్ధి చేతసామ్ - 7

శ్లో ॥ మమేవేయం మహీకృత్స్నా న తే మూఢేతి వాదినః
స్పర్ధమానా మిథోఘ్నంతిః మ్రియంతే మత్కృతే నృపాః - 8

టీ :- అబుద్ధయ ఇత్యుక్తం తత్ప్రపంచయతి - మత్కృత ఇతి.(7,8)

భూమి కొరకే తండ్రి కొడుకుల మధ్యన, అన్నదమ్ముల మధ్యన వైరమేర్పడును. స్వార్థబుద్ధులైన దుష్టుల రాజ్యములలో ఇదే తీరు కనబడును. ఈ భూమండలమంతయు నాదేకాని, నీదికాదు. అని వాదించుకొనుచు రాజులెందరో పరస్పరము కలహించుకొని, చంపుకొనుచు మరణింతురు. (7,8)

శ్లో ॥ పృథుః పురూరవాగాధిర్నహుషో భరతోఽర్జునః
మాంధాతా సగరో రామః ఖట్వాంగో ధుంధుహారఘుః - 9

శ్లో ॥ తృణబిందుర్యయాతిశ్చ శర్యాతిః శన్తనుర్గయః
భగీరథః కువలయాశ్వః కకుత్స్థోనైషధోనృగః - 10

పృథువు, పురూరవుడు, గాది, నహుషుడు,భరతుడు, అర్జునుడు, మాంధాత, సగరుడు, రాముడు, (ఈతడు దశరథ పుత్రుడైన రాముడు కాదు. అయినను లోకదృష్టితో దాశరథి యనుకొన్నను నష్టము లేదు), ఖట్వాంగుడు, ధుంధుహుడు, రఘువు, తృణబిందువు, యయాతి,



టీ :- పృథురితి. రామోనామ కశ్చిద్రాజా. యద్వా - లోకదృష్ట్యా దాశరథిరేవ నిర్దిష్టః. (9,10)

శ్లో ॥ హిరణ్యకశిపుర్వృత్రో రావణో లోకరావణః
నముచిః శంబరో భౌమౌ హిరణ్యాక్షోஉథ తారకః - 11

శ్లో ॥ అన్యేచ బహవో దైత్యా రాజానో యేమహేశ్వరాః
సర్వే సర్వవిదః శూరాః సర్వే సర్వజితోஉ జితాః - 12

టీ :- హిరణ్యకశిపురితి.లోకాన్ రావయతి రోధయతీతి లోకరావణః. (11,12)

శ్లో ॥ మమతాం మయ్యవర్తంత కృత్వో చ్చైర్మర్త్యధర్మిణః
కథావశేషాః కాలేన హ్యకృతార్థాః కృతా విభో ! - 13

టీ :- మమతామితి. మయి ఉచ్చైః మమతాం కృత్వా యే వర్తంతే. తే కాలేన కథావశేషాః కృతాః. విభో ఇతి సంబోధనం కురూద్వహేతి వత్. (13)

శర్యాతి, శంతనుడు, గయుడు, భగీరథుడు, కువలయాశ్వుడు, కకుత్స్థుడు, నైషధుడు (నలుడు), నృగుడు మొదలైన సర్వజ్ఞులైన శూరులెందరో కాలగర్భములో కలిసిపోయిరి. (9,10)

హిరణ్యకశిపువు, వృత్రుడు, లోకములను దుఃఖింపజేయు రావణుడు, నముచి, శంబరుడు, భౌముడు, హిరణ్యాక్షుడు, తారకుడు, మున్నగు దైత్యులు మరియు రాజులెందరో మహాసంపన్నులై, సర్వజ్ఞులై, శూరులై, సకలమును జయించిన వారైయుండియు కాలక్రమమున నశించిరి. (11,12)

భూమిని శాశ్వతముగ పొందవలెననెడి దురాశతో ఉండిన రాజులందరు కాలవశమున నశించి, కథలలో మాత్రమే మిగిలిన వారైరి. (13)



శ్లో ॥ కథా ఇమాస్తే కథితా మహీయసాం
వితాయ లోకేషు యశః పరేయుషామ్
విజ్ఞాన వైరాగ్య వివక్షయా విభో
వచోవిభూతీర్నతు పారమార్థ్యమ్ - 14

టీ :- రాజవంశానుకథనస్య తాత్పర్యమాహ - కథా ఇతి. విజ్ఞానం విషయసారతాజ్ఞానం తతో వైరాగ్యం తయోర్వివక్షయా పరేయుషాం మృతానాం వచోవిభూతిః వాగ్విలాసమాత్రరూపా. న తు పారమార్థ్యం పరమార్థత్వం కథానాం న భవతీత్యర్థః. (14)

మహానుభావులైన ఈ రాజుల కథలను చెప్పుట వలన విషయ జ్ఞానము కలుగుననియు వైరాగ్యము కలుగదనియు, వీరితో పోల్చినప్పుడు ఇతరమృతులైన వారు వాగ్విలాసమాత్రమున పేర్కొనదగినవారే కాని, ఇతర విశేషమేదియు లేదని చెప్పుట ఉద్దేశ్యమేగాని ఇంతకు మించిన పరమార్థమేమియులేదు. (14)

శ్లో ॥ యస్తూత్తమశ్లోకగుణానువాదః
సంగీయతేఽభీక్ష్ణ మమంగలఘ్నః
తమేవ నిత్యం శృణుయాదభీక్ష్ణం
కృష్ణే౽ మలాం భక్తి మభీప్సమానః 15

టీ :- కస్తర్హి పురుషాణాముపాదేయః పరమార్థస్తమాహ - య ఇతి. నిత్యం ప్రత్యహం తత్రాప్యభీక్ష్ణం. (15)

కృష్ణుని యెడల నిర్మల భక్తిని కోరువారు మాటిమాటికి నిత్యము ఉత్తమ గుణసంపన్నులైన మహాత్ములను కీర్తింపవలెను. అట్లు కీర్తించుట అమంగళమును నశింపజేయును. (15)



**రాజోవాచ**

శ్లో ॥ కేనోపాయేన భగవన్ ! కలేర్దోషాన్ కలౌ జనాః
విధమిష్యన్త్యుపచితాంస్తన్మే(బ్రూహి యథా మునే ! - 16

టీ :- కలిదోషోపచయే సతి భక్తేరసంభవం మన్యమానః పృచ్ఛతి. - కేనేతి. విధమిష్యంతి నాశయిష్యంతి. యథా యథావత్. (16)

**రాజు పలుకుచున్నాడు.**

కలిదోషము పెరుగుచుండగా భక్తి నిలుచుట అసంభవమని తలచిన పరీక్షిన్మహారాజు శ్రీశుకుని ప్రశ్నించుచున్నాడు - 'ఓ మహర్షీ! కలియుగమున జనులు ఏ ఉపాయముతో కలిదోషములను నశింపజేసికొనగలరో ఆ ఉపాయమును యథాతదముగ తెలుపుము(16)

శ్లో ॥ యుగాని యుగధర్మాంశ్చ మానం ప్రళయకల్పయోః
కాలస్యేశ్వర రూపస్య గతిం విష్ణోర్మహాత్మనః - 17

టీ :- కలియుగే కః పరమోధర్మ ఇతి బుభుత్సయా పృచ్ఛతి - యుగానీతి. బ్రూహీత్యనుషంగః ఆత్యంతికప్రలయే జిజ్ఞాసయా పునః పృచ్ఛతి ప్రలయకల్పయోః సంహారస్థితికల్పయోః నచాయం బహిర్ముఖప్రశ్న ఇత్యాహ - కాలస్యేతి. (17)

కలియుగమున ఉత్తమమగు ధర్మమును గూర్చి తెలిసికొనగోరిన వాడై పరీక్షిత్తు ప్రశ్నించుచున్నాడు. 'ఓ మునీ ! యుగములను, వాని ధర్మములను, ప్రళయ స్థితికాలముల ప్రమాణములను, కాలరూపుడైన మహాత్ముడగు విష్ణువు యొక్క స్థితిని వివరింపుము' అని (17)

**శ్రీ శుక ఉవాచ**

శ్లో ॥ కృతే ప్రవర్తతే ధర్మశ్చతుష్పాత్తజ్జనైర్ధృతః
సత్యం దయాతపో దానమితి పాదా విభోర్నృప! - 18

యుగధర్మములను గూర్చి శ్రీశుకుడు పరీక్షిత్తుతో ఇట్లు పలుకుచున్నాడు. ' ఓ రాజా! కృతయుగమున తత్కాలీన జనులచే ధర్మము నాల్గు పాదములుగ నడచును. సత్యము, దయ, తపస్సు,



టీ :- తత్ర యుగధర్మాంస్త్వవదాహ - కృత ఇతి. తజ్జ్ఞైస్తద్యుగవర్తిభిర్జ్ఞైః. దానం అరాగద్వేషతయా అభయదానం. తదేవ ప్రథమస్కంధే శౌచశబ్దేనోక్తం. విభోస్సంపూర్ణస్య ధర్మస్య. (18)

దానము అనునవి ఆ యుగమునకు నాల్గు పాదములై యుండును. ఇచట దానమనగా రాగద్వేషములు లేక అభయమొసగుటయే. దీనిని ప్రథమ స్కంధమున శౌచమనిరి. (18)

శ్లో ॥ సంతుష్టాః కరుణామైత్రాః శాన్తాః దాన్తాస్తితిక్షవః
ఆత్మారామాః సమదృశః ప్రాయశః శ్రమణా జనాః - 19

టీ :- తదానీంతనజనానాహ - సంతుష్టా ఇతి. మైత్రాః భూతమైత్రీయుక్తాః. శ్రమణాః ఆత్మజ్ఞానాభ్యాసవంతః. (19)

కృతయుగమున జనుల స్వభావములను పేర్కొనుచున్నాడు - కృతయుగమున జనులందరు సంతోషముగలవారై యుందురు. కరుణ గలవారై యుందురు. భూతదయగలవారై యుందురు. శాంతమనస్కులై యుందురు. ఇంద్రియనిగ్రహము గలవారై యుందురు. క్షమాగుణ సంపన్నులై యుందురు. ఆత్మానందముతో కూడినవారై యుందురు. సమానదృష్టి గలవారై యుందురు. ఆత్మోన్నతికై నిరంతరమభ్యాసనము నొనర్చువారై యుందురు. (19)

శ్లో ॥ త్రేతాయాం ధర్మపాదానాం తుర్యాంశో హీయతే శనైః
అధర్మపాదైరనృతహింసా సంతోషవిగ్రహైః - 20

టీ :- త్రేతాయామితి. అనృతేన సత్యం హింసయా దయా అసంతోషేణ తపః విగ్రహేణ దానమితి యథాయోగ్యం యోజ్యం. (20)

త్రేతాయుగమున అధర్మ పాదములతో ధర్మపాదములు త్వరగా క్షీణించి పోవును. అసత్యముతో సత్యము నశించును. హింసతో దయ కనుమరుగగును. దుఃఖముతో తపస్సు దూరమగును. వైరముతో దానములు క్షీణించును. (20)



శ్లో ॥ తదా క్రియాతపోనిష్ఠా నాతిహింస్రా నలమ్పటాః
త్రైవర్గికా స్త్రయీవృద్ధా వర్ణా బ్రహ్మోత్తరానృప ! - 21

టీ :- తదేతి. బ్రహ్మోత్తరాః. బ్రాహ్మణాధికాః. (21)

త్రేతాయుగమున బ్రాహ్మణాధికులైన వారు క్రియాతపోనిష్ఠులై, అహింసాయుతులై, స్వేచ్ఛా సమన్వితులై, త్రివర్గములను కాంక్షించువారై, వైదిక కర్మ వృద్ధులై యుందురు.(21)

శ్లో ॥ తపః సత్యదయా దానేష్వర్ధం హ్రసతి ద్వాపరే
హింసాతుష్ట్యనృతద్వేషైర్ధర్మస్యాధర్మలక్షణైః - 22

టీ :- తప ఇతి. అనృతేన సత్యం హింసయా దయా అసంతోషేణ తపః. విగ్రహేణ దానం ఇతి యథా సంఖ్యం యోజ్యం. హింసాతుష్ట్యనృతద్వేషైరిత్యయం క్రమో న వివక్షితః. ధర్మస్యార్ధం హ్రసతి క్షీయతే. అధర్మస్య లక్షణైః చిహ్నైః పాదైరిత్యర్థః. (22)

అధర్మమునకు లక్షణములైన హింస, అసంతోషము, అసత్యము, ద్వేషము అనువానిచేత ధర్మమునకు లక్షణములైన తపస్సు, సత్యము, దయ, దానము అనునవి అర్ధభాగము ద్వాపరయుగమున నశించిపోవును. (22)

శ్లో ॥ యశస్వినో మహాశాలాః స్వాధ్యాయాధ్యయనే రతాః
ఆఢ్యాః కుటుంబినో హృష్టాః వర్ణాః క్షత్రద్విజోత్తరాః - 23

టీ :- యశస్విన ఇతి. యశస్వినః కీర్తిప్రియాః క్షత్రద్విజోత్తరాః క్షత్రియ బ్రాహ్మణ ప్రధానాః . (23)

క్షత్రియబ్రాహ్మణ ప్రధానులైనవారు కీర్తిప్రియులై, మహాయజ్ఞాచరణ గలవారై, స్వాధ్యాయాధ్యాపనములలోనిమగ్నులై, సమర్థులై, కుటుంబీకులై, సంతోషముగలవారై యుందురు. (23)



శ్లో ॥ కలౌతు ధర్మహేతూనాం తుర్యంశోఽధర్మహేతుభిః
ఏధమానైః క్షీయమాణోహ్యంతే సోఽపి వినంక్ష్యతి - 24

టీ :- కలావితి. కలౌ ధర్మపాదానాం తుర్యాంశః చతుర్థోఽంశః అవశిష్యతే. (24)

కలియుగమున ధర్మపాదములలో చతుర్థాంశమే మిగులును. సత్యం, దయ, తపస్సు, దానము అను ధర్మహేతువులు అధర్మ హేతువులతో క్షీణించుచు, చివరికి ఆ చతుర్థాంశము కూడ కనుమరుగై పోవును. (24)

శ్లో ॥ తస్మింల్లుబ్ధా దురాచారాః నిర్దయాః శుష్కవైరిణః
దుర్భగా భూరితర్షాశ్చ శూద్ర దాశోత్తరాః ప్రజాః - 25

టీ :- తస్మిన్నితి. శూద్రదాశోత్తరాః శూద్రకైవర్తాదిప్రధానాః. (25)

కలియుగమున శూద్రకైవర్తాది ప్రధానులైన ప్రజలు లుబ్ధులై, నిర్దయులై, వ్యర్థవైరము గలవారై, దుర్బలులై, చోరులై దురాచార వంతులగుదురు. (25)

శ్లో ॥ సత్త్వం రజస్తమ ఇతి దృశ్యంతే పురుష గుణాః
కాలసంచోదితాస్తే వై పరివర్తన్త ఆత్మని - 26

టీ :- యుగానామేవంభూతవైషమ్యే కారణమాహ - పంచభిః. సత్త్వమితి. (26)

కలియుగమున జనులు సత్త్వము, రజస్సు, తమస్సు అనుగుణములచే కూడినవారై, కాలమహిమచే మనస్సులో కొట్టుమిట్టాడుచుందురు. (26)

శ్లో ॥ ప్రభవన్తి యదా సత్త్వే మనోబుద్ధీంద్రియాణిచ
తదా కృతయుగం విద్యాత్ జ్ఞానే తపసి యద్రుచిః - 27

మనస్సు, బుద్ధి, ఇంద్రియములు సత్త్వగుణమున విశేషముగ ప్రభవించినప్పుడు జ్ఞానము, తపస్సులలో అభిరుచి కలుగును. అప్పుడు



టీ :- ప్రభవంతీతి. మనశ్చ బుద్ధిశ్చేంద్రియాణి చ సత్వే యదా ప్రభవంతి అతిశయేన వర్తంతే. (27)

కృతయుగమావిర్భవించునని తెలిసికొనవలెను. (27)

శ్లో ॥ యదా ధర్మార్థకామేషు భక్తిర్భవతి దేహినామ్
తదా త్రేతా రజోవృత్తిరితి జానీహి బుద్ధిమన్ - 28

ధర్మము, అర్థము, కామములయందు ప్రీతి జనులకు కలిగినచో అది రజోగుణ ప్రధానమగు త్రేతాయుగమని తెలియవలెను. (28)

టీ :- యదేతి. యదా తు ధర్మాదిషు భక్తిః ప్రీతిః తదా రజోవృత్తిప్రధానం త్రేతాయుగమితి జానీహి. (28)

శ్లో ॥ యదా లోభస్త్వ సంతోషో మనో దంభోఽథ మత్సరః
కర్మణాం చాపి కామ్యానాం ద్వాపరం తద్రజస్తమః - 29

లోభము, దుఃఖము, మనస్సులో దంభము, మాత్సర్యము, కామ్యకర్మలలో ప్రీతి జన్మించినప్పుడు అది రజస్తమోగుణప్రధానమగు ద్వాపరయుగమని తెలిసికొనవలెను. (29)

టీ :- యదేతి. కామ్యానాం కర్మణాం విషయే యదా ప్రీతిః తత్తదా. రజస్తమప్రధానపరం జానీహి. (29)

శ్లో ॥ యదా మాయానృతం తంద్రా నిద్రాహింసా విషాదనమ్
శోకో మోహో భయం దైన్యం సకలిస్తామసః స్మృతః - 30

మాయ, అసత్యము, సోమరితనము, నిద్ర, హింస, దుఃఖము, శోకము, మోహము, భయము, దైన్యము జనులలో కనబడినప్పుడు అది తామసగుణాత్మకమైన కలియుగమని చెప్పబడినది. (30)

టీ :- యదేతి. విషాదనం దుఃఖం. (30)



శ్లో ॥ యస్మాత్ క్షుద్రదృశో మర్త్యాః క్షుద్రభాగ్యా మహాశనాః
కామినో విత్తహీనాశ్చ స్వైరిణ్యశ్చ స్త్రియోఽసతీః - 31

టీ :- కలిదోషాన్ ప్రపంచయతి. - యస్మాదితి. యస్మాత్కలేర్హేతోః క్షుద్రదృశః మందమతయః. క్షుద్రభాగ్యాః అల్పభాగ్యాః. మహాశనా బహ్వాహారాః విత్తహీనా అపికామినః. స్వైరిణ్యః పుంశ్చల్యః. అసతీః అసత్యః. (31)

కలిప్రభావమున జనులు మందబుద్ధులై, భాగ్యహీనులై, తిండిపోతులై, డబ్బులేనివారై, కాముకులై యుందురు. స్త్రీలు వ్యభిచారిణులై, సతీధర్మమును పాటింపనివారై యుందరు. (31)

శ్లో ॥ దస్యూత్కృష్టా జనపదాః వేదాః పాఖండదూషితాః
రాజానశ్చ ప్రజాభక్షాః శిశ్నోదరపరాద్విజాః - 32

టీ :- దస్య్వితి. దస్యవః ఉత్కృష్టాః ప్రచురాః తే. (32)

పల్లెలు, పట్టణములు మొదలైన జనపదములన్నియు దొంగల ఉపద్రవములతో బాధింపబడును. వేదములు నాస్తికులచే అపవిత్రములగును. రాజులు ప్రజాభక్షకులగుదురు. బ్రాహ్మణులు శిశ్న (స్త్రీలతో సుఖించుట), ఉదర (కడుపునింపుకొనుట) విషయములలో నిమగ్నులై యుందురు. (32)

శ్లో ॥ అవ్రతా వటవోఽశౌచాః భిక్షవశ్చ కుటుంబినః
తపస్వినో గ్రామవాసాః న్యాసినో ఽత్యర్థలోలుపాః - 33

టీ :- అవ్రతా ఇతి. అవ్రతాః విహితాచారశూన్యాః అశౌచాః శౌచశూన్యాశ్చ. వటవో బ్రహ్మచారినో భవిష్యతి. కుటుంబినశ్చ గృహస్థాః స్వయం భిక్షాటనపరా భవిష్యంతి. న తు భిక్షాం దాస్యంతి. తపస్వినో వనస్థాః వనం హిత్వా గ్రామవాసాః భవిష్యంతి. న్యాసినో యతయః అతీవ అర్థలోలుపాః భవిష్యంతి. (33)

బ్రహ్మచారులు వేదవిహితములగు ఆచారములను వదలివేసెదరు. శౌచము ఏ మాత్రము పాటింపరు. గృహస్థులు స్వయముగ బిచ్చమెత్తుకొని జీవింతురు గాని, ఇతరులకు భిక్ష వేయరు. తపస్వులు తపోయోగ్యములైన అరణ్యములను వదలి గ్రామములలో నివసించెదరు సన్న్యాసులు అమితధనక్షాంక్ష గలవారగుదురు. (33)



శ్లో ॥ హ్రస్వకాయాః మహాహారాః భూర్యపత్యాగతహ్రియః
శశ్వత్కటుక భాషిణ్య శ్చౌర్యమాయోరుసాహసాః - 34

టీ :- పునరపి స్త్రీణాం స్వభావమాహ - హ్రస్వకాయా ఇతి. కటుభాషిణ్యః అప్రియవాదిన్యః చౌర్యం చ మాయ చ కపటం ఉరుచ సాహసం యాసాం తాః. (34)

కలియుగములో స్త్రీలు హ్రస్వదేహములుగలవారై అమితాహారమును భుజించువారై, అధిక సంతానము గలవారై, సిగ్గును వదిలివేసినవారై, నిరంతరము అప్రియములను మాట్లాడువారై, దొంగతనము, మోసము, కపటములయందు సాహసముగలవారై యుందురు. (34)

శ్లో ॥ పణయిష్యంతి వైక్షుద్రాః కిరాటాః కూటకారిణః
అనాపద్యపి మంస్యన్తే వార్తాం సాధు జుగుప్సితామ్ - 35

టీ :- కించ. పణయిష్యంతీతి కిరాటాః వణిజః. పణయిష్యంతి క్రయవిక్రయాదివ్యవహారం ప్రవర్తయిష్యంతి. కించ. సర్వే జనాః, అనాపద్యపి. జుగుప్సితాం నిందితాం. వార్తాం వృత్తిం సాధుమన్యంతే. (35)

వాణిజ్యము చేసెడి వ్యాపారులు క్రయ విక్రయాదులలో మోసగించుచు వస్తువులను అమ్ముచుందురు. జనులందరును ఏ ఆపదలు రాని సమయములో కూడ నీచమైన పనులను చేయుచుందురు. (35)

శ్లో ॥ పతిం త్యక్ష్యంతి నిర్ద్రవ్యం భృత్యా అప్యఖిలోత్తమమ్
భృత్యం విపన్నం పతయః కౌలం గాశ్చాపయస్వినీః - 36

టీ :- పతిమితి. సర్వోత్తమమపి పతిం ద్రవ్యహీనం భృత్యాస్త్యక్ష్యంతి పతయశ్చ విపన్నం రోగాదిభిర్వ్యాపారాక్షమం కౌలం కులపరంపరా యాతం. త్యక్ష్యంతి. అపయస్వినీః దుగ్ధదోహాః. (36)

ఉత్తమోత్తమ గుణములతో అలరారెడి యజమాని ధనములేనివాడైనచో అతనిని సేవకులు వదలివేసెదరు. కులపరంపరను అనుసరించి వచ్చిన సేవకుడు రోగాదులచే పనిచేయలేనివాడైనప్పుడు అతనిని యజమానులు వదలివేసెదరు. పాలు ఇవ్వని గోవులను సైతము పరిత్యజింతురు. (36)



శ్లో ॥ పితృభాతృసుహృత్ జ్ఞాతీన్ హిత్వా సౌరతసౌహృదాః
నానాంధృశ్యాల సంవాదాః దీనాః స్త్రైణాః కలౌ నరాః- 37

శ్లో ॥ శూద్రాః ప్రతిగ్రహీష్యంతి తపోవేషోపజీవినః
ధర్మం వక్ష్యన్త్యధర్మజ్ఞాః అధిరుహ్యోత్తమాసనమ్ - 38

శ్లో ॥ నిత్యముద్విగ్నమనసో దుర్భిక్షకరకర్శితాః
నిరన్నే భూతలే రాజన్ననావృష్టిభయాతురాః - 39

టీ :- పితృానితి. పితృభ్రాత్రాదీన్ హిత్వా సౌరతం సురతనిమిత్తం సౌహృదం యేషాం తే. అత ఏవ ననాందారోఽత్రభార్యాభగిన్యః స్యాలాః భార్యాభ్రాతరః. తైస్సంవాదో మంత్రాలోచనం యేషాం తే. (37,38,39)

శ్లో ॥ వాసోఽన్నపానశయనవ్యవాయస్నాన భూషణైః
హీనాః పిశాచ సందర్శా భవిష్యన్తి కలౌ ప్రజాః - 40

టీ :- వాస ఇతి. పిశాచసందర్శాః పిశాచవద్దృశ్యాః. (40)

రతి సౌఖ్యము కారణముగనే స్నేహములను కొనసాగించు జనులు కాముకులై తల్లిదండ్రులను, అన్నదమ్ములను, అక్క చెల్లెళ్ళను, మిత్రులను, బంధువులను వదలివేసి భార్య యొక్క అక్క చెల్లెళ్ళతోడను, భార్య యొక్క అన్నదమ్ములతోను రహస్య భాషణములను చేసెదరు. శూద్రులు తపోవేషమున బ్రతుకును గడుపువారై, ఉత్తమ పీఠములపై కూర్చొని అధర్మమునాచరించుచు, ధర్మమునుపదేశింతురు. ప్రజలు ప్రతినిత్యము కలవరపడు మనస్సుగలవారై, దుర్భిక్షములతో అలమటించుచు, అనావృష్టిభయముతో కూడినవారై అన్నము దొరకని భూమండలమున అలమటింతురు. (37.38,39)

కలియుగమున ప్రజలు నివాసము, అన్నము, పానము, శయ్య, నిలువనీడ, స్నానము, అలంకరణలు లేనివారై పిశాచములవలె జీవింతురు. (40)



శ్లో॥ కలౌ కాకణికేఽప్యర్థే విగృహ్య త్యక్త సౌహృదాః
త్యక్ష్యంతి చ ప్రియాన్ ప్రాణాన్ హనిష్యంతి స్వకానపి - 41

శ్లో॥ న రక్షిష్యన్తి మనుజాః స్థవిరౌ పితరావపి
పుత్రాన్ సర్వార్థకుశలాన్ క్షుద్రాః శిశ్నోదరంభరాః - 42

టీ :- కలావితి. కాకణీకే వింశతివరాటికామాత్రే ప్యర్థే విషయభూతే విగృహ్యా వైరం కృత్వా. (41,42)

కలియుగమున జనులు ఇరువది గవ్వల కొరకు కూడ శత్రుత్వము లేర్పరచుకొని, స్నేహమును సైతము చూడక తనవారిని కూడ చంపివేయుచు, తన ప్రియమైన ప్రాణములనుకూడ త్యజింతురు. వృద్ధులైన తల్లిదండ్రులను కాపాడరు. కేవలము రతిసౌఖ్యము, కడుపునింపుకొనుట కొరకే జీవించుచు సర్వసమర్థులైన పుత్రులను కూడ చంపుటకు వెనుకాడరు. (41,42)

శ్లో॥ కలౌ న రాజన్ జగతాం పరం గురుం
త్రిలోకనాథానత పాదపంకజమ్
ప్రాయేణ మర్త్యా భగవన్తమచ్యుతం
యక్ష్యంతి పాఖండవిభిన్నచేతసః - 43

టీ :- మహాంత. మనర్థమన్యాయం చాహ - ద్వాభ్యాం. కలావితి. త్రిలోకనాథైరానతం నమస్కృతం పాదపంకజం పాదపద్మం యస్య తం. న యక్ష్యంతి న పూజయిష్యంతి. పాషండైర్విభిన్న మన్యథా కృతం చేతో యేషాం తే. (43)

కలియుగమున జనులు పాఖండులచే చెదరగొట్టబడిన మనస్సులు గలవారై త్రిలోకనాథులచే మొక్కబడిన పాదపద్మములు గల భగవంతుడగు కృష్ణుని పూజించుటను విరమింతురు. (43)



శ్లో ॥ యన్నామధేయం మ్రియమాణ ఆతురః
పతన్ స్ఖలన్ వా వివశో గృణన్ పుమాన్
విముక్త కర్మార్గల ఉత్తమాం గతిం
ప్రాప్నోతి యక్ష్యంతి న తం కలౌ జనాః - 44

టీ :- యదితి. వివశోఽపి గృణన్ సన్ విముక్తాః కర్మరూపాః అర్గలాః ప్రతిబంధా యస్య సః. (44)

కర్మ బంధములనుండి విముక్తుడైనవాడు మరణ సమయమున ఆరాటముతో పడుచు, లేచుచు, తడబడుచు, వివశుడై ఏ కృష్ణుని నామధేయమునుచ్చరించి ఉత్తమగతులనొందునో, అట్టి పవిత్రనామమును కలియుగమున జనులు విడిచిపెట్టెదరు.(44)

శ్లో ॥ పుంసాం కలికృతాన్ దోషాన్ ద్రవ్యదేశాత్మ సంభవాన్
సర్వాన్ హరతి చిత్తస్థో భగవాన్ పురుషోత్తమః - 45

శ్లో ॥ శ్రుతః సంకీర్తితో ధ్యాతః పూజితశ్చాదృతో: పివా
నృణాం ధునోతి భగవాన్ హృత్థో్స జన్మాయుతాశుభమ్ - 46

టీ :- తదేవం కలిదోషాన్ ప్రపంచ్య ప్రస్తుతం నిస్తారోపాయ మాహ - షడ్భిః. పుంసామితి. ద్రవ్యదేశాత్మసంభవాన్ ద్రవ్యమన్నాది. దేశః కీకటాదిః. ఆత్మశబ్దేన ఇంద్రియాణి తైస్సంభవో యేషాం తాన్ చిత్తస్థః చిత్తస్ఫురితః. (45,46)

కలియుగమున నరులు తమ చిత్తములలో భగవంతుడైన పురుషోత్తముని స్మరించిన చాలును, వారి కలిదోషములను అనగా అన్న, దేశ, ఇంద్రియములవలన కలిగిన సకల దోషములను భగవంతుడు హరించును. ఆ భగవంతుని నామమును విన్నను, కీర్తించినను, ధ్యానించినను, పూజించినను, ఆదరించినను చాలును ఆతడు హృదయమున నివసించువాడై జన్మజన్మల అశుభములను తొలగించును. (45,46)



శ్లో ॥ యథా హేమ్ని స్థితో వహ్నిః దుర్వర్ణం హన్తి ధాతుజమ్
ఏవమాత్మగతో విష్ణుః యోగినామ శుభాశయమ్ - 47

టీ :- అయమేవోపాయో నాన్య ఇతి దృష్టాంతమాహ - యథేతి. ధాతుజం తామ్రాదిసంశ్లేషాజ్జాతం. హేమ్ని దుర్వర్ణం మాలిన్యం. తత్ర స్థితో వహ్నిరేవ హంతి. నతుతోయాది. ఏవం యోగినామపి విష్ణురేవ. న తు యోగాదికమిత్యర్థః. (47)

బంగారముతో కలిసియున్న రాగి మొదలైన ధాతువుల వలన కలిగిన మలినములను అగ్ని ఎట్లు నిర్మూలించునో, అట్లే యోగుల మనస్సులలో కలిసియున్న అశుభకామనలను విష్ణువే దూరము చేయునుగాని, యోగసాధనలు దూరము చేయలేవు. (47)

శ్లో ॥ విద్యాతపః ప్రాణనిరోధమైత్రీ
తీర్థాభిషేక వ్రతదానజప్యైః
నాత్యంతశుద్ధింలభతేఽన్త రాత్మా
యదా హృదిస్థే భగవత్యనన్తే - 48

శ్లో ॥ తస్మాత్సర్వాత్మనా రాజన్ ! హృదిస్థం కురుకేశవమ్
మ్రియమాణోహ్యవహితస్తతో యాసి పరాంగతిమ్ - 49

టీ :- ఏతదేవ వివృణోతి - విద్యేతి. విద్యానానాదేవతోపాసనా. (48,49)

విద్య, తపస్సు, ప్రాణాయామము, స్నేహము, తీర్థజలస్నానము, వ్రతాచరణము, దానము, జపము మొదలైన ఎన్ని చేసినను భగవంతుడగు విష్ణువుని హృదయమున నిలుపుకొన్నప్పుడే అంతరాత్మ సంపూర్ణముగ పవిత్రమగును. కావున ఓ పరీక్షిన్మహారాజా! నీవు విష్ణువును హృదయమున నిలుపుకొని, మరణించినచో నీవు ఉత్తమ గతిని పొందగలవు.(48,49)



శ్లో ॥ మ్రియమాణైరభిధ్యేయో భగవాన్ పరమేశ్వరః
ఆత్మభావం నయత్యంగ సర్వాత్మా సర్వ సంశ్రయః - 50

టీ :- మ్రియమాణైరితి. ఆత్మస్వభావం స్వస్వరూపం. (50)

మరణసమయమున భగవంతుడైన పరమేశ్వరుని ధ్యానించినచో, అట్టివాడు, సర్వాత్ముడై, సర్వభద్రుడై, ఆత్మస్వరూపమును పొందగలడు. మరణించువారిని ఆత్మయను భవనమునకు చేర్చువాడు విష్ణువొక్కడే అని తాత్పర్యము. (50)

శ్లో ॥ కలేర్దోషనిధే రాజన్నస్తి హ్యేకో మహాన్ గుణః
కీర్తనాదేవ కృష్ణస్య ముక్తసంగః పరం వ్రజేత్ - 51

టీ :- ఇదానీం కలిం స్తౌతి - ద్వాభ్యాం కలేరితి. (51)

ఎన్నో దోషములకు ఆలవాలమైన కలియుగమునకు సైతము ఒక గొప్ప గుణమున్నది. అదేమనగా - కలియుగమున కృష్ణుని కీర్తించినంత మాత్రమున సకల బంధములనుండి విముక్తులై మానవులు ఉత్తమ గతులను పొందగలరు. (51)

శ్లో ॥ కృతే యత్ ధ్యాయతో విష్ణుం త్రేతాయాం యజతో మఖైః
ద్వాపరే పరిచర్యాయాం కలౌ తద్ధరి కీర్తనాత్ - 52

టీ :- కృత ఇతి. తత్సర్వం హరికీర్తనాదేవ కలౌ భవతి. (52)

కృతయుగమున విష్ణువు యొక్క ధ్యానముతోడను, త్రేతా యుగమున విష్ణు ప్రీతికై యజ్ఞయాగాదుల ఆచరణముతోడను, ద్వాపర యుగమున విష్ణువు పరిచర్యలతోడను ఎంతటి ఫలము లభించునో, అంతటి ఫలము కలియుగమున కేవలము హరి సంకీర్తనము వలననే లభించును. (52)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే ద్వాదశస్కంధే తృతీయోఽధ్యాయః**

**శ్రీమద్భాగవత మహాపురాణము యొక్క ద్వాదశస్కంధమునందలి తృతీయాధ్యాయము సమాప్తము.**



## చతుర్థోఽధ్యాయః

**శ్రీ శుక ఉవాచ**

శ్లో ॥ కాలస్తే పరమాణ్వాదిర్ద్విపరార్ధావధిర్నృప!
కథితో యుగమానం చ శ్రుణు కల్పలయావపి - 1

టీ :- చతుర్థే చ చతుర్థోక్తా లయానైమిత్తికాదయః, తత్ర సంసార విస్తారో హరికీర్త్యైవ వర్ణ్యతే. కలిదోషనివర్తకం హరినామ సంకీర్తనాదికం స ఏవ చ కలౌ పరమో ధర్మ ఇతి ప్రశ్నద్వయ స్యోత్తరముక్తం. యచ్చాన్యత్పృష్టం ప్రలయకల్పయోర్మానం బ్రూహీతి తదిదానీం తృతీయస్కంధోక్త కాలమానానువాదపూర్వకం నిరూపయతి - కాల ఇతి. శ్లో. "సకాలః పరమాణుర్వై యో భుఙ్క్తేపరమాణుతా మి" త్యాదినా కాలః కథితః శ్లో. " చత్వారి త్రీణి ద్వే చైకం కృతాదిషు యథాక్రమం, సంఖ్యాతాని సహస్రాణి ద్విగుణాని శతాని చే" తి. యుగమానం చ కథితం. (1)

శ్లో ॥ చతుర్యుగసహస్రంచ బ్రహ్మణో దినముచ్యతే
స కల్పో యత్ర మనవశ్చతుర్దశ విశాంపతే! - 2

టీ :- తత్ర కల్పమానమాహ - చతుర్యుగేతి. యత్ర చతుర్దశమనవః క్రమేణ భవంతి. (2)

## చతుర్థాధ్యాయము

**శ్రీశుకుడు పలుకుచున్నాడు.**

ఓ రాజా! కలియుగమున నైమిత్తికాదులైన లయములు నాలుగు విధములుగ పేర్కొనబడినవి. ఇప్పుడు యుగమానమును, కల్పలయములను గూర్చి వివరింతును. వినుము! (1)

నాలుగు యుగముల సహస్రము, బ్రహ్మదేవునకు ఒక దినమని చెప్పబడును. దీనిని కల్పమందురు. ఈ కల్పమున పదునాలుగు మంది మనువులు ఈ భూమండలమును పాలింతురు. (2)



శ్లో ॥ తదన్తే ప్రలయస్తా వాన్ బ్రాహ్మీ రాత్రి రుదాహృతా
త్రయోలోకా ఇమే తత్ర కల్పన్తే ప్రలయాయ హి - 3

టీ :- ప్రలయస్తు చతుర్విధః నైమిత్తికః ప్రాకృతికః ఆత్యంతికో నిత్యశ్చేతి. తత్ర నైమిత్తికం ప్రలయం మానసహితమాహ - ద్వాభ్యాం తదంత ఇతి. చతుర్దశమనవః. యత్ర వర్తంతే తావాన్ చతుర్యుగ సహస్రప్రమాణః. సైవ బ్రాహ్మీ రాత్రిః. (3)

ప్రళయము నాలుగు విధములు. నైమిత్తికము, ప్రాకృతికము, అత్యన్తికము, నిత్యము, చతుర్యుగసహస్రము యొక్క చివర సంభవించు ప్రళయమే బ్రహ్మదేవునకు రాత్రి. ముల్లోకములు ఈ ప్రళయమందే లయించును. ఇదే నైమిత్తిక ప్రళయము. (3)

శ్లో ॥ ఏషనైమిత్తికః ప్రోక్తః ప్రలయో యత్ర విశ్వసృక్
శేతేఽనంతాసనో విశ్వమాత్మ సాత్కృత్య చాత్మభూః - 4

టీ:- ఏష ఇతి. నైమిత్తికత్వం దర్శయతి - యత్ర యదా విశ్వసృట్ శ్రీమన్నారాయణః విశ్వమాత్మసాత్కృత్యస్వస్మిన్నుపసంహృత్య శేతే. ఆత్మభూః బ్రహ్మ చ తస్మిన్ శేతే తయోరభేదవివక్షయా బ్రహ్మణ ఏవానంతాసనత్వముక్తం బ్రహ్మణో నిద్రాం నిమిత్తీకృత్య ప్రవర్తమానో లోకత్రయ ప్రలయో నైమిత్తిక ఇత్యర్థః. (4)

బ్రహ్మదేవుని నిద్రను నిమిత్తముగా చేసికొని ఏర్పడు ఈ ప్రళయమే నైమిత్తికప్రళయము. ఈ సమయమున శ్రీమన్నారాయణు నకు అభిన్నుడైన బ్రహ్మదేవుడు లోకములన్నింటినీ తనలో లయము చేసికొని అనంతాసనుడై నిద్రించును. (4)

శ్లో ॥ ద్విపరార్ధే త్వతిక్రాన్తే బ్రహ్మణః పరమేష్ఠినః
తదా ప్రకృతయస్సప్త కల్పన్తే ప్రలయాయవై - 5

బ్రహ్మదేవుని ఆయుర్దాయములో ద్విపరార్థములు గడచిన తరువాత మహత్తు, అహంకారము, పంచతన్మాత్రలు అనెడి సప్త ప్రకృతులు ప్రళయమును పొందును. (5)



టీ :- ప్రాకృతికం ప్రలయమాహ - ద్వాభ్యాం. ద్విపరార్థ ఇతి. ద్విపరార్థే తు బ్రహ్మణ ఆయుషి అతిక్రాంతే సతి. సప్తప్రకృతయః మహదహంకార పంచతన్మాత్రాణి. (5)

శ్లో ॥ ఏష ప్రాకృతికో రాజన్! ప్రళయో యత్ర లీయతే
ఆండకోశస్తు సంఘాతో విఘాత ఉపసాదితే - 6

టీ :- ఏష ఇతి. సంఘాతః మహదాదికార్యభూతః ప్రకృతీనాం తత్కార్యబ్రహ్మాండస్య చ లయాత్ప్రాకృతిక ఇత్యర్థః. విఘాతే విఘాతకారణే ఉపపాదితే కాలేన ప్రాపితే సతి. (6)

సప్త ప్రకృతులు లయమునొందుటయు ప్రాకృతిక ప్రళయము. మహదాది ప్రకృతులు, తత్కార్యమగు బ్రహ్మండము లయము నొందుటయే దీని స్వరూపము. బ్రహ్మాండకోశమునకు కాలానుగుణ ముగ శైథిల్యమేర్పడినప్పుడు ఈ ప్రళయము సంభవము. (6)

శ్లో ॥ పర్జన్యః శతవర్షాణి భూమౌ రాజన్! నవర్షతి
తదా నిరన్నే హ్యన్యోన్యం భక్షమాణాః క్షుధార్దితాః - 7

టీ :- తదేవాహ. పర్జన్య ఇత్యాదినా. బుద్ధీంద్రియార్థరూపేణేత్యతః ప్రోక్తేనేన గ్రంథేన. పర్జన్య ఇతి. (7)

భూమండలమున నూరు సంవత్సరములు మేఘములు జలములను వర్షింపకపోవుటవలన అన్నము దొరకక జనులు ఆకలిగొన్నవారై ఒకరినొకరు భక్షించుకొనెదరు. (7)



శ్లో ॥ క్షయం యాస్యంతి శనకైః కాలేనో ప్రద్రుతాః ప్రజాః
సాముద్రం దైహికం భౌమం రసం సాంవర్తకోరవిః -8

శ్లో ॥ రశ్మిభిః పిబతే ఘోరైః సర్వం నైవ విముంచతి
తతః సంవర్తకో వహ్నిః సంకర్షణముఖోత్థితః - 9

టీ :- సాముద్రమితి. సాముద్రాదికం సర్వం రసం రవిః పిబతే ఆకర్షతి న పునః ప్రయచ్ఛత్యేవ. (8,9)

శ్లో ॥ దహత్యనిలవేగోత్థః శూన్యాన్భూవివరానథ
ఉపర్యధః సమన్తాచ్చ శిఖాభిర్వహ్ని సూర్యయోః - 10

టీ :- తత ఇతి. అనిలవేగోత్థః వాయువేగోద్భూతః అనిలవేగో వా ఇతి పాఠే అనిలేన వేగో యస్య సః వాః రవిణా రశ్మిభిః పీతముదకం చ దమతీత్యర్థః. అనిలవేగో వా ఇతి తు పాఠస్సుగమః. భూమివరాన్ పాతాలాదీన్ శూన్యాన్ రవిణా దైహికరసాకర్షణాత్ ప్రాణిరహితాన్. ఉపరీతి. శిఖాభిర్జ్వాలాభిః. (10)

ఇట్టి కాలోపద్రవముచే ప్రజలందరు త్వరలోనే నశింతురు. సముద్రము, దేహము, భూమి మొదలైన వానిలో నుండు రసములను సాంవర్తకుడను సూర్యుడు పీల్చివేయును. సంకర్షణముఖమున ఉద్భవించిన సంవర్తకాగ్ని దేనినీ వదిలిపెట్టదు. అన్నింటినీ దహించివేయును. (8,9)

వాయువేగముతో ఉద్భవించెడి సంవర్తకాగ్ని సూర్యకిరణముల లోని నీటిని సైతము కాల్చివేయును. జ్వాలలతో ఎగసిపడుచున్న అగ్ని సూర్యుల వేడి నేలలోపలి భాగములలోను, ఆకాశముపైన, భూమిపైన అన్నివైపుల ప్రసరించి, ఏ ప్రాణినీ బ్రతుకనీయదు. ప్రకృతిని నిర్జీవము చేయును. (10)



శ్లో ॥ దహ్యమానం విభాత్యండం దగ్ధ గోమయపిండవత్
తతః ప్రచండ పవనో వర్షాణామధికం శతమ్ -11

శ్లో ॥ పరః సాంవర్తకో వాతి ధూమ్రం ఖంరజసాఽవృతమ్
తతో మేఘకులాన్యంగ చిత్రవర్ణాన్యనేకశః - 12

టీ :- తత ఇతి. కించిదధికం వర్షాణాం శతం సంవర్తకః పరో వాయుర్వాతి. తదా రజసా వృతం ఖం ధూమ్రం భవతి. రభసస్వనైః తీవ్రగర్జితైః. (11,12)

భూమండలము కాలిన పిడకవలె దహించుకొనిపోవును. అప్పుడు ప్రళయ కారకమైన ప్రచండవాయువు నూరు సంవత్సరములకు పైగా వీచును. దుమ్ముధూళితో కూడిన ఆకాశము బూడిద రంగులో కనబడును. ఆ తరువాత చిత్రవిచిత్ర వర్ణములు గల ఎన్నో మేఘపంక్తులు ఉద్భవించును. (11,12)

శ్లో ॥ శతం వర్షాణి వర్షన్తి నదన్తి రభసస్వనైః
తత ఏకోదకం విశ్వం బ్రహ్మాండవివరాన్తరమ్ - 13

టీ :- తత ఇతి. బ్రహ్మాండవివరాంతరం బ్రహ్మాండవివర మధ్యగతం విశ్వం ఏకోదకం ఏకార్ణవోదకవ్యాప్తం భవతి. (13)

తీవ్రగర్జనలతో కూడిన ఆ మేఘములు నూరుసంవత్సరములు వర్షములను కురియును. బ్రహ్మాండమనెడి రంధ్రములో నుండెడి ఈ భూమండలము సముద్రజలమయమై యుండును. నీరుతప్ప భూభాగమేదియు కానరాకుండ ఉండును.(13)

శ్లో ॥ తదా భూమేర్గంధగుణం గ్రసంత్యాప ఉదప్లవే
గ్రస్తగంధా తు పృథివీ ప్రలయత్వాయ కల్పతే - 14

అప్పుడు భూమి యొక్క గంధగుణమును నీరు హరించును. గంధగుణము నశించిన భూమి తన ఉనికిని కోల్పోవును. (14)



శ్లో ॥ అపాం రసమథో తేజస్తా లీయన్తేఽథ నీరసాః
గ్రసతే తేజసోరూపం వాయుస్త ద్రహితం తథా -15

నీటిలోని రసగుణమును తేజస్సు హరింపగా, నీరు పూర్తిగా హరించుకొని పోవును. ఆ తరువాత తేజస్సు యొక్క రూపమును వాయువు మ్రింగివేయగా, తేజస్సు పూర్తిగ నశించును. (15)

శ్లో ॥ లీయతే చానిలే తేజో వాయోః ఖంగ్రసతే గుణమ్
స వై విశతి ఖం రాజన్ ! తతశ్చ నభసోగుణమ్ - 16

ఇట్లు వాయువులో తేజస్సు లీనముకాగా, వాయువు యొక్క గుణమును ఆకాశము హరించును. అటుపిమ్మట ఆకాశగుణము నశించును. (16)

టీ :- తదేతి. ఉదాప్లవే ఉదకేనాప్లావితే సతి. ప్రలయత్వాయ అభావాయ. (14,15,16)

శ్లో ॥ శబ్దం గ్రసతి భూతాదిర్నభస్తమనులీయతే
తైజసశ్చేంద్రియాణ్యంగ దేవాన్వైకారికో గుణైః - 17

ఆకాశగుణమైన శబ్దమును భూతాదియగు తమస్సు, గుణవృత్తులతో సహా హరించును. తమస్సును అహంకారము హరించును.(17

టీ :- శబ్దమితి. భూతాదిః తామసోఽహంకారః గుణైర్వృత్తిభిస్సహ. (17)

శ్లో ॥ మహాన్ గ్రసత్యహంకారం గుణాస్సత్త్వాదయశ్చతమ్
గ్రసతేఽవ్యాకృతం రాజన్ ! గుణాన్ కాలేన చోదితమ్ -18

అహంకారమును సత్త్వాది గుణములు హరించును. గుణములను ప్రధానము హరించును. (18)

టీ :- మహానితి. అవ్యాకృతం ప్రధానం. (18)





శ్లో ॥ న తస్యకాలావయవైః పరిణామాదయో గుణాః
అనాద్యనంతమవ్యక్తం నిత్యం కారణమవ్యయమ్ - 19

టీ :- తస్య తు లయో నాస్తీత్యాహ - నేతి. కాలావయవైః అహోరాత్రా దిభిః గుణాః షడ్భావవికారాః పరిణామో విపరిణామః అవ్యక్తం అస్తిత్వవ్యక్తివికారశూన్యం నిత్యం సర్వదా ఏకరూపం వృద్ధిరహిత మిత్యర్థః. అ్యయమపక్షయశూన్యం సర్వత్ర హేతుః కారణమితి. (19)

కాలావయవములగు అహోరాత్రుల చేతను, పరిణామాదులైన గుణములచేతను ప్రధానమునకు నాశనము సంభవింపదు. ఎందుకనగా అది అవ్యక్తము. అనగా వికారశూన్యము. నిత్యము అనగా సదా ఏకరూపము. హెచ్చుతగ్గులు లేనిది. అవ్యయము అనగా నాశము లేనిది అన్నింటికి అదియే కారణము. (19)

శ్లో ॥ నయత్ర వాచో న మనో న సత్త్వం
తమో రజో వా మహదాదయోఽమీ
న ప్రాణబుద్ధీంద్రియదేవతా వా
న సన్నివేశః ఖలు లోకకల్పః - 20

టీ :- కించ వాగాదిగోచరస్య సవిశేషస్య వికారా భవంతి. ఇదం తు నతథేత్యాహ - ద్వాభ్యాం. నేతి. లోకకల్పః లోకరూపః సన్నివేశో రచనావిశేషః. (20)

వాగాది గోచరములైన విశేషములకే వికారములు కలుగును. కాని ప్రధానము అట్లు కానిది గనుక దానికి వికారము కలుగదు. వాక్కు, మనస్సు, సత్త్వము, రజస్సు, మహదాదులు, ప్రాణము, బుద్ధి, ఇంద్రియములు దానిని మార్చలేవు. లోకరూపమైన రచనావిశేషము దానికి ఉండదు. (20)



శ్లో ॥ న స్వప్న జాగ్రన్నచ తత్సుషుప్తం
న ఖం జలం భూరనిలోఽగ్నిరర్కః
సంసుప్త వచ్ఛూన్యవదప్రతర్క్యం
తన్మూలభూతం పదమామనన్తి - 21

టీ :- నేతి. స్వప్న జాగ్రత్స్వప్నజాగరావస్థాయుక్తం సుషుప్తవత్ ఇంద్రియాద్యభావాత్ శూన్యసాదృశ్యే హేతుః. అప్రతర్క్యం న పునశ్శూన్యమేవేత్యాహ - తదితి. (21)

అది స్వప్నము కాదు. జాగృతి కాదు. సుషుప్తి కాదు. ఆకాశము కాదు. జలము కాదు. భూమి కాదు, వాయువు కాదు. అగ్ని కాదు, అది నిద్రించుచున్నట్లు కనబడు ఒక శూన్యమువలె తర్కింపనలవి కానిది. అది అన్నింటికి మూలభూతమైన స్థానమని చెప్పుచున్నారు. (21)

శ్లో ॥ లయః ప్రాకృతికో హ్యేష పురుషావ్యక్త యోర్యదా
శక్తయః సంప్రలీయన్తే వివశాః కాలవిద్రుతాః - 22

టీ :- ఉపసంహరతి - లయ ఇతి. శక్తయః సత్త్వాదయః. (22)

పురుషుడు, అవ్యక్తముల యొక్క ప్రాకృతికమైన ఈ ప్రళయ సమయమున శక్తులన్నియు కాలమహిమచే పట్టు తప్పినవై లయమును పొందును. (22)

శ్లో ॥ బుద్ధీంద్రియార్థరూపేణ జ్ఞానం భాతి తదాశ్రయమ్
దృశ్యత్వావ్యతిరేకాభ్యా మాద్యన్త వదవస్తు యత్ - 23

టీ :- ఆత్యంతికం లయమాహ - ద్వాదశభిః. బుద్ధీతి. ఆత్యంతికో లయోనామ మోక్షః. స చ బ్రహ్మజ్ఞానేన సకలప్రపంచలయాత్మకః న

ఆత్యన్తికలయమనగా మోక్షము. అది బ్రహ్మ జ్ఞానము కలుగుటతోనే సర్వ ప్రపంచమును లయము చేసికొనును. అనగా ప్రపంచము ఆత్మవలె సత్యమైనచో లయము కలుగదు. జ్ఞానరూపము న్నను బ్రహ్మ పదార్థమునకు భిన్నముగ దాని ఉనికి లేదనుటయే పరమార్థము. బుద్ధి, ఇంద్రియములు, అర్థము అను గ్రాహక



చ ప్రపంస్యాత్మవత్సత్యత్వే లయస్సంభవతీతి జ్ఞానరూపాత్ బ్రహ్మణః పృథగ్భూతస్య తస్యాసత్యత్వముపపాదయతి – బుద్ధిశ్చ ఇంద్రియాణి చ అర్థాశ్చేత్యేవం గ్రాహకకరణగ్రాహ్యరూపేణ తేషామాశ్రయభూతం. జ్ఞానమేవ భాతి. న పృథక్ తత్రహేతుమాహ – దృశ్యత్వావ్యతిరేకా భ్యామతి. అతో యదాద్యంతవత్తదవస్తు. అత్రైవంప్రయోగః. విమతం, సన్నభవతి, దృశ్యత్వాత్, కారణవ్యతిరేకాత్, ఆద్యంతవత్వాచ్చ. రజ్జుసర్పాదివదితి. (23)

శ్లో ॥ దీపశ్చక్షుశ్చ రూపంచ జ్యోతిషో న పృథగ్భవేత్
ఏవం ధీః ఖాని మాత్రాశ్చ న స్యురన్య తమాదృతాత్ – 24

టీ :– అత్రావ్యతిరేకం దృష్టాంతేన ప్రపంచయతి – దీపచక్షూ రూపాణాం తేజోవిశేషాణాం యథా తేజసో న వ్యతిరేకః తథా ధీః కర్త్రీ. ఖాని కరణాని మాత్రాః విషయాశ్చ ఋతాత్ బ్రహ్మణః పృథక్ న స్యుః. బ్రహ్మకార్యత్వాత్. నన్వేవం కార్యకారణయోరభేదే కార్యాసత్త్వే కారణస్యాప్య సత్త్వం ప్రసజ్యేత? తత్రాహ – అన్యతమాదితి. కార్యాదన్యతమాదత్యంతం వ్యతిరిక్తాద్బ్రహ్మణః. ప్రపంచాద్బ్రహ్మణో ఽస్తి వ్యతిరేకః. ప్రపంచస్య తు తతో నాస్తి వ్యతిరేక ఇత్యర్థః. (24)

కారణములకు గ్రాహ్యమైనది. వాని కాశ్రయభూతమైన జ్ఞానమే కాని మరొకటి కాదు. దృశ్యమగుటచేతను, కారణమునకు వ్యతిరేకము కానిదగుట చేతను, ఆద్యంతములుండుట చేతను రజ్జుసర్పభ్రాంతిలో రజ్జువునందు సర్పమును ఆరోపించుటవంటిది, బ్రహ్మమునందు ప్రపంచము నారోపించుట (23)

దీపము, కన్నులు, రూపము అను వానికి తేజస్సు వ్యతిరేకము కాదు. అట్లే బుద్ధి, కారణములు, విషయములు, బ్రహ్మమును వదలి వేరుగా యుండలేవు. ఎందుకనగా ఇవన్నియు, బ్రహ్మ సృష్టించినవే. ప్రపంచము వలన బ్రహ్మమునకు వ్యతిరేకముండునుగాని, ప్రపంచమునకు బ్రహ్మముతో వ్యతిరేకము లేదని తాత్పర్యము.(24)

 

శ్లో ॥ బుద్ధేర్జాగరణం స్వప్నః సుషిప్తిరితి చోచ్యతే
మాయామాత్రమిదం రాజన్! నానాత్వం ప్రత్యగాత్మని - 25

టీ :- యదా తు బుద్ధే రసత్త్వం. తదా తదవస్థానాం సుతరా మసత్త్వమిత్యాశయేనాహ - బుద్ధేరితి. నను విశ్వతైజసప్రాజ్ఞానామేవ ఏతా అవస్థాః న బుద్ధేరిత్యాశంక్యాహ - మాయామాత్రమితి. ఇదం విశ్వతైజసప్రాజ్ఞరూపం. (25)

ప్రత్యగాత్మయందలి నానాతత్త్వము యొక్క జాగరణ స్వప్న మరియు (బుద్ధి యొక్క అజాగరణము సుషప్తీ) నిద్ర యనియు చెప్పబడునదంతయు విశ్వ, తైజస, ప్రాజ్ఞుల రూపమేగాని, మరొకటి కాదు. ఇదంతయు మాయయే.(25)

శ్లో ॥ యథా జలధరా వ్యోమ్ని భవన్తి న భవన్తి చ
బ్రహ్మణీదం తథా విశ్వమవయవ్యుదయాప్యయాత్ - 26

టీ :- ఆద్యంతవత్వాదిత్యస్య హేతోరసిద్ధిమాశంక్య సావయవత్వేన సాధయతి యథేతి. అవయవీతి. యత్సావయవం తదాద్యంతవత్ ఘటాదివదిత్యర్థః. అతః ఉదయాప్యయాత్ ఆద్యంతవత్వా ద్విశ్వం సన్నభవతీత్యర్థః. యద్వా - పృథగేవాగమాపాయిత్వాద్విశ్వం మిథ్యా బ్రహ్మతుతదవధిత్వాత్సమిత్యనేన సాధ్యతే. దృష్టాంతస్తు. పూర్వోక్త ఏవ రజ్జుసర్పవదితి. యథా జలధరావ్యోమ్నీతి దృష్టాంత స్యాగమాపాయావధిత్వమాత్రే. న తు మిథ్యాత్వ ఇతి. (26)

మేఘములు ఆకాశమునందు ఎట్లు పుట్టుచు, నశించు చుండునో, అట్లే ఈ విశ్వమంతయు బ్రహ్మయందు పుట్టుచు, నశించు చుండును. అనగా ఆద్యంతములు గల విశ్వము ఉన్నట్లు కనబడు చున్నను, అది ఉండదు. అంతేగాక, పుట్టుట, నశించుట అనునవి ఉన్న కారణముగ విశ్వము మిథ్య. విశ్వమునకు అవధియైన బ్రహ్మము సత్యము. మసక చీకటిలో త్రాడును చూసి, పాము అనుకున్నప్పుడు త్రాడు సత్యమై, పాము మిథ్యయైనట్లే బ్రహ్మమున ఆరోపింపబడిన జగత్తు మిథ్య. బ్రహ్మము మాత్రమే సత్యము.(26)



శ్లో ॥ సత్యం హ్యవయవః ప్రోక్తః సర్వావయవినామిహ
వినార్థేన ప్రతీయేరన్ పటస్యేవాంగ తన్తవః - 27

టీ :- అన్యతమాదృతాదితి. ప్రతిజ్ఞాతం కారణస్య సత్యత్వముపపాదయతి – సత్యమితి. అవయవః కారణం ప్రోక్తః శ్రు. "వాచాభరణం నికారోనామధేయం మృత్తికేత్యేవ సత్య మి" త్యాది శ్రుతిభిః అత్ర యుక్తిమపి దర్శయతి – వినేతి. వినేతి.అంగ హే రాజన్. హి యస్మాత్. అర్థేన అవయవినా వినా పృథగేవావయవాః ప్రతీయేరన్. యథా పటస్యావయవాః తంతవః పటాత్పృథక్ ప్రతీయంతే తద్వదితి.(27)

అవయవములైన దారములకంటే అవయవియైన వస్త్రములు భిన్నముగ కనబడును. అది భిన్నముకాదు. అంతమాత్రమున అవి వస్త్రమునకు భిన్నములు కావు. అవయవములు అయిన కరవాదాదుల కంటే అవయవులైన మనువ్యాదులు భిన్నములుగా కనబడినను భిన్నములు కాదు. (27)

శ్లో ॥ యత్సామాన్య విశేషాభ్యాముపలభ్యేత స భ్రమః
అన్యోన్యాపాశ్రయాత్సర్వమాద్యంత వదవస్తు యత్ - 28

టీ :- నను కార్యాభావే కారణత్వం బ్రహ్మణః కుతో ఘటేత? సత్యం. తదపి నాతీవ సత్యమిత్యాహ – యదితి. సామాన్యం. కారణం విశేషః కార్యం. తద్రూపేణ. అన్యోన్యాపాశ్రయాత్ పరస్పరాపేక్షత్వేన నిరూపణానర్హత్వాదిత్యర్థః. అతః కారణత్వ మవధిత్వం వ్యాపకత్వ మిత్యాదికమపి యత్పరాపేక్షత్వాదాద్యంతవత్ తత్సర్వమవస్త్విత్యర్థః. యద్వా. అత్రైవ హేత్వంతరమేవైతత్. యదుపలభ్యేత సభ్రమః.

సామాన్యము కారణమనియు, విశేషము కార్యమనియు, కావున వీని మధ్య అన్యోన్యాశ్రయము కలదనియు భావించుట భ్రమ మాత్రమే. సామాన్య విశేషములు రెండును స్వప్నములవంటివే. కావున ఆద్యంతములవలె సర్వము అవస్తువే.(28)



సామాన్యవిషేశ రూపత్వాత్ అన్యోన్యాపాశ్రయాదితీదమపి హేత్వంతరం గుణగుణి విశేషణ విశేష్యవ్యాప్యవ్యాపకత్వ విశేషావధిత్వ కార్య కారణత్వాది రూపేణ పరస్పరాధీనసిద్ధిత్వాత్ తథాభూతస్వప్నవదితి నిగమనం. అతో యదాద్యంతవత్తత్సర్వమవస్త్వితి. (28)

శ్లో ॥ వికారః ఖ్యాయమానోఽపి ప్రత్యగాత్మాన మన్తరా
న నిరూప్యోఽస్త్యణురపి స్యాచ్చేచ్చిత్సమ ఆత్మవత్ - 29

టీ :- తదేవమనేకైర్హేతుభిః ప్రపంచస్యాసత్త్వం ప్రసాధితం. అత్ర శంకా. నను ప్రపంచస్యాపి ప్రకాశమానత్వాదాత్మవత్సత్త్వం కిం న స్యాత్? ఇతి తత్రాహ - వికార ఇతి. ఖ్యాయమానః ప్రకాశమానోఽపి వికారః ప్రపంచః. ప్రత్యగాత్మప్రకాశం వినాణుమాత్రోఽపి న నిరూప్యోఽస్తి. తం వినానిరూప్యస్స్యాచ్చేత్. తర్హి. సోఽపి చిత్సమస్స్యాత్ చిద్రూపేణాత్మనా సమస్స్వప్రకాశో భవేత్. తథాచ సతి సోఽపి ఆత్మవత్స్యాత్ ఏకరూపస్స్యాదిత్యర్థః. (29)

ప్రపంచము చెప్పబడుచున్నను అది ఆత్మవలె సత్యమైనది అని పలుకుట సరికాదు. ప్రపంచము ప్రకాశించుచున్నను అది ప్రత్యగాత్మ యొక్క వెలుగు లేనిచో అణుమాత్రమైనను (కనబడదు) ప్రకాశించదు. ప్రత్యగాత్మ ప్రకాశము లేకున్నను అది ప్రకాశించునో, అది చిత్స్వరూపమువలె స్వయముగానే వెలుగొందియుండును. అట్లయినప్పుడది ఆత్మవలె ఏకరూపముననే ఉండెడిది. (29)



శ్లో ॥ నహి సత్యస్యనానాత్మమ విద్వాన్ యది మన్యతే
నానాత్వం ఛిద్రయోర్యద్వజ్జ్యోతి షోర్వాతయోరివ - 30

టీ :- కుతఇత్యత ఆహ - నేతి. నను సత్యస్యాప్యాత్మనో జీవబ్రహ్మ రూపనానాత్వమస్త్యేవ తత్రాహ - యద్యేవం నానాత్వం మన్యతే. తర్హ్యవిద్వాన్. కథం తర్హితయోర్భేదవ్యవహారః. ఉపాధికృత ఇత్యాహ - నానాత్వమితి. తత్తచ్ఛిద్రయోర్ఘటాకాశ మహాకాశయోరివేతి పరిచ్ఛేదే దృష్టాంతః. జ్యోతిషోః. ఆకాశజలస్థ సూర్యయోరివేత్యుపాధి కృతవికార సదసద్భావే. వాతయోర్బాహ్యశరీరస్థ వాయ్వోరివేతి క్రియాభేదే. (30)

సత్యస్వరూపమునకు నానాస్వరూపములుగా ప్రకాశించుట సంభవించదు అన్నచో ఘటాకాశము, మహాకాశము, ఆకాశజలము, భూమి జలము, ఆకాశ సూర్యుడు, జలసూర్యుడు, బాహ్యావాయువు, శరీరస్థవాయువు, అనుట ఎట్లు సంభవించును? కావున సత్యమగు బ్రహ్మము నానాస్వరూపములలో భాసించును. (30)

శ్లో ॥ యథా హిరణ్యం బహుధా సమీయతే
నృభిః క్రియాభిర్వ్యవహారవర్త్మసు
ఏవం వచోభిర్భగవానధోక్షజో
వ్యాఖ్యాయతే లౌకిక వైదికైర్జనైః - 31

టీ :- బ్రహ్మణ ఏవ ప్రపంచవ్యవహారాలంబనత్వం దృష్టాంతేన స్పష్టయతి. యథేతి. క్రియాభిస్తత్తద్రచనాభేదైః. బహుధా కటక కుండలాదిరూపేణ లౌకికవైదికైర్వచోభిర్జ్ఞైరహంకారోపహతైః (31)

మూలపదార్థమగు బంగారమొకటియే అయినను లోకములో మానవులు తమ తమ క్రియావ్యవహారములలో కుండలములన్నియు, హారములనియు, అంగులీయకములనియు వ్యవహరింతురు. అట్లే లోకము లోని అహంకారయుతులైన జనుల వ్యవహార భాషణముల లోను, వేదవాక్కులలోను భగవంతుడైన కృష్ణుని అనేక రూపములుగ కీర్తింపబడుచుండును. (31)



శ్లో ॥ యథా ఘనోఽర్క ప్రభవోఽర్కదర్శితో
హ్యర్కాంశభూతస్యచ చక్షుషస్తమః
ఏవం త్వహం బ్రహ్మ గుణస్తదీక్షితో
బ్రహ్మాంశక స్యాత్మన ఆత్మబంధనః - 32

టీ :- నన్వహంకారస్య కథం బ్రహ్మస్వరూపావరణేన భేదవ్యవహార హేతుత్వం తస్య స్వకారణభూతబ్రహ్మావారకత్వా సంభవాత్. ఆవరణే వా స్వస్యాపి ప్రకాశాసంభవాదిత్యాశంక్య సదృష్టాంతమాహ - యథేతి. అర్కరశ్మయ ఏవ మేఘరూపేణ పరిణతా వర్షంతి. శ్లో. " అగ్నౌప్రాస్తా హుతిస్సమ్యగాదిత్యముపతిష్ఠతే, ఆదిత్యాజ్జాయతే వృష్టిర్వృష్టేరన్నం తతః ప్రజా " ఇత్యాది వచనాత్. తస్మాదర్కప్రభవః - అర్కేణైవ దర్శితః ప్రకాశితశ్చ తమః స్వరూపభూతార్కదర్శన ప్రతిబంధకో భవతి. అహం అహంకారః. బ్రహ్మగుణః బ్రహ్మకార్యభూతః. తదీక్షితస్తేనైవ ప్రకాశితశ్చ ఆత్మనో జీవస్య ఆత్మబంధనః బ్రహ్మస్వరూపదర్శన ప్రతిబంధకో భవతి. (32)

సూర్యుని కిరణములే మేఘముల రూపమున పరిణమించినవై వర్షములు కురిపించును అగ్నిలో వ్రేల్చబడిన హవిస్సు సూర్యుని చేరును. సూర్యుని వలన వానలు కురియును. వానల వలన పంటలు పండి, ప్రజలకు అన్నము లభించును. అన్నము వలననే ప్రజోత్పత్తి జరుగును అను మాటలననుసరించి, సూర్యుని వలననే మేఘములు ఉద్భవించును ఆ మేఘములే సూర్యకాంతిని కప్పివేసినప్పుడు, సూర్యదర్శనమునకు ప్రతిబంధమేర్పడును. సూర్యుని వలన పుట్టి, సూర్యునివలననే ప్రకాశింపబడుచున్న మేఘములు సూర్యుని కప్పివేసి, చూడకుండ చేసినట్లే, అహంకారముకూడ బ్రహ్మచే సృష్టింపబడి, బ్రహ్మచేతనే ప్రకాశింపబడినదైనను, బ్రహ్మయొక్క అంశమైన జీవునికి బ్రహ్మ స్వరూపమును చూడనీయక, అడ్డుగా నిలుచును. (32)



శ్లో ॥ ఘనో యదార్క ప్రభవో విదీర్యతే
చక్షుః స్వరూపం రవిమీక్షతే తదా
యదా హ్యహంకార ఉపాధిరాత్మనో
జిజ్ఞాసయా నశ్యతి తర్హ్యనుస్మరేత్ - 33

టీ :- అత ఏవాహంకారనాశే స్వరూపదర్శనం భవతీతి తేనైవ దృష్టాంతేనాహ - ఘనఇతి. ఆత్మనః ఉపాధిః. జిజ్ఞాసయా విచారేణ తర్హి తదా. అనుస్మరేత్. బ్రహ్మాహమితి పశ్యతీత్యర్థః. (33)

సూర్యుని నుండి పుట్టిన మేఘము ఎప్పుడు సూర్యునికి అడ్డు తొలగిపోవునో, అప్పుడు కన్నులు సూర్యుని బింబమును దర్శింపగలుగును. అట్లే ఆత్మ యొక్క ఉపాధి కూడా జిజ్ఞాసతో కూడుకొన్న వానిచే చూడబడినప్పుడు, అహంకారము నశించి, నేను బ్రహ్మము అను జ్ఞానము కలుగును. (33)

శ్లో ॥ యదైవ మేతేన వివేక హేతినా
మాయామయాహంకరణాత్మబంధనమ్
ఛిత్త్వాఽచ్యుతాత్మానుభవోఽవతిష్ఠతే
తమాహుదాత్యన్తికమంగ సంప్లవమ్ - 34

టీ :- సోఽయమాత్యంతిక ప్రలయ ఇత్యుపసంహరతి - యదేతి. వివేకహేతినా జ్ఞానశస్త్రేణ అహంకరణమేవాత్మబంధనం అచ్యుతం పరిపూర్ణమాత్మాన మనుభవతీతి తథా. (34)

వివేకము అనెడి శస్త్రము చేత మాయామయమగు (ఆత్మను కప్పివేసినదగు) అహంకారమనెడి బంధమును ఛేదించినప్పుడు అచ్యుతుడే ఆత్మయందు పరిపూర్ణముగ నిండిపోవును. అదియే ఆత్యన్తిక ప్రళయమని పెద్దలు చెప్పుచున్నారు.(34)



శ్లో ॥ నిత్యదా సర్వభూతానాం బ్రహ్మాదీనాం పరన్తప !
ఉత్పత్తి ప్రలయావేకే సూక్ష్మజ్ఞాః సంప్రచక్షతే - 35

టీ :- నిత్యప్రలయమాహ - నిత్యదేతి. (35)

బ్రహ్మ మొదలగువారి యొక్కయు, సకల భూతముల యొక్కయు ఉత్పత్తి ప్రళయములే నిత్య ప్రళయములని సూక్ష్మజ్ఞానులైన మహనీయులు పలుకుచున్నారు. (35)

శ్లో ॥ కాలస్రోతో జవేనాశు హ్రియమాణస్య నిత్యదా
పరిణామినామనస్థాస్తా జన్మ ప్రలయ హేతవః - 36

టీ :- కుత ఇత్యత ఆహ - కాలేతి పరిణామినాం నదీప్రవాహ ప్రదీపజ్వాలాదీనాం యా ఉచ్చనీచావస్థాః. తాః కాలరూపస్రోతసో వేగేనాశు హ్రీయమాణస్య దేహాదేర్ద ృశ్యమానాః. తద్వదేవ నిత్యదా జన్మప్రలయహేతవో భవంతి. దేహః ప్రతిక్షణం ప్రధ్వంసీ. ప్రతిక్షణం అవస్థాభేదాస్పదత్వాత్. ప్రదీపాదివదిత్యనుమానం. (37)

నదీప్రవాహములు, ప్రదీప జ్వాలలు, దీప జ్వాలలు ఉచ్చనీచవస్థలను, వేగాలస్యములను కాలానుగుణముగ పొందు చుండును. అట్లే శరీరములో నిత్యము ఏర్పడుచున్న మార్పులే జన్మ ప్రళయములకు కారణములగును. దేహము ప్రతిక్షణము ధ్వంసమై (జీర్ణమై, శిథిలమై) పోవుచుండును. దీనికి కారణము అనుక్షణము దేహములో కలిగెడి అవస్థలే. కనుక నదీ ప్రవాహములవలె, దీపజ్వాలలవలె శరీరములలోను అనుక్షణము కలిగెడి పెరుగుట తరుగుటలు, నిత్య ప్రళయములని తాత్పర్యము.(36)

శ్లో ॥ అనాద్యంతవతాఽనేన కాలేనేశ్వర మూర్తినా
అవస్థానైవ దృశ్యన్తే వియతి జ్యోతిషామివ - 37

టీ :- యది ప్రతిక్షణమవస్థా భవంతి. తర్హి కిం న దృశ్యంతే? అతో

ఆద్యంతములులేని కాలప్రవాహమున జన్మించు అవస్థలుపైకి కనబడవు. ఆకాశమున సంచరించు చంద్రాదుల గమనములు తెలియనట్లే శరీరములయందు అనుక్షణము కలుగు మార్పులు తెలియవు. చంద్రాదులు వారి వారి స్థానములు మారినప్పుడు మాత్రమే వారి గమనములు ఊహింపబడును. అట్లే బాల్యయౌవనాద్యవస్థలు



హేతురసిద్ధ ఇత్యాశంక్యాహ - అనాద్యంతవతేతి. అనాద్యంతవతా కాలేన జాయమానా అవస్థాః నైవ లక్ష్యంతే. ఆకాశే గచ్ఛతాం జ్యోతిషాం చంద్రాదీనాం గమనాద్యవస్థావిశేషాః యథా నైవ లక్ష్యంతే తద్వత్. అతో యథా తేషాం ప్రదేశాంతరప్రాప్త్యా ప్రతిక్షణం గత్యవస్థాః కల్ప్యంతే. తద్వదత్రాపి బాల్యతారుణ్యాది దర్శనేన మధ్యవర్తిన్యో ऽవస్థాః కల్ప్యంత ఇతి న హేతురసిద్ధ ఇత్యర్థః. (37)

శ్లో ॥ నిత్యో నైమిత్తిక శ్చైవ తథా ప్రాకృతికో లయః
ఆత్యన్తికశ్చ కథితః కాలస్య గతిరీదృశీ - 38

టీ :- ఉపసంహరతి - నిత్య ఇతి. (38)

శ్లో ॥ ఏతాః కురుశ్రేష్ఠ ! జగద్విధాతుః
నారాయణస్యాఖిల సత్త్వధామ్నః
లీలాకథాస్తే కథితాః సమాసతః
కార్త్స్న్యేన నాజో ऽప్యభిధాతుమీశః - 39

టీ :- పురాణార్థముపసంహరతి - ఏతా ఇతి. లీలావిషయాః. కథాః . అజో బ్రహ్మాపి కార్త్స్న్యేనాభిదాతుం నేశః. (39)

సంభవించినప్పుడే శరీరములో జరుగు మార్పులు గుర్తింపబడును. (37)

ఇంతవరకు నిత్యము, నైమిత్తికము, ప్రాకృతికము, ఆత్యన్తికము అనెడి నాలుగు విధములగు ప్రళయములను గూర్చి, కాలగమనమును గూర్చి తెలుపబడినది. (38)

జగన్నిర్మాతయు, అఖిల ప్రాణులకు నిలయమైనవాడును అయిన నారాయణుని లీలా విషయములను తెలిపెడి కథలను బ్రహ్మదేవుడు కూడా పూర్తిగా తెలిసికొనలేదు. (39)



శ్లో ॥ సంసారసింధుమతి దుస్తరముత్తి తీర్షోః
నాన్యః ప్లవో భగవతః పురుషోత్తమస్య
లీలాకథారస నిషేవణ మన్తరేణ
పుంసో భవేద్వివిధ దుఃఖదవార్దితస్య - 40

టీ :- నను యది సాకల్యేన కేనాప్యభిధాతుం న శక్యతే తర్హి కిం తదభిధానేన? తత్రాహ - సంసారేతి. వివిధం దుఃఖమేవ దవో దావానలస్తేన అర్దితస్య పీడితస్య అతః ఉత్తితీర్షోః పుంసః భగవతో యా లీలాస్తాసాం కథాః తాసాం రసస్తన్నిషేవణమంతరేణ అన్యః ప్లవస్తరణసాధనం భవేత్. ఉపాయాంతరాసంభవాత్ తత్కథాశ్రవణమేవ యథాశక్తి నిషేవ్యమిత్యర్థః. (40)

దాటుటకు శక్యముకాని సంసార సాగమును దాటగోరెడివారికి నారాయణుని లీలలను తెలిపెడి కథలే నౌకలవంటివి. అవియే నరులకు ఏకైక శరణ్యములు. దుఃఖదావాగ్నికి బలియగుచున్న జనులు నారాయణుని మహిమను దెలిపెడి కథలను ఆస్వాదించి, దుఃఖమును పోగొట్టుకొనవలెనని తాత్పర్యము.(40)

శ్లో ॥ పురాణ సంహితామేతా మృషిర్నారాయణోఽవ్యయః
నారదాయ పురా ప్రాహ కృష్ణద్వైపాయనాయ సః - 41

టీ :- శ్రోతురాదరదార్ఢ్యాయ సంప్రదాయ ప్రవృత్తిమాహ - త్రిభిః పురాణసంహితామితి. (41)

ఈ పురాణ సంహితను అవ్యయుడైన నారాయణుడు నారదునికి చెప్పగా నారదుడు కృష్ణ ద్వైపాయనుడను వ్యాసునికి చెప్పెను. కనుక ఈ కథా సంహిత సంప్రదాయానుగతమని భావము. (41)



శ్లో ॥ స వై మహ్యం మహారాజ! భగవాన్ బాదరాయణః
ఇమాం భాగవతీం ప్రీతః సంహితాం వేదసమ్మితామ్ - 42

టీ :- స ఇతి. స వై బాదరాయణః ప్రీతస్సన్ మహ్య మిమాం సంహితాం ప్రాహేతి. పూర్వేణాన్వయః. (42)

బాదరాయణుడను పేరుగల ఆ కృష్ణద్వైపాయనుడు ప్రీతుడై, ఈ భాగవతకథాసంహితను నాకు చెప్పెను. ఇది వేద సమ్మితమైనది. అనగా వేదధర్మమునకు అనుగుణమైనది. (42)

శ్లో ॥ ఏతాం వృక్ష్యత్యసౌ సూత ఋషిభ్యో నైమిషాలయే
దీర్ఘసత్రే కురుశ్రేష్ఠ! సంపృష్టః శౌనకాదిభిః - 43

టీ :- ఏతామితి. అసౌ సూత ఇతి పురుతః స్థిత మంగుల్యా నిర్దిశ్యాహ - నైమిశాలయే నైమిశారణ్యస్థానే. (43)

ఈ కథాసంహితను సూతదును పౌరాణికుదు నైమిశారణ్యములో దీర్ఘ సత్రయాగములో పాల్గొనుచున్న శౌనకాది మహర్షు కోరికపై, వారికి చెప్పగలదు. (43)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే ద్వాదశస్కంధే చతుర్థోఽధ్యాయః**

**శ్రీమద్భాగవత మహాపురాణము యొక్క ద్వాదశస్కంధమునందలి చతుర్థాధ్యాయము సమాప్తము.**



## పంచమోఽధ్యాయః

శ్రీ శుక ఉవాచ

శ్లో ॥ అత్రానువర్ణ్యతే భీక్ష్ణం విశ్వాత్మా భగవాన్ హరిః ।
యస్య ప్రసాదజో బ్రహ్మా రుద్రః క్రోధసముద్భవః - 1

టీ :- పంచమే తు సమాసేన పరబ్రహ్మోపదేశతః, రాజ్ఞస్తక్షకసందంశాన్మృత్యుభీతినివారణమ్. ఏతత్పురాణం శృణ్వన్నభయం ప్రాప్నోతీత్యభిప్రేత్య పురాణార్థమనుస్మారయతి - అత్రేతి. అయం భావః. జగత్కర్తా బ్రహ్మాసి యస్య ప్రసాదజః. ప్రసాదోఽత్ర రజోవృత్తి ర్హర్షః తతోజాతత్వాత్తత్పరతంత్రః. సర్వసంహర్తా రుద్రశ్చ యస్య క్రోధ సముద్భవో న తు స్వతంత్రః. సః విశ్వస్యాత్మా నియంతా భగవానత్రానువర్ణ్యతే. అత ఏవం భూతం భాగవతం శృణ్వతః కుతోఽన్యస్మాద్భయం శంకేతి. (1)

శ్లో ॥ త్వం తు రాజన్! మరిష్యేతి పశుబుద్ధి మిమాం జహి !
న జాతః ప్రాగభూతోఽద్య దేహవత్త్వంన నంక్ష్యసి - 2

టీ :- త్వం తు పునః కృతార్థఏవేత్యనుస్మారయతి - త్వమితి. పశుబుద్ధిం అవివేకం యస్మాన్ననంక్ష్యసి. కుత ఇత్యత ఆహ - న

## పంచమాధ్యాయము

### శ్రీశుకమహర్షి పలుకుచున్నాడు

ఈ పంచమాధ్యాయమున పరబ్రహ్మోపదేశము ముఖ్య విషయము తక్షక విషాగ్నికి భీతిల్లిన పరీక్షిన్మహారాజు యొక్క మృత్యుభయమును తొలగించుటయే ఈ అధ్యాయ ప్రయోజనము. ఈ భాగవతపురాణమును విన్నవారికి మృత్యుభయముండదు. ఏ భగవంతుని హర్షము వలన బ్రహ్మదేవుడు జన్మించెనో, ఏ భగవంతుని క్రోధమునుండి రుద్రుడు జన్మించెనో, ఆ భగవంతుడైన, విశ్వాత్ముడైన, నియామకుడైన విష్ణువు ఈ భాగవతమున వర్ణింపబడగా, అట్టి భగవంతుని కథలు విన్నవారికి ఇతరముల వలన భయమేలకలుగును? బ్రహ్మరుద్రులు నారాయణుని నుండి పుట్టినందున వారు స్వతంత్రులు కారనియు, పరతంత్రులనియు తాత్పర్యము. (1)

ఓ పరీక్షిన్మహారాజా ! నేను చావగలను అనెడి నీ అవివేకమును విడిచిపెట్టుము. దేహము తొలుత ఉండియుండలేదు. ఇప్పుడు పుట్టినది. ఇది నశించిపోవును. కాని, నీవు పూర్వము లేవనుమాట లేదు. నీవు ఇప్పుడు పుట్టలేదు. కావున నీవు నశింపవు.(2)



జాత ఇతి. యథాదేహః ప్రాగభూత ఏవాద్యజాతో నన్క్ష్యతి చ. నచైవం త్వం పూర్వం నాభూః నచాద్య జాతోఽసి. అతో ననన్క్ష్యసి.(2)

శ్లో ॥ న భవిష్యసి భూత్వా త్వం పుత్ర పౌత్రాదిరూపవాన్
బీజాంకురవద్దేహాదేర్వ్యతిరిక్తో యథాఽనలః - 3

టీ :- నను బీజాదంకురవత్ స్వస్మాత్ పుత్రరూపేణ స్వయమేవ భవతి. యథాహ. శ్రు.“ అంగాదంగాత్సంభవతి హృదయాదధిజాయసే, ఆత్మా వై పుత్రనామాసి స జీవశరదశ్శతమి” తి. తతః పునరంకురాద్బీజ మివ పౌత్రరూపేణాపి స్వయమేవ భవతి. శ్రు. “పితా పుత్రేణ పితృమాన్యోనియోనా”వితి శ్రుతేః. అతస్తేషు నశ్యత్సు కథం న నన్క్ష్యామీతి చేత్తత్రాహ - న భవిష్యసీతి. భూత్వా పుత్రపౌత్రాది రూపవాన్. బీజాదంకురవత్. నభవిష్యసి యస్మాద్దేహాదేర్వ్యతిరిక్తస్త్వం. యథానలః కాష్ఠాత్. దేహాద్దేహో జాయతే నాత్మేతి భావః. (3)

శ్లో ॥ స్వప్నే యథాశిరశ్ఛేదం పంచత్వాద్యాత్మనః స్వయమ్
యస్మాత్పశ్యతి దేహస్య తత ఆత్మా హ్యజోఽమరః - 4

టీ :- జన్మాదీనాం దేహధర్మత్వం దృష్టాంతేన ప్రపంచయతి - స్వప్న

దేహము నుండి దేహము పుట్టునేగాని ఆత్మపుట్టదు. నీవు మరణించినను పుత్ర పౌత్రాదుల రూపములో మరల నీవు జన్మింతువు. అంగము నుండి అంగమునుండి నీవు జన్మింతువు. హృదయము నుండి నీవు ప్రభవింతువు. పుత్రుడను పేరుతో నీవే మరల జన్మించుచున్నావు. అట్టి నీవు నూరు సంవత్సరములు జీవించెదవు గాక, అనెడి శ్రుతివాక్యమే ఇచట ప్రమాణము. అంకురము నుండి బీజము పుట్టును. ఆ తరువాత అంకురము నశించును. అట్లే నీవును పుత్ర పౌత్రాదుల రూపమున జన్మించుచు. జనక రూపమున మరణింతువు. కాలుతున్న కర్రలో నిప్పు వేరైయున్నట్లు, కర్ర దహించుకొని పోయినను, అగ్ని వంటి ఆత్మకు నాశము లేదు. (3)

కలలో శిరశ్ఛేదనము, మరణమును మానవుడు స్వయముగా ఎట్లు చూడగలడో, అట్లే జాగరణ స్థితి యందును సంభవము. దేహము నశించుటను స్వయముగా చూచినట్లే, ఆత్మ విషయములో కూడ ఈ శరీరనాశము భ్రమయే యధార్థముగ చెప్పినచో ఆత్మకు

ఇతి. స్వప్నే యథా ఆత్మనః శిరశ్ఛేదం స్వయం పశ్యతి. ఏవం జాగరణేఽపి యస్మాద్దేహస్య పంచత్వాదికం పశ్యతి. తద్వదేవాత్మనః ఇదం భ్రమమాత్రం. వస్తుతస్తు ఆత్మా అజోఽమరశ్చేత్యర్థః. తదుక్తం. శ్లో. "ఆత్మనః పితృపుత్రాభ్యా మనుమేయౌ భవాప్యయౌ, నభవాప్యవస్తూనామభిజ్ఞోఽద్వయలక్షణ" ఇత్యాది. (4)

శ్లో ॥ ఘటే భిన్నే యథాఽకాశః ఆకాశః స్యాద్యథా పురా
ఏవం దేహే మృతే జీవో బ్రహ్మ సంపద్యతే పునః - 5

టీ :- యస్మాద్దేహోపాధికోఽయమాత్మనో జన్మాదిసంసారభ్రమః. తస్మాదుపాధినివృత్తౌముచ్యత ఇతి సదృష్టాంతమాహ - ఘట ఇతి. యథా పురా ఘటోపాధేః పూర్వమివ పునః ఘటే భిన్నే తదంతర్వర్త్య వకాశః ఆకాశ ఏవ స్యాద్యథా ఏవం దేహే మృతే తత్త్వజ్ఞానేన లీనే సతి తద్వత్.(5)

శ్లో ॥ మనః సృజతి వై దేహాన్ గుణాన్ కర్మాణి చాత్మనః
తన్మనః సృజతే మాయా తతో జీవస్య సంసృతిః - 6

జన్మలేదు. మరణమును లేదు. తండ్రి, కొడుకు, మనుమడు అనెడి వ్యవహారములననుసరించి జనన మరణాదులు అనుమానింప బడుచున్నవే గాని, ఆత్మకు జనన మరణాదులు లేవు. అది అద్వైతలక్షణము. (4)

కుండ పగిలిపోగానే కుండలోని ఆకాశము మహాకాశములో అంతర్భవించినట్లే తత్త్వజ్ఞానముతో దేహము నశించగానే జీవుడు బ్రహ్మమునందు అంతర్భవించును. (కుండ పగిలినను ఆకాశము పూర్వమువలె అఖండముగానే ఉండును. కాని కుండలోని ఆకాశము నివృత్తి అయినందున అది మహాకాశములో కలిసినట్లనిపించును. వాస్తవమేమనగా ఘటాకాశము మహాకాశముతో పూర్వము నుండి కలిసియేయుండెను. అదే విధంగా దేహపాతమైనప్పుడు జీవుడు బ్రహ్మమైనట్లు కనిపించును. యథార్థమేమంటే జీవుడు బ్రహ్మమే. జీవుని యొక్క అబ్రహ్మత్వము ఆభాసమే) (5)

పూర్వకర్మలచే ప్రేరితమైన మనస్సు సత్త్వాది సద్గుణములను సృష్టించును. గుణములు కర్మలను సృజించును. మనస్సు మాయను సృష్టించును. ఆ తరువాత మాయాద్యుపాధులు చేరుట వలన జీవునకు



టీ :- జ్ఞానేన లయంసంభావయితుం మాయాకృతమాత్మనో దేహాద్యుపాధిసంబంధప్రకారమాహ - మన ఇతి. మన ఆత్మనో దేహాదీన్ సృజతి. తచ్చ మనోమాయా సృజతి. తతో మాయాద్యుపాధి సముదాయాత్. జీవస్య సంసృతిః. న వస్తుతః. (6)

శ్లో ॥ స్నేహాధిష్ఠాన వర్త్యగ్ని సంయోగో యావదీయతే
తతో దీపస్య దీపత్వమేవం దేహకృతో భవః
రజః సత్త్వతమోవృత్త్యా జాయతేఽథ వినశ్యతి - 7

టీ :- ఏతదేవ సదృష్టాంతమాహ - సార్ధేన. స్నేహేతి. తతో దీపస్య జ్యోతిషః. దీపత్వం జ్వాలారూపః పరిణామః తత్ర తైలస్థానీయం కర్మ. తదధిష్ఠానస్థానీయం మనః. వర్తిస్థానీయో దేహః. అగ్నిసంయోగ స్థానీయశ్చైతన్యాధ్యాసః. దీపస్థానీయస్సంసార ఇతి యోజ్యం. దేహకృతః దేహనిబంధనః. యద్వా - దేహకృతో మనసః న త్వాత్మనః. (7)

శ్లో ॥ న తత్రాత్మా స్వయంజ్యోతిర్యో వ్యక్తా వ్యక్తయోః పరః
ఆకాశ ఇవ చాధారో ధ్రువోఽనన్తో పరమస్తతః - 8

సంసార బంధమేర్పడును. అంతేగాని, జీవునకు సహజసిద్ధముగ సంసార బంధము లేదు. (6)

జీవుని సంసార బంధము ఉపాధితో ముడివడియున్నది. ఆ బంధము నశించినప్పుడు అతనిలో జీవత్వము పోవును. దీపమునకు జ్వాల పరిణామము. దీపములోని తైలము వంటిది కర్మ. ఆ కర్మను అధిష్టించియే మనస్సు ఉండును. వత్తి వంటిది శరీరము. అగ్ని సంయోగమే చైతన్యము. దీపము సంసారమునకు ప్రతీక. దేహకృతమైనది పుట్టుక. సత్త్వరజస్తమోగుణముల కలయికచే శరీరము పుట్టుచు, నశించుచుండును.(మనస్సే ఆత్మ కొఱకు శరీరము, విషయములు మఱియు కర్మల యొక్క కల్పన చేసికొనును. ఆ మనస్సును మాయ (అవిద్య) సృష్టించును. వాస్తవమేమనగా మాయనే జీవుడు సంసారచక్రమున పడుటకు కారణము) (7)

దీపము నశించినట్లు సంసారము నశించునేగాని, ఆత్మ ఎన్నటికీ నశించదు. ఆత్మ స్వయముగనే వెలుగుచుండును. అది స్థూల, సూక్ష్మదేహములకంటే భిన్నమైనది. అది ప్రపంచమునకు

టీ :- అతో దీపవత్సంసార ఏవ నశ్యతి. న త్వాత్మాజ్యోతిర్వదిత్యాహ - నేతి. న తు తత్ర ప్రతీయమానః. ఆత్మా కుత ఇత్యత ఆహ - య ఇతి. వ్యక్తావ్యక్తయోః స్థూలసూక్ష్మదేహయోః. పరః అన్యః. యతః స్వయం జ్యోతిః పరత్వం ప్రపంచయతి ఆకాశ ఇవేతి. ఆధారో దేహాదిప్రపంచస్య ధ్రువో నిర్వికారః. నాస్త్యంతః ఉపమా చ యస్య సః అనంతోపమః. తతోవిభుః. (8)

ఆకాశమువలె ఆధారమైనది. నిర్వికారమైనది. అనంతములైన ఉపమానములు గలది. నిత్యమైనది. శాశ్వతమైనది. (8)

శ్లో ॥ ఏవ మాత్మాన మాత్మస్థ మాత్మ నైవాఽఽమృశ ప్రభో!
బుద్ధ్యానుమానగర్భిణ్యా వాసుదేవానుచిన్తయా - 9

టీ :- అతస్తమేవ చిందయేత్యాహ - ఏవమితి. ఆత్మస్థం. దేహాద్యుపాధిస్థం. ఆమృశ విచారయ. అనుమానగర్భిణ్యా ద్రష్టృ దృశ్యాద్యన్వయ వ్యతిరేకయుక్తయా. (9)

ఈ విధముగ దేహాద్యుపాధులలో నున్న ఆత్మను గూర్చి ఆలోచింపుము ద్రష్ట, దృశ్యము, అన్వయము, వ్యతిరేకము మొదలైన అనుమానముల చేతను, వాసుదేవుని అనుచింతనము చేతను ఆత్మను తెలిసికొనుము.( హే రాజా ! నీ యొక్క విశుద్ధమైన వివేకబుద్ధిని పరమాత్మ చింతనతో పూర్తిగా నింపుకో మరియు నీవే, నీలో ఉన్న పరమాత్మను సాక్షాత్కారము చేసుకో)(9)

శ్లో ॥ చోదితో విప్రవాక్యేన న త్వాం ధక్ష్యతి తక్షకః
మృత్యవో నోపధక్ష్యన్తి మృత్యూనాం మృత్యుమీశ్వరమ్ - 10

టీ :- ఏవం చ సతి త్వాం తక్షకో న దేహేదిత్యాహ - చోదిత ఇతి. తత్ర హేతవః. మృత్యవ ఇతి. మృత్యుహేతవః. (10)

ఆత్మను గూర్చి నీవు తెలిసికొన్నచో, తక్షకుడు విప్రవాక్య చోదితుడై నిన్ను కాటువేయదు. మృత్యువులకే మృత్యువైన ఈశ్వరుని తెలిసికొన్నప్పుడు మృత్యుహేతువులు నిన్ను ఏమీ చేయలేవు. (10)



శ్లో ॥ అహం బ్రహ్మ పరంధామ బ్రహ్మాహం పరమంపదమ్
ఏవం సమీక్షన్నాత్మానమాత్మన్యాధాయ నిష్కలే - 11

టీ :- విమర్శప్రకారం దర్శయన్ తక్షకాదర్శనం దర్శయతి - ద్వాభ్యాం. అహమితి. యోఽసావహం స బ్రహ్మైవ. యద్బ్రహ్మ తదహమేవేతి. సమీక్షన్ తత్ర అహంబ్రహ్మేతి భావనయా జీవస్య శోకాదినివృత్తిః. బ్రహ్మాహమితి భావనయా చ బ్రహ్మణః పారోక్ష్య నివృత్తిర్భవతీతి వ్యతీహారార్థో దర్శితః. నిష్కలే నిరుపాధౌ ఆత్మని బ్రహ్మణి. (11)

నేను అనబడేవాడు ఆ బ్రహ్మయే, ఏది బ్రహ్మమో అది నేనే అని తెలిసికొనుము. అహం బ్రహ్మ (నేనే బ్రహ్మము) అని భావించుట వలన జీవునకు శోకాదులు దూరమగును. నేనే బ్రహ్మము అనుకొన్నప్పుడు బ్రహ్మపరోక్షభావనము నశించును.(11)

శ్లో ॥ దశన్తం తక్షకం పాదే లేలిహానం విషాననైః
నద్రక్ష్యసి శరీరంచ విశ్వం చ పృథగాత్మనః - 12

టీ :- దశంతమితి. విషయుక్తైరాననైః దశంతం గ్రసంతం. తక్షకం. లేలిహానం సర్పం. యద్వా. లేలిహానం జిహ్వాభిరోష్ఠప్రాంతం సనిష్పేష మాస్వాదయంతం. ఆత్మనః పృథక్. (12)

విషములతో కూడిన కోరలతో కాటువేయుచున్న తక్షకుని ఆత్మకంటె భిన్నమైన వానిగా నీవు చూడలేవు. అనగా ఆత్మబుద్ధితో నీవు అన్నింటిని చూచినప్పుడు శరీరముపై భ్రాంతి తొలగిపోవునని తాత్పర్యము. (12)



శ్లో ॥ ఏతత్తే కథితం తాత! యథాஉஉత్మా పృష్టవాన్నృప!
హరేర్విశ్వాత్మనశ్చేష్టాం కిం భూయః శ్రోతుమిచ్ఛసి - 13

టీ :- ఏతదితి. హరేశ్చేష్టాం లీలాం ప్రతి ఆత్మాత్వం యత్ పృష్టవాన్. తదేవ తత్తే కథితం. శిష్యస్య కృతార్థతా పరీక్షణాయ పృచ్ఛతి - కిమితి. (13)

ఆత్మవైన నీవు హరి చేష్టలను గూర్చి అడిగితివి గాన, నీకు ఈ విషయములన్నియు చెప్పితిని. ఇంకను నీవు ఏమి వినదలచుకొంటివో చెప్పుము. (13)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే ద్వాదశస్కంధే బ్రహ్మోపదేశోనామ పంచమోஉధ్యాయః**

**శ్రీమద్భాగవత మహాపురాణము యొక్క ద్వాదశస్కంధమునందలి పంచమాధ్యాయము సమాప్తము.**



## షష్ఠోऽధ్యాయః

**సూత ఉవాచ**

శ్లో ॥ ఏతన్నిశమ్య మునినాభిహితం పరీక్షిత్
వ్యాసాత్మజేన నిఖిలాత్మదృశా సమేన
తత్పాదమూలముపసృత్య నతేన మూర్ధ్నా ।
బద్ధాంజలిస్తమిదమాహ స విష్ణురాతః - 1

టీ :- శ్లో. షష్ఠే పరీక్షితో మోక్షస్సర్పహోమాది తత్సుతాత్, వేదశాఖా విభాగోక్తా త్రివేదవ్యాస వర్ణనమ్. ఏతదితి. ఏతత్పురాణం నిశమ్య. నిఖిలాత్మా హరిస్తం స్వాత్మని పశ్యతీతి తథా. తేన. అతస్సమేవ. న తేన అవనతేన మూర్ధ్నా. తత్పాదమూలముపసృత్య తస్య పాదౌ శిరసి నిధాయేత్యర్థః. (1)

**రాజోవాచ**

శ్లో ॥ సిద్ధోऽస్మ్య నుగృహీతోऽస్మి భవతా కరుణాత్మనా
శ్రావితో యచ్చ మే సాక్షాదనాదినిధనో హరిః - 2

టీ :- సిద్ధ ఇతి సిద్ధః కృతార్థోऽస్మి. యతః అనుగృహీతోऽస్మి. అనుగ్రహమేవాహ - యద్యస్మాచ్ఛ్రావితః. చ శబ్దాత్ప్రాప్తిసాధనం చ. (2)

## షష్ఠాధ్యాయము

**సూతపౌరాణికుడు పలుకుచున్నాడు.**

వ్యాసుని ఆత్మజుడును, నిఖిలమును ఆత్మగా(హరిమయముగా) చూచెడివాడును, సమభావముగలవాడును అయిన శుకమహర్షి చెప్పిన మాటలను తలవంచి నమస్కరించి విన్నవాడైన పరీక్షిన్మహారాజు, ఆ మహర్షి పాదములకడజేరి, అంజలి ఘటించిన వాడై ఇట్లు పలుకుచున్నాడు. (1)

**రాజు పలుకుచున్నాడు**

ఓ శుకమహర్షీ! కరుణాత్ములైన మీచే నేను కృతార్థుడనైనాను. హరిచరితమును మీ ద్వారా విని అనుగ్రహింపబడినాను. సాక్షాత్తు ఆ శ్రీహరియే నాకు వినిపించినట్లు సంతోషించుచున్నాను. (2)



శ్లో ॥ నాత్యద్భుతమహం మన్యే మహతామచ్యుతాత్మనామ్
అజ్ఞేషు తాపతప్తేషు భూతేషు యదనుగ్రహః - 3

టీ :- కరుణాత్మతామభినందతి - ద్వాభ్యాం. నేతి. (3)

ఎన్నో తాపములచే తపించిపోవుచున్న అజ్ఞానులగు ప్రాణుల విషయములో అచ్యుతాత్ములైన మీవంటి మహాత్ములకు అనుగ్రహము కలుగుట సహజమే ఇందులో ఏ అత్యద్భుతము లేదు. (3)

శ్లో ॥ పురాణ సంహితామేతామశ్రౌష్మ భవతో వయమ్
యస్యాం ఖలూత్తమశ్లోకో భగవాననువర్ణ్యతే - 4

టీ :- పురాణసంహితామితి. అశ్రౌష్మ శ్రుతవంతః. వయం భవతస్సకాశాత్. (4)

ప్రాచీనమైన ఈ హరిచరితమును మీ నుండి మేము వింటిమి. ఈ కథలో ఉత్తమ శ్లోకుడైన భగవంతుడే వర్ణింపబడియున్నాడు. (4)

శ్లో ॥ భగవన్ ! తక్షకాదిభ్యో మృత్యుభ్యో న బిభేమ్యహమ్
ప్రవిష్టో బ్రహ్మనిర్వాణమభయం దర్శితం త్వయా - 5

టీ :- సిద్ధోఽస్మీత్యుక్తం తదేవావిష్కరోతి - భగవన్నితి. యతః త్వయా దర్శితం బ్రహ్మ ప్రవిష్టః. కథంభూతం. అభయం. యతో నిర్వాణం కైవల్యరూపం. (5)

ఓ పూజ్యుడా ! తక్షకుడు మొదలైన మృత్యువులవలన నేను భయపడను. నీవు చూపిన బ్రహ్మమునందు ప్రవేశించిన నేను అభయముతో కూడినదైన కైవల్యరూపమైన నిర్వాణమును చేరుకొంటిని. (5)

శ్లో ॥ అనుజానీహి మాం బ్రహ్మన్ ! వాచం యచ్ఛామ్యధోక్షజే
ముక్తకామాశయం చేతః ప్రవేశ్య విసృజామ్యసూన్ - 6

టీ :- కింభూయః. శ్రోతుమిచ్ఛసీతి యదుక్తం తత్ర సిద్ధోహం. న కించిచ్ఛ్రోతుమిచ్ఛామి. కేవలమనుజ్ఞాం దేహీత్యాహ - అనుజానీహీతి. వాచమిత్యుపలక్షణం సర్వేంద్రియాణాం. వాచం నియమ్య కిం కరిష్యసి? తదాహ - ముక్తాః కామాశయా స్తద్వాసనాయేన తత్ చేతః అధోక్షజే ప్రవేశ్య. తనూన్ విసృజామి. (6)

ఓ బ్రహ్మ స్వరూపుడా ! ఆ హరియందే సర్వేంద్రియములను నిలిపి, అన్ని కోరికలను వదలివేసి, మనస్సును హరి యందే నిలిపి ప్రాణములను విడుచుటకు నన్ను అనుమతింపుము. (6)

శ్లో ॥ అజ్ఞానం చ నిరస్తం మే జ్ఞానవిజ్ఞాన నిష్ఠయా
భవతా దర్శితం క్షేమం పరం భగవతః పదమ్ - 7

**సూత ఉవాచ**

శ్లో ॥ ఇత్యుక్తస్తమనుజ్ఞాప్య భగవాన్ బాదరాయణిః
జగామ భిక్షుభిః సాకం నరదేవేన పూజితః - 8

టీ :- నను కిం ప్రాణత్యాగేన కించిత్కాలం జ్ఞాననిష్ఠో భవేతి చేత్తత్రాహ - అజ్ఞానమితి. అజ్ఞానం చకారాత్తత్సంస్కారాశ్చ. తచ్చ. త్వత్కృపయైవేత్యాహ - భవతేతి. (7,8)

ఓ మహర్షీ ! మీరు ప్రసాదించిన జ్ఞాన విజ్ఞానములలో శ్రద్ధ వహించుటచే నా అజ్ఞానము తొలగిపోయినది. మీరు నాకు క్షేమమును, భగవంతుని స్థానమును దర్శింపజేసితిరి అని పరీక్షిత్తు పలుకగా, అతనిని అనుగ్రహించి, అతని కోరికను మన్నించిన శ్రీ శుకమహర్షి, ఆ రాజుచే పూజింపబడినవాడై, భిక్షువులతో కలిసి అక్కడినుండి వెడలిపోయెను. (7,8)



శ్లో ॥ పరీక్షిదపి రాజర్షిరాత్మన్యాత్మాన మాత్మనా
సమాధాయ పరం దధ్యావస్పం దాసుర్యథా తరుః - 9

టీ :- పరీక్షిదితి. ఆత్మనా బుద్ధ్యా. ఆత్మానం మనః ఆత్మని ప్రత్యక్ప్రకాశే. సమాధాయ. పరమాత్మానం దధ్యౌ. అస్పందాసుః లీనప్రాణః. యథాతు తరుః స్థాణుః. (9)

పరీక్షిత్తు తన బుద్ధిచేత మనస్సును ఆత్మయందు లయము చేసి, పరమాత్ముని ధ్యానించుచు, స్థాణువై తన ప్రాణములను ఆత్మయందుంచెను. (9)

శ్లో ॥ ప్రాక్కూలే బర్హి ష్యాసీనో గంగాకూల ఉదఙ్ముఖః
బ్రహ్మభూతో మహాయోగీ నిస్సంగశ్ఛిన్నసంశయః - 10

టీ :- తమేవ విశినష్టి - ప్రాగితి. ప్రాక్కూలే ప్రాగగ్రే. బర్హిషి దర్భే. (10)

తూర్పుదిక్కునకు అగ్రభాగములుంచబడిన దర్భలపై కూర్చొన్నవాడైన పరీక్షిత్తు గంగానదీతీరమున, ఉత్తరాభిముఖుడై, సంశయరహితుడై, నిస్సంగుడైన మహాయోగియై బ్రహ్మభావమునొందెను.(10)

శ్లో ॥ తక్షకః ప్రహితో విప్రాః ! క్రుద్ధేన ద్విజసూనునా
హంతుకామో నృపం గచ్ఛన్ దదర్శ పథి కశ్యపమ్ - 11

టీ :- తదేవం బ్రహ్మభూతే తస్మిన్ తక్షకాగమనాదికం పిష్టపేషణమివ భవతీతి దర్శయతి - త్రిభిః. తక్షక ఇతి హే విప్రాః (11)

కోపించిన శమీకపుత్రుని (శృంగి) చే పంపబడిన తక్షకుడు పరీక్షిత్తును చంపుటకు వెళ్ళుచు, దారిలో కశ్యపుడను మునిని దర్శించెను. (11)





శ్లో ॥ తం తర్పయిత్వా ద్రవిణైర్నివర్త్య విషహారిణమ్
ద్విజరూపప్రతిచ్ఛన్నః కామరూపోఽదశన్నృపమ్ - 12

టీ :- తమితి. తం విషచికిత్సయా పరీక్షిద్రక్షణేన ద్రవ్యార్జనాయ గచ్ఛంతం తత్ర మార్గే స్వాలీధవృక్షస్య భస్మీభూతస్య పునరాంకురాది క్రమేణోత్థాపనాద్విషహారిణం తదపేక్షితద్రవిణైః సంతర్ప్య. తతో నివర్త్య ద్విజరూపేణ తిరోహితస్సన్నదశత్. (12)

విషమునకు విరుగుడైన చికిత్సలను చేసి, పరీక్షిత్తును రక్షించి, ఆ రాజు నుండి విశేషధనమును పొందవలెనను ఆశతో బయలుదేరిన వాడై, తక్షక విషాగ్నికి దగ్ధమైన మఱ్రిచెట్టును మరల బ్రతికించి, అంకురాదులతో పచ్చగా నిలిపి తన మహిమను ప్రదర్శించిన కశ్యపునకు తక్షకుడు అపారధనమునిచ్చి, వెనుకకు మరలించి, తాను ద్విజునిగా కామరూపమును ధరించి పరీక్షిత్తును సమీపించి, ఆతనిని కాటువేసెను. (12)

శ్లో ॥ బ్రహ్మభూతస్య రాజర్షేర్దేహోఽహిగరలాగ్నినా
బభూవ భస్మసాత్సద్యః పశ్యతాం సర్వదేహినామ్ - 13

టీ :- తచ్చ పుత్రకృత్యమివ జాతమిత్యాహ - బ్రహ్మభూతస్యేతి. (13)

బ్రహ్మభూతుడైన ఆ పరీక్షిత్తు దేహము జనులందరు చూచుచుండగనే తక్షకుని విషాగ్నికి దగ్ధమై, భస్మమయ్యెను.(13)

శ్లో ॥ హాహాకారో మహానాసీద్భువి ఖే దిక్షు సర్వతః
విస్మితా హ్యభవన్ సర్వే దేవాసురనరాదయః - 14

పరీక్షిత్తు భస్మీభూతుడు కాగానే, భూమిపైన, ఆకాశమున, దిక్కులలో, అంతట హాహాకారములు చెలరేగెను. దేవతలు, అసురులు, నరులు మొదలైన వారందరు ఆశ్చర్యమున మునిగిపోయిరి. (14)

శ్లో ॥ దేవదుందుభయో నేదుర్గంధర్వాప్సరసో జగుః
వవృషుః పుష్పవర్షాణి విబుధాః సాధువాదినః - 15

ఆ సమయమున దేవదుందుభులు మ్రోగెను. గంధర్వులు, అప్సరసలు నృత్యగీతములలో ఓలలాడిరి. దేవతలు 'బాగు, బాగు'



టీ :- తత్ర క్షణం సర్వేషాం దుఃఖం చ తతః పరముత్సవం చాహ - ద్వాభ్యాం. హాహాకార ఇతి. (14,15)

శ్లో ॥ జన్మేజయః స్వపితరం శ్రుత్వా తక్షకభక్షితమ్
యథాఽజుహావ సంక్రుద్ధోనాగాన్ సత్రే సహద్విజైః - 16

శ్లో ॥ సర్వసత్రే సమిద్ధాగ్నౌ దహ్యమానాన్మహోరగాన్
దృష్ట్వేంద్రం భయసంవిగ్నస్తక్షకః శరణం యయౌ - 17

శ్లో ॥ అపశ్యంస్తక్షకం తత్ర రాజా పారీక్షితో ద్విజాన్
ఉవాచ తక్షకః కస్మాన్న దహ్యేతోరగాధమః - 18

టీ :- ప్రాసంగికమాహ - జనమేజయ ఇతి. సత్రే సర్పాభిచారసత్రే ద్విజైస్సహ వర్తమానః యథా యథావత్. ఆజుహావ జుహావేతి వా. సర్వ సర్ప హననే కారణమాహ - సంక్రుద్ధ ఇతి. (16,17.18)

శ్లో ॥ తం గోపాయతి రాజేంద్ర శక్రః శరణమాగతమ్
తేన సంస్తంభితః సర్పః తస్మాన్నాగ్నౌ పతత్యసౌ - 19

అనుచుండగా పుష్పవర్షములు కురిసెను. (15)

తన తండ్రియగు పరీక్షిత్తు తక్షకవిషాగ్నికి దగ్ధుడయ్యెనని తెలిసికొనిన జనమేజయుడు అమిత క్రోధముగలవాడై సర్పజాతిని నశింపజేయు సంకల్పముతో సర్పాభిచారికయాగమును తలపెట్టి, ద్విజుల సహాయముతో ఆ యాగమున సర్పములను ఆహ్వానించెను. ఈ సర్పయాగమున పడి చనిపోవుచున్న అసంఖ్యాకములగు సర్పములను చూచి, భయకంపితుడైన తక్షకుడు ఇంద్రుని శరణు వేడెను. తక్షకుడు సర్పయాగమున దహింపబడక పోవుటను తెలిసికొనిన జనమేజయుడు - తక్షకుడేల ఈ యాగమున దహింప బడుటలేదు? అని ఋత్విజులైన బ్రాహ్మణులను అడిగెను. (16,17,18)

ఓ పరీక్షిద్రాజేంద్రా! తనను శరణువేడి వచ్చిన తక్షకుని ఇంద్రుడు కాపాడుచున్నాడు. ఆ కారణముచేతనే ఆ సర్పము అగ్నిలో పడుటలేదు. (19)



టీ :- కస్మాత్తక్షకో న దేహ్యేతేత్యుక్తాస్సంతో ద్విజా ఊచుః - తమితి. తేనేంద్రేణ అసౌ సర్పః. (19)

శ్లో ॥ పారీక్షిత ఇతి శ్రుత్వా ప్రాహర్త్విజ ఉదారధీః
సహేంద్రస్తక్షకో విప్రా నాగ్నౌ కిమితి పాత్యతే? 20

పరీక్షిత్తు కుమారుడైన జనమేజయుడు ఈ మాటలు విని, ఋత్విజులతో - ఓ ఋత్విజులారా! ఇంద్ర సహితుడైన తక్షకుని ఏల అగ్నిలో పడవేయరాదు? అని పలికెను.(20)

టీ :- ఇతీతి. ఋత్విజః ప్రతి ప్రాహ సహేంద్రః ఇంద్రసహితః. కిమితి న పాత్యతే. (20)

శ్లో ॥ తచ్ఛ్రుత్వాఽఽజుహువుర్విప్రాః సహేంద్రం తక్షకం మఖే
తక్షకాశు పతస్వేహ సహేంద్రేణ మరుత్త్వతా -21

జనమేజయుని మాటలను విని ఋత్విజులు - ఓ తక్షకుడా! నీవు ఇంద్రసహితుడైన వెంటనే ఈ అగ్నిలో పడుము అని ఇంద్రసహితుడైన తక్షకుని పిలిచిరి.(21)

టీ :- తదితి. తద్రాజ్ఞో వచః శ్రుత్వా అజుహువుః. సాపేక్షమాహ్వానం దర్శయతి - తక్షకేతి. ఇహాగ్నానాశు పతస్వ. మరుత్వతా మరుద్గణవతా. ఇంద్రేణ సహ. (21)

శ్లో ॥ ఇతి బ్రహ్మోదితాక్షేపైః స్థానాదింద్రః ప్రచాలితః
బభూవ సంభ్రాన్తమతిః సవిమానః సతక్షకః -22

ఈ విధముగా ఆ బ్రాహ్మణులు కఠినవాక్యములతో పిలువగానే ఇంద్రుడు తన స్థానము నుండి కదిలినవాడై సంభ్రాంతచిత్తుడై, తక్షకునితో కూడినవాడై, విమాన సహితుడై కదలెను. (22)

టీ :- ఇతీతి. బ్రాహ్మణైః రుక్తైరాక్షేపైః పరుషవాక్యైః స తక్షకః. (22)



శ్లో ॥ తం పతన్తం విమానేన సహతక్షకమంబరాత్
విలోక్యాంగిరసః ప్రాహ రాజానం తం బృహస్పతిః -23

శ్లో ॥ నైష త్వయా మనుష్యేంద్ర వధమర్హతి సర్పరాట్
అనేన పీతమమృత మథవా అజరామరః - 24

టీ :- తమితి. స తక్షకం. అంగిరసః పుత్రో బృహస్పతిః ప్రాహ. (23,24)

తక్షకసహితుడై విమానముతో సహా ఆకాశమునుండి నేలపై పడుచున్న ఇంద్రుని చూచి, ఆంగీరసపుత్రుడైన బృహస్పతి జనమేజయునితో - ఓ నరేంద్రా! ఈ తక్షకుడు అమృతమును పానము చేసియుండుటచే ఈతడు జరామరణములు లేనివాడై యున్నాడు. కావున ఈతనిని నీవు సంహరింపదగదు అని పలికెను.(23,24)

శ్లో ॥ జీవితం మరణం జన్తోర్గతిః స్వేనైవ కర్మణా
రాజంస్తతోఽన్యో నాన్యస్య ప్రదాతా సుఖదుఃఖయోః - 25

టీ :- భవతు నామాజరామరః. తథాపి పితృమారకం ధక్ష్యామీతి చేత్తత్రాహ - జీవితమితి. గతిః పరలోకః. అతో దుర్మరణనిమిత్తా పితుర్దుర్గతి రనేన కృతేత్యపి న శంకనీయమిత్యర్థః. (25)

ప్రాణుల జీవన మరణములు, వాని స్వయం కృతముల వలననే సంభవించును. కావున వాని సుఖములనుగాని, దుఃఖములను గాని ఇతరులు ఈయజాలరు. (25)

శ్లో ॥ సర్పచౌరాగ్ని విద్యుద్భ్యః క్షుత్తృడ్వ్యాధ్యాదిభిర్నృప !
పంచత్వమృచ్ఛతే జన్తుర్భుంక్త ఆరబ్ధకర్మ తత్ - 26

పాములు, దొంగలు, అగ్ని, పిడుగులు, ఆకలి దప్పులు, వ్యాధులు, మొదలైన వానిచే జనులు మరణించుటకు కారణము వారు చేసిన దుష్కృతములేగాని మరొకటి కాదు. వారి దుష్కృతములే



టీ :- కథమన్యస్సుఖదుఃఖప్రదాతా నాస్తి. సర్పాదీనాముపలభ్యమానత్వాదితి చేత్తత్రాహ - సర్వేతి. సర్పాదినా జంతుః పంచత్వం మృత్యుం ఋచ్ఛతే ఋచ్ఛతి ప్రాప్నోతీతి యత్. తత్ ఆరబ్ధం కర్మైవ భుజ్క్తే. స్వకృతకర్మప్రయుక్తా ఏవ సర్పాదయః. న స్వతంత్రా ఇతి భావః. (26)

సర్పాదుల రూపమున ప్రాణములను కబళించుచున్నవి. (26)

శ్లో ॥ తస్మాత్సత్రమిదం రాజన్! సంస్థీయేతాభిచారికమ్
సర్పా అనాగసో దగ్ధా జనైర్దిష్టం హి భుజ్యతే - 27

టీ :- తస్మాదితి. సంస్థీయేత సమాప్యతాం అభిచారికం హింసాది ఫలకం. దిష్టం ప్రాచీనం కర్మ. అతః సర్పాదృష్ట ప్రయుక్తస్య తవాప్యయం నాపరాధ ఇతి భావః. (27)

కావున, ఓ రాజా ! నీవు తలపెట్టిన హింసాఫలకమగు ఈ సర్పయాగమును నిలిపివేయుము. జనులు వారి వారి ప్రాక్తనకర్మఫలములనే అనుభవింతురు కావున సర్పయాగమున కొన్ని సర్పముల మరణించుట యందును నీ అపరాధమేమియు లేదు. (27)

**సూత ఉవాచ**

శ్లో ॥ ఇత్యుక్తః స తథే త్యాహ మహర్షేర్మానయన్ వచః
సర్ప సత్రాదుపరతః పూజయామాస వాక్పతిమ్ - 28

టీ :- ఇతీతి. వాక్పతిం బృహస్పతిం. (28)

**సూతులవారు పలుకుచున్నారు**

ఈ విధముగ బృహస్పతిచే ప్రబోధింపడినవాడైన జనమేజయుడు, ఆ మహర్షి వాక్యమును మన్నించి, సర్పయాగమును విరమించి, బృహస్పతిని పూజించెను. (28)

శ్లో ॥ సైషా విష్ణోర్మహామాయాऽబాధ్యయాऽలక్షణా యయా
ముహ్యంత్యస్యైవాత్మభూతా భూతేషు గుణవృత్తిభిః - 29

టీ :- నను కథం విదుషామప్యేవం సంమోహః యతో బ్రహ్మకోపాత్పరీక్షితో మృత్యుః జనముజయకోపాత్సర్పాణా మిత్యాది. తత్రాహ - సైషేతి. తస్యా మహత్త్వం దర్శయతి - అలక్షణా న లక్ష్యత ఇత్యలక్షణా. అప్రతర్క్యేత్యర్థః. కా సా ఇత్యత ఆహ - యయా అస్య విష్ణోరేవ ఆత్మభూతాః ఆత్మాంశభూతాః ప్రాణినః. గుణవృత్తిభిః క్రోధాదిభిః భూతేషు దేహేషు ముహ్యంతి బాధ్యబాధకతాం వ్రజంతీత్యర్థః. నను శ్రవణాదినా బాధితయా తయా కుతో మోహస్స్యాత్తత్రాహ - అబాధ్యయా బాధితుమశక్యయా. (29)

శ్లో ॥ నయత్ర దంభీత్యభయా విరాజితా
మాయాऽత్మ వాదేऽసకృదాత్మవాదిభిః
న యద్వివాదో వివిధస్త దాశ్రయో
మనశ్చ సంకల్ప వికల్ప వృత్తి యత్ -30

టీ :- కథం తర్హిమాయా తత్కార్యనివృత్తిరిత్యాశంక్య శ్రీవిష్ణుస్వరూప నిరూపణపూర్వకం తద్భజనాత్సర్వానర్థ నివృత్తిరితి శాస్త్రార్థ

బ్రాహ్మణకోపమువలన పరీక్షిత్తునకు, జనమేజయుని కోపము వలన సర్పముల నాశము కలుగుటను చూచి విద్వాంసులకు సైతము ఈ మోహమేల? అని అన్నచో అది అంతయు తర్కింపరాని విష్ణు మాయాప్రభావము. విష్ణువు యొక్క ఆత్మాంశలు గలవారైన ప్రాణులు క్రోధాదులచే ఇతర ప్రాణులపై మోహమును కలిగియున్నవారై ఒండొరులు బాధించుకొందరు, విష్ణుమాయ ఎవ్వరికినీ దాటలేనిది. (29)

వీడు కపటముగలవాడు అనెడి మాటలలో తెలుపబడిన మాయ, ఆత్మను గూర్చిన పలుకులలలో ఆత్మవాదుల చేత కూడ అభయము స్పష్టము చేయబడలేదు. అది భీతిల్లుచునే మోహాదులను తలపెట్టదని పలుకుచున్నారు. మాయ ఆశ్రయించి ఉన్న విషయములో ఎట్టి వివాదము లేదు. ఎందుకనగా అది వివాదములకు కూడ అతీతమైనది. సంకల్పవికల్పాత్మకమైన మనస్సు కూడా మాయావిషయములో ప్రవర్తించదు. అది సంకల్ప వికల్పములకు సైతము అతీతమైనది. (30)




ముపసంహరతి - పంచభిః. నేతి. దంభీతి యా మాయాకపట వాయనం పుమానిత్యేవం భూతా బుద్ధావసకృదుల్లిఖ్యమానా యా మాయేత్యర్థః. సా ఆత్మవాదే క్రియమాణే ఆత్మవాదిభిః యత్ర అభయా న విరాజితా న ప్రకాశితా కింతు భీతేవ స్వకార్యం మోహాదికమకుర్వంతీ కథంచిద్వర్తత ఇతి ప్రతిపాదితేత్యర్థః. తదుక్తం. శ్లో. " తస్మై నమో భగవతే వాసుదేవాయ ధీమహి, యన్మాయయా దుర్జయయా మాం బ్రువంతి జగద్గురుం. విలజ్జమానయా యస్య స్థాతుమిక్షాపథే ముయా, విమోహితా వికత్థంతే మమాహమితి దుర్ధియ " ఇతి. కించ యత్ యస్మిన్ తదాశ్రయో మాయాశ్రయః. వివిధో వివాదో నాస్తి. విశేషవిషయత్వాద్వివాదానాం తస్య విశేషాతీతత్వాదితి భావః. సంకల్పవికల్పాః. వృత్తయో యస్య తన్మనోపి యత్ యత్ర నాస్తి. సంకల్పవికల్పానామపి విశేషవిషయత్వాత్. (30)

శ్లో ॥ నయత్ర సృజ్యం సృజతోభయోః పరం
శ్రేయశ్చ జీవస్త్రిభిరన్వితస్త్వహమ్
తదేతుదుత్సాదిత బాధ్యబాధకం
నిషిధ్య చోర్మీన్విరమేత్స్వయం మునిః - 31

టీ :- కించ. నేతి. సృజ్యం కర్మ సృజతా కారకవర్గేణసహ. ఉభయోః

కర్మను సృజించువాడు, సృజింపబడిన కర్మ అనెడి రెండింటికి అతీతముగ శ్రేయోదాయకమగు ఫలముండును. సృజ్యము (సృజింపబడు కర్మ), స్రష్ట (కర్మను సృజించువాడు), ఫలము (శ్రేయస్సు), అనెడి మూడింటితో కూడిన జీవుడు నిరహంకారాత్మకుడై ఉన్నప్పుడే ఆత్మస్వరూపమునెరిగి, అహంకారాదులను విసర్జించి విశేషానందమును పొందును. (31)

సృజ్యస్రష్టోః పరంసాధ్యం శ్రేయఃఫలమపి అతః త్రిభిః సృజ్యస్రష్ట్ర ఫలైః. అన్వితో జీవశ్చ అహంకారాత్మాకో యత్ర నాస్తి. అత ఏవ ఉత్పాదితౌ నిరస్తౌ బాధ్యబాధకౌ యస్మిన్ తదేతత్స్వీయం ఆత్మస్వరూపమిత్యర్థః. తత్తస్మాత్ ఊర్మీనహంకారాదీన్నిషధ్య. విరమేద్విశేషేణ క్రీడేదిత్యర్థః. (31)

శ్లో ॥ పరం పదం వైష్ణవమామనన్తి
తద్యన్నేతి నే తీత్యతదుత్సిసృక్షవః
విసృజ్య దౌరాత్మ్యమనన్యసౌహృదా
హృదోపగుహ్యావసితం సమాహితైః - 32

టీ :- యతస్తద్వైష్ణవంపద మామనంతీత్యాహ - పరమితి. యదేతత్తదేవ పరం వైష్ణవం పదం స్వరూప మామనంతి కే అతత్. ఆత్మవ్యతిరిక్తం ఉత్సిసృక్షవః త్యక్తుమిచ్ఛవః యతః అనన్యసౌహృదాః నాస్త్యన్యస్మిన్ సౌహృదం యేషాం తే కుతః దౌరాత్మ్యం దేహాద్యహంభావం విసృజ్య దేహే అహంకారాభావాత్ అన్యత్ర సౌహృదం నాస్తి అతస్త్యక్తుమిచ్ఛవ ఇత్యర్థః. కథంనేతి నేతీత్యేవం. అత్రవిద్వదనుభవమపి ప్రమాణయతి. హృదా ఉపగుహ్యధ్యానాదినా. తతస్సమాహితైరవసితం నిశ్చితం యద్వా. అవస్థితం అవబద్ధం ఆత్మతయా గృహీతమిత్యర్థః. (32)

ఆత్మకంటె వేరైన దేదియును లేదని తెలిసికొని, ఆత్మకన్న ఇతరమైన దానికి 'లేదు లేదు' అని వదలివేసెడివారు విష్ణుపదమును చక్కగా తెలిసికొనగలరు. అట్టివారు దేహాదులకు సంబంధించిన అహంభావమును వదలి, ధ్యానాదులచే అనుభవపూర్వకముగ ఆత్మ స్వరూపమును తెలిసికొనుచున్నారు.(32)



శ్లో ॥ త ఏతదధిగచ్ఛన్తి విష్ణోర్యత్పరమం పదమ్
అహం మమేతి దౌర్జన్యం న యేషాం దేహగేహజమ్ - 33

టీ :- ఏతత్ప్రాప్తావధికారిణో దర్శయతి - తఇతి. దేహజం అహమితి గేహజం మమేతి. (33)

దేహజాతమైన దంతయు నేనని, ఇంటిలో నున్న దంతయు నాదనెడి దుష్టభావము లేనివారు విష్ణువు యొక్క శ్రేష్ఠమగు స్థానమును పొందగలరు. (33)

శ్లో ॥ అతివాదాంస్తితిక్షేత నావమన్యేత కంచన
న చేమం దేహమాశ్రిత్య వైరం కుర్వీత కేనచిత్ - 34

టీ :- ఏవం ప్రాప్త్యుపాయమాహ - అతివాదానితి. (34)

క్రోధాదులచే అతిగా మాట్లాడువారిని ఓర్పుగా సహింపవలెను. ఎవరినీ అవమానింపరాదు. దేహమును ప్రధానముగ చేసికొని ఎవరితోను వైరము పెట్టుకొనరాదు. (34)

శ్లో ॥ నమో భగవతే తస్మై కృష్ణాయాకుంఠమేధసే
యత్పాదాంబురుహధ్యానాత్సంహితామధ్యగామిమామ్ - 35

టీ :- శాస్త్రసమాప్తౌ గురుం ప్రణమతి - నమ ఇతి. కృష్ణాయ వ్యాసాయ అధ్యగామధీతవానస్మి. (35)

మొక్కవోని మేధగలవాడును, పూజ్యుడును అయిన కృష్ణద్వైపాయన వ్యాసుని పాదకమలముల ధ్యానము తోడనే ఈ (భాగవత) సంహితను నేను తెలుసుకొంటిని కనుక ఆ గురువర్యునికి నమస్కరించుచున్నాను. (35)



**శౌనక ఉవాచ**

శ్లో ॥ పైలాదిభిర్వ్యాస శిష్యైర్వేదాచార్యైర్మహాత్మభిః
వేదాశ్చ కతిధా వ్యస్తా ఏతత్సౌమ్యాభిధేహి న ః - 36

టీ :- ఇమాం సంహితా మధ్యగామిత్యుక్తం తత్రపురాణసంహితా విభాగం విశేషతో బుభుత్సుర్వేద విభాగమపి ప్రసంగాత్ పృథక్ పృచ్ఛతి - పైతాదిభిరితి. హే సౌమ్య. (36)

**శౌనకుడు పలుకుచున్నాడు**

ఓ సౌమ్యుడా ! పైలుడు మొదలైన వ్యాస శిష్యులు, వేదాచార్యులునైన మహాత్ములచే వేదములు, పురాణములు ఎన్ని విభాగములుగ విడిపోయియున్నవో తెలుపుము. (36)

**సూత ఉవాచ**

శ్లో ॥ సమాహితాత్మనో బ్రహ్మన్ ! బ్రహ్మణః పరమేష్ఠినః
హృద్యాకాశాదభూన్నాదో వృత్తిరోధాద్విభావ్యతే - 37

టీ :- తత్రప్రథమం వేదావిర్భావప్రకారమాహాష్టభిః. సమాహితాత్మన ఇతి. బ్రహ్మణో హృది య ఆకాశస్తస్మాన్నాదోఽభూత్ యః కర్ణపుట పిధానేన శ్రోత్రప్రవృత్తినిరోధా దస్మాదాదిష్వపి విభావ్యతే తర్క్యతే. (37)

సమాహితాత్ముడైన బ్రహ్మదేవుని హృదయాకాశమునుండి నాదము వెలువడినది. కర్ణపుటములను నిరోధించి వినుట ద్వారా మన వంటి వారికి కూడా అది తెలియబడుచున్నది. (37)

శ్లో ॥ యదుపాసనయా బ్రహ్మన్ ! యోగినో మలమాత్మనః
ద్రవ్యక్రియాకారకాఖ్యం ధూత్వా యాన్త్యపుర్భవమ్ - 38

ఆ నాదమును ఉపాసించుటచే యోగులు తమ ద్రవ్యరూపమైన ఆధిభౌతిక కల్మషమును, క్రియారూపమైన ఆధ్యాత్మిక కల్మషమును, కారకరూపమైన ఆధిదైవిక కల్మషమును తొలగించుకొందురు. (38)





టీ :- ప్రసంగాన్నాదోపాసనయా మోక్షఫలమాహ - యదితి. యస్య నాదస్యోపాసనయా. ఆత్మనో మలం అపోహ్య. కథంభూతం మలం? తదాహ - ద్రవ్యమధిభూతం - క్రియా అధ్యాత్మం. కారకమధిదైవం ఏవం త్రిధాభూతా ఆఖ్యా యస్యేతి తథా. (38)

శ్లో ॥ తతోఽభూత్త్రివృదోంకారో యోఽవ్యక్త ప్రభవః స్వరాట్
యత్తల్లింగం భగవతో బ్రహ్మణః పరమాత్మనః - 39

టీ :- తత ఇతి. తతః నాదాత్ త్రివృత్ త్రిమాత్రః. కంఠోష్ఠాదిభిః ఉచ్చార్యమాణస్య ఓంకారస్య అక్షరసమామ్నాయాంతర్భావాత్ సూక్ష్మతయా తం విశినష్టి - అవ్యక్తః ప్రభవో యస్య సః. తదేవాహ - సర్వాట్ స్వత ఏవ హృది ప్రకాశమానః తమేవకార్యేణ లక్షయతి - యత్తదితి. నపుంసకత్వ లింగశబ్దవిశేషణత్వాత్. లిఙ్గం గమకం. (39)

శ్లో ॥ శృణోతి య ఇమం స్ఫోటం సుప్త శ్రోత్రే చ శూన్యదృక్
యేన వాగ్వ్యజ్యతే యస్య వ్యక్తిరాకాశ ఆత్మనః - 40

టీ :- కోఽసౌ పరమాత్మా? తమాహ - శృణోతీతి. ఇమం స్ఫోటమవ్యక్తమోంకారం. నను జీవ ఏవ తం శృణోతి. నేత్యాహ -

బ్రహ్మ హృదయాకాశము నుండి ప్రభవించిన నాదము నుండి మూడుమాత్రలతో (మాత్రయనగా ఒక చిటికె వేసినంతకాలము) కూడినదియు, అవ్యక్తమునుండి జనించినదియు, స్వయం ప్రకాశమానమైనదియునగు ఓంకారము వ్యక్తమైనది. అది పరమాత్ముడైన భగవంతుని తెలియజేయునది. (39)

ఈ స్ఫోటమును (అవ్యక్తమగు ఓంకారమును) ఇంద్రియ వర్గము లేకున్నను, శ్రవణేంద్రియము సుషుప్త్యావస్థలోనున్నను పరమాత్మ ఒక్కడే వినగలడు. జీవుడు కారణాధీనుడు కనుక, పరమాత్ముడిచ్చిన శక్తి వలననే వినగలుగును. భగవంతుని హృదయాకాశము నుండి అభివ్యక్తమగునదియే ఈ ఓంకారము.(40)



సుప్తశ్రోత్రేకర్ణపిధానాదినా అవృత్తికేऽపి శ్రోత్రేసతి జీవస్తుకరణాధీన జ్ఞానత్వాన్న తదా శ్రోతా. తదుపలభిస్తు తస్య పరమాత్మద్వారికైవేతి భావః. ఈశ్వరస్తు నైవం. యతశ్శూన్యదృక్ శూన్యేంద్రియవర్గే దృగ్ జ్ఞానం యస్య. తథాహి. సుప్తో యథా శబ్దం శ్రుత్వా ప్రబుధ్యతే. న తదా జీవ శ్రోతా. లీనేంద్రియత్వాత్. అతో యస్తదా శబ్దం శ్రుత్వా జీవం ప్రబోధయతి. స యథా పరమాత్మైవ తద్వత్. కోऽసావోంకారః ? తం విశినష్టి – సార్ధేన. యేన వాక్ బృహతీ వ్యజ్యతే యస్య చ హృదయాకాశే ఆత్మన స్వకాశాద్వ్యక్తిరభివ్యక్తిః (40)

శ్లో ॥ స్వధామ్నో బ్రహ్మణః సాక్షాద్వాచకః పరమాత్మనః
స సర్వమంత్రోపనిషద్వేదబీజం సనాతనమ్ – 41

టీ :– కించ. స్వధామ్న ఇతి. స్వధామ్నః స్వస్య ధామ ఆశ్రయః కారణం యత్ బ్రహ్మ తస్య. కిం చ పరమాత్మాంశసంభూత సమస్త దేవతావాచకోऽపీత్యాశయేనాహ – స్వ ఇతి. సర్వమంత్రాణా ముపదిష్రదహస్యం సూక్ష్మరూపమిత్యర్థః. తత్ర హేతుః. వేదానాం బీజం కారణం బీజత్వేऽప్యవికారితామాహ – సనాతనం సదైకరూపం. తస్య బ్రహ్మరూపత్వాత్. (41)

ఓంకారము పరమాత్ముని ఆశ్రయమును ప్రత్యక్షముగ తెలిపెడి నాద విశేషము. అది సకల మంత్రములకు, ఉపనిషత్తులకు, వేదములకు కారణము. అది ఎల్లప్పుడు ఒకే రూపమున నుండుటచే సనాతనము. అది బ్రహ్మ రూపము.(41)



శ్లో ॥ తస్యహ్యాంసంస్త్రయో వర్ణా ఆకారాద్యా భృగూద్వహ !
ధార్యన్తే యై స్త్రయో భావా గుణానామార్థవృత్తయః - 42

టీ:- ఇదానీం తతస్సర్వ ప్రపంచోత్పత్తిప్రకారమాహ - తస్యేతి. త్రయః త్రిసంఖ్యాయుక్తాః భావాః. యైరకారోకారమకారైః. ధార్యంతే. తత్కారణత్వాత్. తానేవాహ - గుణాః సత్త్వాదయః సామాని ఋగ్యజుస్సామాని. అర్థాః భూర్భువస్స్వర్లోకాః. వృత్తయో జాగ్రదాదయః . (42)

ఆ ఓంకారమునకు అకారాదులైన వర్ణములు మూడుగలవు. అనగా అకార, ఉకార, మకారములని తాత్పర్యము. అవి సత్త్వరజస్తమో రూపములైన మూడు గుణములకు, ఋగ్యజుస్సామములనెడి మూడు వేదములకు, భూర్భువస్సువములనెడి ముల్లోకములకు, జాగ్రత్స్వప్నసుషుప్తులనెడి మూడు అవస్థలకు కారణములు. (42)

శ్లో ॥ తతోఽక్షరసమామ్నాయమసృజద్భగవానజః
అన్తస్థోష్మస్వరస్పర్శ హ్రస్వదీర్ఘాదిలక్షణమ్ - 43

టీ :- తత ఇతి. తతస్తేభ్యో వర్ణేభ్యః. అక్షరాణాం సమామ్నాయం సమాహారం. తమేవాహ - అంతస్థాః యరలవాః. ఊష్మాణః శషసహాః స్వరాః అకారాద్యాః. స్పర్శాః కాదయోమావసానాః - హ్రస్వదీర్ఘాదిశ్చ. ఆదిశబ్దాజ్జిహ్వామూలీయాదయః. తఏవ లక్షణం స్వరూపం యస్య తం. (43)

భగవంతుడైన బ్రహ్మ ఓంకారము నుండి అక్షరసమామ్నాయ మును (వర్ణమాలను) సృష్టించెను. ఆ వర్ణమాలలో అన్తస్థములు (యరలవ), ఊష్మములు (శషసహ), స్వరములు (ఆకారాదులు), స్పర్శములు (కాదులు) హ్రస్వ, దీర్ఘ, ప్లుతములు, జిహ్వామూలీయ ములు, ఉపధ్మానీయములు, మొదలైనవి గలవు. (43)

శ్లో ॥ తేనాసౌ చతురో వేదాంశ్చ తుర్భిర్వదనైర్విభుః -
సవ్యాహృతికాన్ సోంకారాంశ్చాతుర్హోత్రవివక్షయా - 44

చతుర్ముఖుని స్వరూపమును దాల్చిన భగవంతుడు నాలుగు ముఖములతో నాలుగు వేదములను, ఆ నాలుగు వేదములు నాలుగు హోత్రములను చెప్పదలచి.(44)



టీ :- తత ఇతి. విభుః చతుర్ముఖస్వరూపో భగవాన్. అసృజదితి పూర్వస్యైవానుషంగః. చాతుర్హోత్ర వివక్షయా చత్వారో హోత్రోపలక్షితా ఋత్విజశ్చతుర్హోతారః. తైరనుష్ఠేయం హౌత్రాధ్వర్యవాదికం కర్మ చాతుర్హోత్రం. తద్వివక్షయా. (44)

శ్లో ॥ పుత్రానధ్యాపయత్తాంస్తు బ్రహ్మర్షీన్ బ్రహ్మకోవిదాన్
తే తు ధర్మోపదేష్టారః స్వపుత్రేభ్యః సమాదిశన్ - 45

టీ :- పుత్రానితి. పుత్రాన్ మరీచ్యాదీన్ తాన్ వేదాన్. బ్రహ్మకోవిదాన్ వేదోచ్చారణాదినిపుణాన్. (45)

భగవంతుడు తన పుత్రులైన మరీచి మొదలగు బ్రహ్మకోవిదులైన బ్రహ్మర్షులకుపదేశించెను. వేదోచ్చారణలో నిపుణులైనవారును, ధర్మమును ఉపదేశించెడివారును అయిన ఆ మరీచ్యాదులు తమ పుత్రులకు వేదములను చెప్పిరి. (45)

శ్లో ॥ తే పరంపరయా ప్రాప్తాస్తత్తచ్ఛిష్యైర్ధృతవ్రతైః
చతుర్యుగేష్వథ వ్యస్తా ద్వాపరాదౌ మహర్షిభిః - 46

టీ :- తత ఇతి. ఏవం చతుర్యుగేషు ప్రాప్తాః ద్వాపరాదౌ ద్వాపరమాదిర్యస్య తదంత్యాం లక్షణస్య కాలస్య తస్మిన్. ద్వాపరాంతే వేదవిభాగ ప్రసిద్ధేః. శంతనుసమకాలవ్యాసావతార ప్రసిద్ధేశ్చ. వ్యస్తా విభక్తాః. (46)

ఆ మరీచ్యాదుల పుత్రులు తమ శిష్యులకుపదేశింపగా, ఇట్లు శిష్యపరంపరాక్రమముగ వేదములు ఉపదిష్టములై, ద్వాపర యుగాంతమున వేదవ్యాసునిచే విభక్తములై లోకయిన వ్యాపించినవి. (46)



శ్లో ॥ క్షీణాయుషః క్షీణసత్త్వాన్ దుర్మేధాన్ వీక్ష్య కాలతః
వేదాన్ బ్రహ్మర్షయో వ్యస్యన్ హృదిస్థాచ్యుతచోదితాః - 47

టీ :- తత్ర వేదవిభాగే హేతుః. క్షీణాయుష ఇతి. క్షీణాయుషో జనాన్. తర్హి పురుషబుద్ధి ప్రభావత్వాత్. అనాదరణీయం స్యాదిత్యాశంక్యాహ - హృదిస్థేతి. (47)

అల్పాయుష్యము గల వారును, అల్ప బలముగలవారును, మందబుద్ధిగలవారును అగు జనులు కాలక్రమముననుండగలరని తెలిసికొనిన బ్రహ్మర్షులు హృదయమునందున్న విష్ణువుచే ప్రబోధింపబడినవారై వేదములను విభజించి, ప్రసాదించిరి. (47)

శ్లో ॥ అస్మిన్నప్యన్తరే బ్రహ్మన్ ! భగవాన్ లోకభావనః
బ్రహ్మేశాద్యైర్లోకపాలైర్యాచితో ధర్మగుప్తయే - 48

టీ :- ఏవం సామాన్యతో వేదవిభాగక్రమముక్త్వా వైవస్వతమన్వంతరే విశేషతో నిరూపయితుమాహ - అస్మిన్నితి. (48)

లోకభావనుడైన భగవంతుడు వైవస్వత మన్వంతరములో ధర్మము నిలుపుటకై బ్రహ్మ, శివుడు మొదలగు లోకపాలకులచే అవతరించుటకై కోరబడెను. (48)

శ్లో ॥ పరాశరాత్సత్యవత్యామంశాంశ కళయా విభుః
అవతీర్ణో మహాభాగ! వేదం చక్రే చతుర్విధమ్ - 49

టీ :- పరాశరాదితి. అంశో మాయా. తస్యాంశః సత్త్వం తస్య కలయా అంశేన. అవతీర్ణస్సన్. (49)

భగవంతుడు బ్రహ్మాదులచే ప్రార్థితుడై పరాశరుని వలన సత్యవతియందు మాయాంశతో వ్యాసుడై అవతరించి, వేదమును (సంహిత, బ్రాహ్మణము, ఆరణ్యకము, ఉపనిషత్తు. ఋగ్యజుస్సామాథర్వణములు అను) నాలుగు విధములుగ విభజించెను.(49)



శ్లో ॥ ఋగథర్వయజుః సామ్నాం రాశీనుద్ధృత్యవర్గశః
చతస్రః సంహితాశ్చక్రే మంత్రైర్మణిగణా ఇవ - 50

టీ :- చాతర్విధ్యమేవాహ - ఋగితి. ఋగాదిమంత్రాణాం రాశీన్ వర్గశః తత్తత్ప్రకరణభేదైరుద్ధృత్య యథా అనేకవిధమణి రాశేర్మణిగణాః పద్మరాగాదయో వివిచ్యోద్ధ్రియంతే తద్వదుద్ధ ృత్య మంత్రైశ్చతస్రః ఋగాదిసంహితాశ్చక్రే. (50)

ఋగ్యజుః సామాధర్వణమంత్రములను వర్గ, ప్రకరణముల భేదముతో, అనేక మణుల రాశిలో నుండి పద్మరాగాది మణులను విభజించినట్లు, విభజించి ఆయా సంహితలను రూపొందించెను.(50)

శ్లో ॥ తాసాం స చతురః శిష్యానుపాహూయ మహామతిః
ఏకైకాం సంహితాం బ్రహ్మన్ ! ఏకైకస్మై దదౌ విభుః - 51

టీ :- తాసామితి. తాసాం సంహితానాం మధ్యే ఏకాం ఏకాం. (51)

వేదములను నాలుగు భాగములుగ విభజించిన వ్యాసుడు నలుగురు శిష్యులను పిలిచి, ఒక్కొక్క సంహితను ఒక్కొక్కరికి ఇచ్చెను. (51)

శ్లో ॥ పైలాయ సంహితామాద్యాం బహ్వృచాఖ్యామువాచ హ
వైశంపాయన సంజ్ఞాయ నిగదాఖ్యం యజుర్గణమ్ - 52

టీ :- పైలాయేతి. ఋక్సముదాయరూపత్వాద్బహ్వృచాఖ్యాం. నితరాం ప్రశ్లేషేణ గద్యమానత్వాన్నిగదాఖ్యం. (52)

ఋక్కుల సముదాయములతో కూడిన బహ్వృచమను పేరు గల మొదటి సంహితను తన శిష్యులలో ఒకడైన పైలునకు వ్యాసుడు ఇచ్చెను. మిక్కిలి ప్రశ్లేషలతో కూడిన నిగదమనెడి సంహితను తన శిష్యులలో మరొకడైన వైశంపాయనునకు వ్యాసుడొసంగెను. (52)



శ్లో ॥ సామ్నాం జైమినయే ప్రాహ తథా ఛందోగసంహితామ్
అథర్వాంగిరసీం నామ స్వశిష్యాయ సుమన్తవే - 53

టీ :- సామ్నామితి.సామ్నాం సంబన్ధినీం ఛన్దస్సు గీయమానత్వాత్ ఛన్దోగాఖ్యాం సంహితాం. (53)

శ్లో ॥ పైలః స్వసంహితామూచే ఇంద్రప్రమితయే మునిః
బాష్కలాయ చ సోఽప్యాహ శిష్యేభ్యః సంహితాంస్వకామ్- 54

శ్లో ॥ చతుర్ధావ్యస్య బోధ్యాయ యాజ్ఞవల్క్యాయ భార్గవ
పరాశరాయాగ్నిమిత్రే ఇంద్రప్రమితిరాత్మవాన్ - 55

శ్లో ॥ అధ్యాపయత్సంహితాం స్వాం మాండూకేయమృషింకవిమ్
తస్య శిష్యో దేవమిత్రః సౌభర్యాదిభ్య ఊచివాన్ - 56

టీ :- తత్ర ఋగ్వేదశాఖావిభాగమాహ - పైల ఇతి. స్వసంహితాం ద్వేధా విభజ్య ఇంద్రప్రమితయే బాష్కలాయ చ ఊచే. (54)

టీ :- చతుర్ధేతి. సబాష్కలోఽపి స్వసంహితాయాం చతుర్ధావ్యస్య బోధ్యాదిభ్యశ్చతుర్భ్యశ్శిష్యేభ్య ఆహ - భో భార్గవ.(55)

ఛందస్సులతో పాడుటకు యోగ్యమైన సామముల సమూహమైన ఛందోగ సంహితను తన శిష్యులలో మరొకడైన జైమినికి అనుగ్రహించెను. అధర్వ ఆంగిరసమనుపేరుగల సంహితను తన శిష్యులలో ఇంకొకడైన సుమంతునికిచ్చెను. (53)

పైలుడు తన సంహితను రెండు భాగములుగ చేసి, ఒక దానిని ఇంద్రప్రమితి అను శిష్యునకు ఉపదేశించెను. బాష్కలుడు తనకు పైలుడు ఇచ్చిన సంహితను నాలుగు భాగములుగ విభజించి, బోధ్యుడు, యాజ్ఞవల్క్యుడు, పరాశరుడు, అగ్నిమిత్రుడనబడు శిష్యులకు ఉపదేశించెను. ఇంద్రప్రమితి తన సంహితను తన కొడుకైన మాండూకేయునకిచ్చెను. మాండూకేయుని శిష్యుడు దేవమిత్రుడు. అతడు తన సంహితను సౌభర్యాదులకు చెప్పెను. (54,55,56)



టీ :- అధ్యాపయదితి. ఇంద్రప్రమితిరపి స్వాం సంహితాం స్వసుతం మాండూకేయమధ్యాపయామాస తస్య మాండూకేయస్య శిష్యో దేవమిత్ర. (56)

శ్లో ॥ శాకల్యస్తత్సుతః స్వాంతు పంచధావ్యస్య సంహితామ్
వాత్స్యముద్గల శాలీయ గోఖల్య శిశిరేష్వధాత్ - 57

మాండూకేయుని సుతుడైన శాకల్యుడు తన సంహితను ఐదు విభాగాలుగాచేసి వాత్స్య, ముద్గల, శాలీయ, గోఖల్య, శిశిరులనెడి శిష్యులకు ఉపదేశించెను. (57)

టీ :- శాకల్య ఇతి. తత్సుతః మాండూకేయసుతః శాకల్యః వాత్స్యాదిషు పంచస్వధాత్. తానధ్యాపయామాసేత్యర్థః. (57)

శ్లో ॥ జాతుకర్ణ్యశ్చ తచ్ఛిష్యః సనిరుక్తాం స్వసంహితామ్
బలాకపైజ వైతాల విరజేభ్యో దదౌ మునిః - 58

శాకల్యుని శిష్యుడైన జాతుకర్ణ్యుడు తన సంహితను మూడు భాగములు చేసి, నాలుగవ భాగముగా వైదిక పదార్థ వ్యాఖ్యాన రూపమగు నిరుక్తమును కూడా నిర్మించి, బలాక, పైజ, వైతాల, విరజులనెడి నలుగురు శిష్యులకు చెప్పెను. (58)

టీ :- జాతుకర్ణ ఇతి. తచ్ఛిష్యః శాకల్యశిష్యః స్వసంహితాయాం త్రేధా విభజ్య చతుర్థం వైదికపదార్థ వ్యాఖ్యానరూపం నిరుక్తం చ బాష్కలిరితి కృత్వా బలాకాదిభ్యశ్చతుర్భ్యః దదౌ. (58)

శ్లో ॥ బాష్కలిః ప్రతిశాఖాభ్యో వాలఖిల్యాఖ్య సంహితామ్
చక్రే బాలాయ నిర్భజ్యః కాసారశ్చైవతాం దధుః - 59

పూర్వము చెప్పిన వారిలో నొకడైన బాష్కలుని కొడుకు బాష్కలి. ఈతడు పూర్వము చెప్పిన అన్ని శాఖల నుండి వాలఖిల్యసంహితను



టీ:- బాష్కలిరితి. పూర్వోక్తస్య బాష్కలస్య పుత్రః ప్రతిశాఖాభ్యః ఉక్తసర్వశాఖాభ్యః బాలాయన్యాదయస్తాం దధురధీతవంతః. (59)

రూపొందించి, తన శిష్యులైన బాలాయని, భజ్యుడు, కాసారుడు అను వారికిచ్చెను. (59)

శ్లో॥ బహ్వృచాః సంహితాహ్యేతాః ఏభిర్బ్రహ్మర్షిభిర్ధృతాః
శ్రుత్వైతచ్ఛందసాం వ్యాసం సర్వపాపైః ప్రముచ్యతే - 60

బ్రహ్మర్షులచే ధరింపబడిన బహ్వృచములతో కూడిన ఈ ఋగ్వేదసంహితలను విన్నవారు సకల పాపముల నుండి దూరమయ్యెదరు. (60)

టీ :- ఋక్ శాఖోపసంహారపూర్వకం తచ్ఛ్రవణఫలమాహ - బహ్వృచా ఇతి. ఏతచ్ఛందసాం ఏతేషాం ఛందసాం. (60)

శ్లో॥ వైశంపాయన శిష్యా వై చరకాऽధ్వర్యవోऽభవన్
యచ్చేరుర్బ్రహ్మహత్యాం హః క్షపణం స్వగురోర్వ్రతమ్ - 61

వైశంపాయనుని శిష్యులైన చరకాదులు యజుర్వేదములో చెప్పబడిన యాగమంత్రములను ధరించినవారై, ఆధ్వర్యులైరి. తమగురువు యొక్క బ్రహ్మహత్యాపాపనాశకమగు వ్రతము నాచరింపగా, తాము కూడా ఆ వ్రతము నాచరించినవారు గనుక వీరు చరకాధ్వర్యులను పేరు గలవారైరి. (61)

టీ :- యజుర్వేదే తైత్తిరీయశాఖోత్పత్తిప్రస్తావమాహ - వైశంపాయనేతి. చరకనామనిరుక్తిమాహ - యద్యస్మాద్ధేతోః చేరురితి. బ్రహ్మహత్యారూపమంహః క్షపయతీతి తథా. తత్స్వగురోరనుష్ఠేయం వ్రతం. తద్వ్రతచరణాచ్చరకా ఇత్యర్థః. (61)

శ్లో॥ యాజ్ఞవల్క్యశ్చ తచ్ఛిష్యః ఆహాహో భగవన్కియత్
చరితేనాల్పసారాణాం చరిష్యేऽహం సుదుశ్చరమ్ - 62

వైశంపాయనుని శిష్యుడైన యాజ్ఞవల్క్యుడు గురువుతో పూజ్యుడా! అల్పసారులైన ఈ చరకాదులు ఈ వ్రతమునాచరింపలేరు.



టీ:-యాజ్ఞవల్క్య ఇతి. తచ్ఛిష్యః వైశంపాయనశిష్యః అల్పసారాణామే తేషాం చరితేన కియత్. సుదుశ్చరమహం చరిష్యామీతి. (62)

కావున నేను ఈ కఠిన వ్రతమునాచరింపసమర్థుడను గాన, నాకొసంగుము అనెను(62).

శ్లో॥ ఇత్యుక్తో గురురప్యాహ కుపితో యాహ్యలం త్వయా
విప్రావమన్త్రా శిష్యేణ మదధీతం త్యజాశ్వితి - 63

టీ :- ఇతీతి. విప్రాణాం అవమంత్రా అవజ్ఞాకర్త్రా మత్తోఽధీతమాశు త్యజేతి. (63)

అప్పుడు గురువైన వైశంపాయనుడు కోపించినవాడై యాజ్ఞవల్క్యునితో ఓయీ ! నీ మాటలిక చాలు. ఇచట నుండి వెడలిపొమ్ము ! చరకులను అవమానించినందులకు నీవు నా దగ్గర నేర్చుకొన్న వేదసంహితను వదలివేసి పొమ్ము ! అని పలికెను. (63)

శ్లో॥ దేవరాతసుతః సోఽపిచ్ఛర్దిత్వా యజుషాం గణమ్
తతో గతోఽథ మునయో దదృశుస్తాన్యజుర్గణాన్ - 64

టీ :- దేవరాతేతి. దేవరాతసుతో యాజ్ఞవల్క్యః. (64)

దేవరాతుని పుత్రుడైన యాజ్ఞవల్క్యుడు గురువు అదేశముతో తాను నేర్చుకొన్న యజుర్వేదసంహితను వదలివేసి (వమనము) వెడలిపోయెను.(64)

శ్లో॥ యజూంషి తిత్తిరా భూత్వా తల్లోలు పతయోఽదదుః
తైత్తిరీయా ఇతియజుః శాఖా ఆసన్ సుపేశలాః - 65

టీ :- భూత్వేతి. ఛర్దితస్యాదానం విప్రరూపేణానుచితమితి మత్వా తిత్తిరయః పక్షివిశేషాః భూత్వా ఆదదుః. తతశ్చ తైత్తిరీయా ఇతి ప్రసిద్ధాః సుపేశలా అతిరమ్యాః బహువచనమవాంతరభేదవివక్షయా. (65)

అప్పుడు యజుస్సులు (యజుర్వేదమంత్రమూర్తులు) యాజ్ఞవల్క్యుడు వదలివేసిన సంహితలను తైత్తిరి పక్షుల రూపములో స్వీకరించినవి. అవియే అనంతర కాలమున అతిరమణీయములగు తైత్తిరీయసంహితలైనవి. (65)



శ్లో ॥ యాజ్ఞవల్క్యస్తతో బ్రహ్మంశ్ఛందాంస్యధిగవేషయన్
గురోరవిద్యమానాని సూపతస్థేఽర్కమీశ్వరమ్ - 66

టీ :- కాణ్వమాధ్యందినాదిశాఖాప్రసఙ్గమాహ - యాజ్ఞవల్క్య ఇతి. గురోర్వైశంపాయనస్య వ్యాసేన విభజ్యానుక్తత్వాదవిద్యమానాని అధి అధికాని గవేషయన్ మృగయన్ సూపతస్థేసమ్యక్ తుష్టావ వేదానామీశ్వరం తథాచ. శ్రు. " ఋగ్భిః పూర్వాహ్ణే దివి దేవ ఈయతే. యజుర్వేదేతిష్ఠతి మధ్యే అహ్నః. సామవేదానాస్తమయే మహీయతే వేదైరశూన్యస్త్రిభిరేతి సూర్య " ఇతి. (66)

యాజ్ఞవల్క్యుడు, తన గురువైన వైశంపాయనుడు చెప్పని అధికములగు యజుస్సులను తెలిసికొనుటకై సూర్యభగవానుని స్తుతించెను. ఏలయనగా - ఋగాది వేదత్రయమును ధరించువాడు సూర్యుడని వేదము పలుకుచున్నది - 'ఋగ్భిః' పూర్వాహ్ణే దివి దేవి ఈయతే, యజుర్వేదే తిష్ఠతి మధ్యే అహ్నః, సామవేదేనాస్తమయే మహీయతే, వేదైర శూన్యైస్త్రిభిరేతి సూర్యః' అనగా సూర్యుడు తాను సంచరించు ప్రతిదినములోని పూర్వాహ్ణమును ఋక్కులచేతను, మధ్యాహ్నమును యజుస్సులచేతను, సాయాహ్నమును సామముల చేతను ధరింపబడియుండునే గాని, వేదములను ధరింపక ఎప్పుడు ఉండడు' అని తాత్పర్యము. (66)

**యాజ్ఞవల్క్య ఉవాచ**

శ్లో ॥ ఓం నమో భగవతే ఆదిత్యాయాఖిలజగతామాత్మస్వరూపేణ కాలస్వరూపేణ చతుర్విధభూతనికాయానాం బ్రహ్మాదిస్తంబ పర్యన్తానా మన్తర్హృదయేషు బహిరపి చాకాశ ఇవోపాధినా వ్యవధీయమానో భవానేక ఏవ క్షణ లవ నిమేషా వయవోపచిత సంవత్సర గణేనాపా మాదాన విసర్గాభ్యామిమాం లోక యాత్రామనువహతి. 67

**యాజ్ఞవల్క్యుడు పలుకుచున్నాడు**

'ఓ సూర్యభగవానుడా! నీకు నమస్కారము. నీవు జగత్తులోని జీవులలో నిరంతరముగా ఉన్నను, వారిచే ఆచ్ఛాదింపబడవు. కాలస్వరూపముతో, అనగా క్షణము, లవము మొదలైన కాలావయవములతో కూడిన సంవత్సరముల సముదాయములో నుండుచు, నీళ్ళను ఆవిరి రూపములో స్వీకరించుట, నీటిని పీల్చుకొని శుష్కింపజేయుట, వర్షముల ద్వారా నీటిని కురిపించుట చేయుచున్నావు. చతుర్విధభూత సముదాయములైన బ్రహ్మాదిస్తంబ



టీ :- ఓం నమ ఇతి. ఓం నమో భగవతే తుభ్యమాదిత్యాయ యో భవానేక ఏవేమాం లోకయాత్రామనువహతీత్యన్వయః తదేవదర్శయతి - అఖిలజగతామాత్మస్వరూపేణాంతర్హృదయేషు కాలస్వరూపేణ చ బహిరపి వర్తమాన ఇతి. అఖిలజగతామిత్యస్య ప్రపంచః. చతుర్విధేతి. హృదయాంతర్వర్తిత్వేఽపి జీవవత్తేనోపాధినా అవ్యవధీయమానః అనాచ్ఛాద్యమానః కాలస్వరూపేణ చేత్యస్య ప్రపంచః. క్షణేతి క్షణలవాదయో యే అవయవాస్తైరుపచితాస్సంవత్సరాస్తేషాం గణేన ప్రత్యబ్దమపామాదానం శోషణం విసర్గో వృష్టిః తాభ్యాం అనేన గాయత్రీప్రథమపాదోక్తవరేణ్యతా దర్శితా. (67)

శ్లో ॥ యదు హ వావ విబుధర్షభ! సవితరదస్తపత్యనుసవన మహరహరామ్నాయవిధినోపతిష్ఠమానానామఖిల దురిత వృజిన బీజావభర్జన! భగవతః సమభిధీమహి తపనమండలమ్ - 68

టీ :- ద్వితీయపాదార్థానువర్ణనేన స్తౌతి - యదుతహేతి. హే విబుధర్షభ. హే సవితః యదప్యదో భగవస్తవ మండలం తపతి. తత్సమభిధీమహి సమ్యగాభిముఖ్యేన ధ్యాయేమ. పునస్తస్యైవ సంబోధనం. ప్రత్యహం త్రిషవణం వైదికకర్మమార్గేణ స్తువతాం భక్తానాం యాన్యఖిలాని దురితాని తత్ఫలాని చ వృజినాని దుఃఖాని చ తేషాం బీజమజ్ఞానం చ తేషామవభర్జనవినాశక హే తపనేతి. (68)

పర్యన్తముగల వాని హృదయములలో, వెలుపల కూడ ఆకాశమువలె ఉపాధిచే వ్యవధిలేనివాడవై నీవొక్కడవే నిలిచియున్నావు. ఈ స్తుతి ద్వారా గాయత్రీ ప్రథమ పాదమున చెప్పబడిన 'వరేణ్యత' (శ్రేష్ఠత) వర్ణింపబడినది. (67).

గాయత్రీ ద్వితీయ పాదము యొక్క అర్థము ఇచట వర్ణింపబడుచున్నది - ఓ సూర్యభగవానుడా! నీ యొక్క ఏ కిరణ మండలము క్రిందికి ప్రసరించుచున్నదో ఆ మండలమునకెదురుగా నిలచి, ధ్యానింతుము. ప్రతినిత్యము వైదిక కర్మలను ఆచరించుట ద్వారా నిన్ను స్తుతించు భక్తుల అఖిలపాపములను, వాటి ఫలములైన దుఃఖములను, వానికి మూలమైన అజ్ఞానమును నీవు నశింపజేసెదవు. కావున నీకు నమస్కారము. (68)



శ్లో ॥ య ఇహ వావ స్థిరచరనికరాణాం నిజనికేతనానాం మన ఇంద్రియాసుగుణానాత్మనః స్వయమాత్మాంతర్యామీ ప్రచోదయతి – (69)

టీ :– తృతీయపాదేన స్తౌతి. – య ఇతి. యో భవాన్ స్థావరజంగమ సమూహానాం స్వాశ్రయాణాం జీవానాం మన ఇంద్రియప్రాణగణాన్ అనాత్మనో జడాన్. స్వయమాత్మైవాంతర్యామీ సన్. ప్రచోదయతి ప్రవర్తయతి. (69)

శ్లో ॥ య ఏవేమం లోక మతి కరాల వదనాంధకార సంజ్ఞాజగర – గ్రహగలితం మృతకమివ విచేతనమవలోక్యానుకంపయా పరమకారుణిక ఈక్షయైవోత్థాప్యాహరహరను సవనం శ్రేయసి స్వధర్మాఖ్యాత్మావస్థానే ప్రవర్తయత్యవనిపతిరివాసాధూనాం భయముదీరయన్నటతి – (70)

టీ :– తృతీయపాదమేవ మండలస్థపరతయా వ్యాచక్షాణః స్తౌతి. – య ఏక ఏవ భగవాన్. అతికరాలవదనో యోఽంధకారసంజ్ఞో జగరగ్రహస్తేన గృహీతం అత ఏవ మృతకమివ విచేతనం స్వధర్మాఖ్యం యదాత్మావస్థానం ప్రత్యక్ప్రవణత్వం తదేవ శ్రేయస్తస్మిన్ ప్రవర్తయతి

గాయత్రీ తృతీయ పాదము యొక్క అర్థమిచట వర్ణితము – ఓ సూర్యభగవానుడా! నిన్ను ఆశ్రయించియున్న చరాచర సమూహముల మనస్సులను, ఇంద్రియములను, ప్రాణగణములను, అనాత్మలను, జడములను అంతర్యామివై నీవే ప్రవర్తింపజేయుచున్నావు. (69)

గాయత్రీ తృతీయ పాదమునే మండలస్థపరముగా ఇచట వర్ణించుచున్నాడు – 'ఓ సూర్యభగవానుడా! ఈ లోకమును అతిక్రూరముఖముతో కూడిన అంధకారమనెడి అజగరము (సర్పము) నోటపడి, మరణించినదానివలె, చైతన్య రహితమైన దానివలె చూచి, పరమకరుణామయుడవై దయతో కేవలము నీ చూపుతోడనే మరల బ్రతికింపజేసి, అనుదినము స్వధర్మమనెడి శ్రేయోదాయక చూపుతోడనే మరల బ్రతికింపజేసి, అనుదినము స్వధర్మమనెడి శ్రేయోదాయకమగు యాగమునందు ప్రవర్తింపజేయుచు, ధార్మికుడైన రాజువలె నిరంతరము తిరుగుచు, అసాధువులకు భయమును గొలుపుచు సంచరించుచున్నావు. (70)



- కించ యో భగవానవనీపతిరివ - అటతి గచ్ఛతి. ఆశాపాలై రింద్రాదిభిః. కమలకోశ యుక్తై స్తత్త్యైర్వాంజలిభిః. ఉపహృతార్హణః దత్తార్ఘ్యః. (70)

శ్లో॥ పరిత ఆశాపాలైస్తత్ర తత్ర కమలకోశాంజలిభిరుపా-హృతార్హణః - 71

టీ :- అథేతి. యత ఏవం భూతస్త్వం. అథ అతః. హస్ఫుటం. అయాతయామాని అన్యైర్యథావదనభిజ్ఞాతాని యజూంషి తత్కామః అహం ఉపసరామి భజామి. (71)

ఓ సూర్యభగవానుడా! నీవు చుట్టు ఇంద్రాది దిక్పాలకులచే కమలములతోడను, కమలములవంటి చేతులతోడను పూజింపబడు చున్నావు. (71)

శ్లో॥ అథ హ భగవంస్తవ చరణ నలినయుగలం త్రిభువనగురుభి ర్వందిత మహమయాతయామయజుః కామ ఉపసరామీతి.- 72

టీ :- ఏవమితి. ఏవం స్తుతః ప్రసాదిశ్చ. (72)

ఓ సూర్యభగవానుడా! ఈ విధముగ త్రిభువనములలో శ్రేష్ఠులైనవారిచే పూజింపబడు నీ చరణకమల ద్వంద్వమును నాకు స్పష్టముగ లభింపని యజుస్సులను పొందగోరినవాడనై సేవించెదను. (72)

**సూత ఉవాచ**

శ్లో॥ ఏవం స్తుతః స భగవాన్వాజిరూపధరో హరిః
యజూంష్యయాత యామాని మునయేఽదాత్ప్రసాదితః - 73

**సూతపౌరాణికుడు పలుకుచున్నాడు**

ఈ విధముగ యాజ్ఞవల్క్యునిచే స్తుతింపబడిన సూర్యభగవానుడు, ప్రసన్నుడై అతని యెదుట అశ్వరూపములో



టీ :- యజుర్భిరితి. పంచదశశాఖాః యాః శతైః అపరిమితైర్యజుర్భిరకరోత్. సతైరితి పాఠే. సః యాజ్ఞవల్క్యః తైర్యజుర్భిరకరోదితి. జగృహుః. అధీతవంతః రవిణా వాజిస్వరూపేణ వాజేభ్యః కేసరేభ్యః వాజేన వేగేన వా సన్యస్తాః త్యక్తాః శాఖాః. వాజసనేయసంజ్ఞా స్తాశ్శాఖా ఇతి వా. (73)

ప్రకటమై గతంలో ఎవరికిని ప్రాప్తించని, యాజ్ఞవల్క్యుడు కోరిన యజుస్సులను (యజుర్వేద మంత్రములను) ఆతని కనుగ్రహించెను. (73)

శ్లో ॥ యజుర్భిరకరోచ్ఛాఖా దశపంచశతైర్విభుః
జగృహుర్వాజసన్యస్తాః కాణ్వమాధ్యన్దినాదయః - 74

టీ : - సామశాఖావిభాగమాహ - జైమినేరితి. తత్సుతః సుమంతుసుతః. తాభ్యాం పుత్రపౌత్రాభ్యాం. క్రమేణైకైకాం ప్రాహ.(74)

పిమ్మట యాజ్ఞవల్క్యుడు అపరిమితములైన యజస్సులతో పదునైదుశాఖలనేర్పరచును. పూర్వము సూర్య భగవానుడు అశ్వరూపముతో కేసరములకు అమితవేగముతో చెప్పిన యజుర్వేదశాఖలైన వాజసనీయములివియే. వీటిని కణ్వ, మాధ్యందినాది ఋషులు గ్రహించిరి. (74)

శ్లో ॥ జైమినేః సామగస్యాసీత్సుమన్తు స్తనయో మునిః
సున్వాంస్తు తత్సుతస్తాభ్యామేకైకాం ప్రాహ సంహితామ్ - 75

టీ :- సుకర్మేతి. తచ్ఛిష్యః. జైమినేశ్శిష్యః. మహానతిమేధావీ సహస్రం సంహితారూపం భేదం చక్రే. సామ్నాం తం సంహితాభేదం. తతస్తదనంతరం. (75)

సామ వేదమును ధరించిన జైమిని కొడుకు సుమంతుడు. ఆ సుమంతుని కొడుకు సున్వానుడు. జైమిని వారిద్దరికినీ (సుమంతుడు, సున్వానుడు) ఒక్కొక్క సామసంహితను జైమిని బోధించెను. (75)



శ్లో ॥ సుకర్మా చాపి తచ్ఛిష్యః సామవేదతరోర్మహాన్
సహస్ర సంహితాభేదం చక్రే సామ్నాం తతోద్విజః - 76

శ్లో ॥ హిరణ్యనాభః కౌసల్యః పౌష్యంజిశ్చ సుకర్మణః
శిష్యౌ జగృహతుశ్చాన్య ఆవంత్యో బ్రహ్మవిత్తమః - 77

టీ :- హిరణ్యనాభ ఇతి. సుకర్మణః శిష్యాః. ఏకః కౌసల్యో హిరణ్యనాభః పౌష్పింజిర్నామాపరః తౌ జగృహతుః ఆవంత్యాశ్చాన్యః తస్యైవ శిష్యః. సోఽపి జగ్రాహ. (76)

టీ :- ఉదీచ్యా ఇతి. పౌష్పింజ్యావంత్యయోరపి. చకారార్ధిరణ్య నాభస్యాపి. పంచశతాని శిష్యాః ఆసన్. తే తావతీః శాఖాః యథాయథం జగృహుః. తానుదీచ్యాన్ సతః కాలతః కాంశ్చిత్ప్రాచ్యాంశ్చ ప్రచక్షత ఇత్యర్థః. యథోక్తం వైష్ణవే - శ్లో. "ఉదీచ్యాస్సామగాశ్శిష్యాస్తస్య పంచశతం స్మృతాః, హిరణ్యణాభాత్తావత్యస్సంహితాయైర్ద్విజోత్తమైః, గృహీతాస్తేఽపి చోచ్యంతే పండితైః ప్రాచ్యసామగా" ఇతి. (77)

జైమిని శిష్యుడైన సుకర్ముడు మహామేధావి. ఆతడు సామవేదవృక్షమును వేయికొమ్మలుగ (వేయి సంహితలుగ) విభజించెను. ఆ తరువాత సుకర్ముని శిష్యులలో కోసలదేశవాసియైన హిరణ్యనాభుడు, పౌష్యంజియను మరియొక శిష్యుడు సుకర్ముని నుండి సామశాఖలనధ్యయనము చేసిరి. బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడైన ఆవంత్యుడు అను మఱియొక శిష్యుడు కూడ సుకర్ముని నుండి సామములను గ్రహించెను. (76,77)



శ్లో ॥ ఉదీచ్యాః సామగాః శిష్యాః ఆసన్పంచశతానివై
పౌష్యంజ్యావంత్యయోశ్చాపి తాంశ్చ ప్రాచ్యాన్ప్రచక్షతే - 78

టీ :- పునరప్యేతేషాం త్రయాణాం సుకర్మణశ్శిష్యాణాం శిష్యాంతరై శ్శాఖాబాహుల్యం దర్శయతి - ద్వాభ్యాం లోక్షిరితి.(78)

పౌష్యంజి, ఆవంత్యుడు, హిరణ్యానాభులకు ఒక్కొక్కరికి ఐదు వందలమంది శిష్యులైరి. వారివలన ఐదువందల సామగాన శాఖలేర్పడినవి. వీరిలో ఉదీచ్చులు (ఉత్తరదిశలో నుండు వారు), ప్రాచ్యులు (తూర్పు దిక్కులో నివసించువారు) ఉన్నారు. విష్ణుపురాణముకూడా- సుకర్మునికి ఉదీచ్యులైన సామగాయక శిష్యులు ఐదువందల మంది ఉన్నారనియు, హిరణ్యానాభుని వలన సామగానములను నేర్చుకొన్నవారిని కూడా ప్రాచ్యసామగులని పిలుచుచున్నారనియు, చెప్పినది. (78)

శ్లో ॥ లౌగాక్షిర్మాంగలిః కుల్యః కుసీదః కుక్షిరేవ చ
పౌష్యంజిశిష్యాః జగృహుః సంహితాస్తే శతం శతమ్ - 79

పౌష్యంజి శిష్యులైన, లౌగాక్షి, మాంగలి, కుల్యుడు, కుసీదుడు, కుక్షి అనువారు ఈ సామసంహితలను వందల కొలదిగ విస్తరించిరి. (79)

శ్లో ॥ కృతో హిరణ్యానాభస్య చతుర్వింశతి సంహితాః
శిష్య ఊచే స్వశిష్యేభ్యః శేషా ఆవంత్య ఆత్మవాన్ - 80

టీ :- కృత ఇతి. కృతోనామ హిరణ్యానాభస్యశిష్యః స్వశిష్యేభ్యః ఊచే. శేషా అన్యా అపి యాః ప్రసిద్ధాశ్శాఖాస్తాః. ఆవంత్యః స్వశిష్యేభ్యః. ఊచ ఇతి. (79,80)

హిరణ్యానాభుని శిష్యుడైన కృతుడు ఇరువది నాలుగు సంహితలను తన శిష్యులకుపదేశింపగా, మిగిలిన సంహితలను ఆవంత్యుడు తన శిష్యులకు ప్రబోధించెను. ఇట్లు సామవేదము లోకములో ప్రవర్తిల్లెను. (80)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే ద్వాదశస్కంధే**
**వేదశాఖాప్రణయనం నామ షష్ఠోఽధ్యాయః**

**శ్రీమద్భాగవత మహాపురాణము యొక్క ద్వాదశస్కంధమునందలి**
**షష్ఠాధ్యాయము సమాప్తము.**



## సప్తమోఽధ్యాయః

**సూత ఉవాచ**

శ్లో ॥ అథర్వవిత్సుమన్తుశ్చ శిష్య మధ్యాపయత్ స్వకామ్
సంహితాం సోఽపి పథ్యాయ వేదదర్శాయ చోక్తవాన్ – 1

టీ :– సప్తమే ధర్మవిస్తారః పురాణవ్యసనం తతః, పురాణలక్షణాదీని ఫలం భాగవతశ్రుతేః. క్రమప్రాప్తమథర్వవేదవిభాగమాహ – అథర్వ విదితి. శిష్యం కబంధనామానం. స్వకాం స్వకీయాం సంహితాం సోఽపి శిష్యోఽపి. తాం ద్వేధా విభజ్య. తదుక్తం వైష్ణవే. శ్లో. "అథర్వవేదం సమునిస్సమంతు రమితద్యుతిః, శిష్యమధ్యాపయామాస కబంధం సోపి తద్ద్విధా, కృత్వాతు వేదదర్శాయ తథాపథ్యాయ దత్తవాని" తి. (1)

శ్లో ॥ శౌక్లాయనిర్బ్రహ్మబలిర్మోదోషః పిప్పలాయనిః
వేదదర్శస్య శిష్యాస్తే పథ్యశిష్యానథో శృణు
కుముదః శునకో బ్రహ్మన్ ! జాజలిశ్చాప్యథర్వవిత్ – 2

టీ :– తత్ర వేదదర్శః స్వసంహితాం చతుర్ధా విభజ్య చతురశ్శిష్యా నధ్యాపయామాస. పథ్యశ్చ త్రిధా విభజ్య త్రీనితి సార్ధేనాహ – శౌల్కాయనిరితి. (2)

## సప్తమాధ్యాయము

**సూతపౌరాణికుడు పలికెను**

ఈ సప్తమాధ్యాయమున అథర్వవేదము యొక్క విస్తారము, పురాణవ్యసనము, పురాణ లక్షణాదులు, భాగవత శ్రవణఫలము తెలుపబడుచున్నది. అథర్వ వేదవేత్తయగు సుమంతుడు తాను నేర్చుకొన్న అథర్వసంహితను తన శిష్యుడైన కబంధుడనువానికి చెప్పెను. ఆ కబంధుడు తాను నేర్చుకొన్న సంహితను రెండుగా విభజించి, వానిని తన శిష్యుడైన వేదదర్శునికి చెప్పెను. (1)

వేదదర్శుడు తన సంహితను నాలుగు భాగములుగ విభజించి, నలుగురు శిష్యులకు చెప్పెను. ఆ శిష్యులలో పథ్యుడనువాడు తన సంహితను మూడు భాగములుగ విభజించి, కుముదుడు, శునకుడు, జాజలి అను శిష్యులకు చెప్పెను. శౌక్లాయని, బ్రహ్మబలి, మోదోషుడు, పిప్పలాయని అను నలుగురు వేదదర్శుని శిష్యులు. (2)



శ్లో ॥ బభ్రుః శిష్యోఽథాంగిరసః సైంధవాయన ఏవ చ
అధీయేతాం సంహితే ద్వే సావర్ణ్యాద్యాస్తథాపరే - 3

టీ :- బభ్రురితి. అంగిరసః శునకస్య. శిష్యో బభ్రుః సైంధవాయనశ్చ. తదుక్తం. శ్లో. "శునకస్తు ద్విధాకృత్వాదదావేకాం తు బభ్రవే, ద్వితీయాం సంహితాం ప్రాదాత్సైంధవాయ నస్సంజ్ఞిన" ఇతి. సావర్ణ్యాద్యాః. సైంధవాయనాదీనాం. శిష్యాః. (3)

శునకుడు తన సంహితను రెండుగ విభజించి, బభ్రువునకొకటి, సైంధవాయనునకొకటి ఇచ్చెను. సైంధవాయనాదుల శిష్యులగు సావర్ణ్యాదులు ఈ రెండు సంహితలను అధ్యయనము చేసిరి. (3)

శ్లో ॥ నక్షత్రకల్పః శాన్తిశ్చ కశ్యపాంగిర సాదయః
ఏతే ఆథర్వణాచార్యాః శ్రుణు పౌరాణికాన్మునే! - 4

శ్లో ॥ త్రయ్యారుణిః కశ్యపశ్చ సావర్ణిరకృత వ్రణః
వైశంపాయనహారీతౌ షడ్వై పౌరాణికా ఇమే - 5

టీ :- నక్షత్రకల్ప ఇతి. నక్షత్రకల్పః శాంతికల్పశ్చేతి ద్వౌతదుక్తం. శ్లో. " నక్షత్రకల్పో వేదానాం సంహితానాం తథైవ చ, చతుర్థ స్స్యాదాంగిరసశ్శాంతి కల్పశ్చ పంచమ" ఇతి. నక్షత్రకల్పాదీనాం కర్తారస్తత్తనామభిరుచ్యంతే. (4,5)

నక్షతకల్పుడు, శాన్తికల్పుడు, కశ్యపుడు, ఆంగిరసాదులు అథర్వణాచార్యులు, త్రయ్యారుణి, కశ్యపుడు, సావర్ణి, అకృతవ్రణుడు, వైశంపాయనుడు, హారీతుడు అను ఆరుగురు పౌరాణికులు.(4,5)



శ్లో ॥ అధీయన్త వ్యాస శిష్యాత్సంహితాం మత్పితుర్ముఖాత్
ఏకైకామహమేతేషాం శిష్యః సర్వాః సమధ్యగామ్ - 6

టీ :- అధీయంతేతి. మత్పితుర్ముఖాదితి ప్రథమం వ్యాసః షట్సంహితాః కృత్వా మత్పిత్రే రోమహర్షణాయ ప్రాదాత్. తస్య చ ముఖాదేతే త్రయ్యారుణ్యాదయః. ఏకైకాం సంహితామధీయంత ఏతేషాం షణ్ణాం శిష్యోఽహం. తాస్సర్వాః సమధీతవాన్. (6)

తొలుత వ్యాసుడు ఆరుసంహితలు చేసి నా జనకుడైన రోమహర్షణునకు ఇచ్చెను. రోమహర్షణుని నుండి త్రయ్యారుణి మొదలగువారు ఒక్కొక్క సంహితను నేర్చుకొనిరి. పూర్వోక్తులైన ఆరుగురికి శిష్యుడనైన నేను ఆరు సంహితలను అధ్యయనము చేసితిని. (6)

శ్లో ॥ కశ్యపోఽహంచ సావర్ణీ రామశిష్యోఽకృతవ్రణః
అధీమహి వ్యాస శిష్యాచ్చ తస్రో మూలసంహితాః - 7

టీ :- కాశ్యప ఇతి. రామశిష్యోయ అకృతవ్రణః ఏవం చత్వారో వయం మూలసంహితా ఇత్యనేన తతస్సంహితాబాహుల్యం సూచితం7

కశ్యపుడు, నేను, సావర్ణి, రామ శిష్యుడైన అకృతవ్రణుడు అను మేము నలుగురము వ్యాస శిష్యుల నుండి నాలుగు మూల సంహితలను నేర్చుకొంటిమి.(7)

శ్లో ॥ పురాణలక్షణం బ్రహ్మన్! బ్రహ్మర్షిభిర్నిరూపితమ్
శ్రుణుష్వ బుద్ధిమాశ్రిత్య వేద శాస్త్రాను సారతః - 8

టీ :- శుక పరీక్షిత్సంవాదే నిరూపితమపి పురాణలక్షణం తద్భేద కథనాయ దర్శయతి - పురాణేతి. (8)

పూర్వమే శుక - పరీక్షిత్తుల సంవాదములోనే పురాణ లక్షణములు వివరింపబడినప్పటికీ, వాని భేదములను తెలుపుటకు మరల పురాణ లక్షణములను పేర్కొనుచున్నాడు - వేదశాస్త్ర ములననుసరించి బ్రహ్మర్షులు నిరూపించిన పురాణ లక్షణములను చెప్పుచున్నాడు. వినుము. (8)



శ్లో ॥ సర్గోఽస్యాథ విసర్గశ్చ వృత్తీ రక్షాంతరాణి చ
వంశో వంశానుచరితం సంస్థా హేతురపాశ్రయః - 9

టీ :- సర్గ ఇతి. అస్య విశ్వస్య. శ్లో. "అత్ర సర్గో విసర్గశ్చ స్థానం పోషణమూతయః, మన్వంతరేశానుకథానిరోధోముక్తిరాశ్రయః. ఇత్యత్రోక్తే స్థానపోషణే వృత్తిరక్షాశబ్దాభ్యా ముచ్యతే. అంతరాణి మన్వంతరాణి వంశో వంశానుచరితమితి చ ఈశానుకథాః. సంస్థా నిరోధః. అనేనైవాత్యంతకీ లయరూపాముక్తిరప్యుక్తా. హేతుశబ్దేన జీవశ్రయవాసనాశబ్దవాచ్యాః ఊతయో గృహీతాః. (9)

సర్గము (సృష్టి), విసర్గము (ప్రళయము), వృత్తి (స్థితి), రక్షా (పోషణము), అంతరములు (మన్వంతరములు), వంశము (పరంపరగా వచ్చిన వంశములు), వంశానుచరితం (ఆయా వంశములలో జన్మించినవారి వివరములు) సంస్థ (ఆత్యన్తికఫలమగు ముక్తి), హేతువు (జీవుని ఆశ్రయించియున్న వాసనలు), అపాశ్రయము (ఆశ్రయరాహిత్యము) అను పది లక్షణములతో కూడినది పురాణము. (9)

శ్లో ॥ దశభిర్లక్షణైర్యుక్తం పురాణం తద్విదో విదుః
కేచిత్పంచవిధం బ్రహ్మన్! మహదల్పవ్యవస్థయా -10

టీ :- దశభిరితి. దశభిరేతైర్లక్షణైర్లక్షణీయై రర్థైర్యుక్తం. మహాపురాణం విదుః. క్వచిత్పంచవిధం. శ్లో. "సర్గశ్చప్రతిసర్గశ్చ వంశమన్వంతరాణిచ, వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణ" మితి. పురాణం మహత్ అల్పంచేతి వ్యవస్థయా. యత్ర దశాపి లక్షణాని పృథక్ నిరూప్యంతే. తన్మహాపురాణం. యత్రత్వన్యేషాం పంచస్వేవాంతర్భావస్య వివక్షా. తదల్పమితి వ్యవస్థయేత్యర్థః. (10)

ఈ పదిలక్షణములతో కూడినది మహాపురాణమని పురాణ వేత్తలు చెప్పుచున్నారు. కొందరు సర్గము (సృష్టి), ప్రతిసర్గము (ప్రళయము), వంశము (వంశ పరంపర), మన్వంతరము (మనువుల క్రమము, కాలముల అంతరము) వంశానుచరితము (రాజ వంశముల క్రమవర్ణనము) అను పంచలక్షణములతో పురాణముండునని పలుకుచున్నారు. పంచ లక్షణములతో కూడినది అల్పపురాణమనియు, దశలక్షణములతో కూడినది మహాపురాణమనియు గ్రహింపవలెను. (10)



శ్లో ॥ అవ్యాకృత గుణక్షోభాన్మహతస్త్రివృతోఽహమః
భూతమాత్రేంద్రియార్థానాం సంభవః సర్గ ఉచ్యతే 11

టీ :- సర్గాదిలక్షణాని వ్యాచష్టే - అవ్యాకృతేతి. ప్రధానస్య గుణానాం క్షోభాత్. యో మహాన్ తస్మాత్ యస్త్రివృదహంకారస్తస్మాద్భూతమాత్రాణాం సూక్ష్మాణాం ఇంద్రియాణాం చ తదర్థానాం స్థూలానాం తద్దేవతానాం చ సంభవః సర్గః కారణసృష్టిః సర్గ ఇత్యర్థః ఉచ్యత ఇత్యస్య యథాపేక్షముత్తరత్రాప్యనుషంగః. (11)

ప్రధానము యొక్క గుణములకు క్షోభకలుగుటవలన మహత్తు నుండి మూడింతల అహంకారము బయలుదేరును. దాని వలన భూతములకు, సూక్ష్మేంద్రియములకు, స్థూలములైన దేవతలకు ప్రాదుర్భావము జరిగినచో, అదియే కారణ సృష్టి యనబడును. (11)

శ్లో ॥ పురుషాను గృహీతానామేతేషాం వాసనామయః
విసర్గోఽయం సమాహారో బీజాద్బీజం చరాచరమ్ - 12

టీ :- విసర్గం వ్యాచష్టే - పురుషేతి. పురుషేశ్వరేణాను గృహీతానాం ఏతేషాం మహదాదీనాం. పూర్వకర్మవాసనా ప్రధానోఽయం సమాహారః కార్యభూతశ్చరాచరప్రాణిరూపో బీజాద్బీజమివ ప్రవాహాపన్నో విసర్గ ఉచ్యత ఇత్యర్థః. (12)

ఈశ్వరానుగ్రహమును పొందిన మహదాదులకు పూర్వకర్మల వాసనలతో కార్యభూతమైన సమాహారము చరాచర ప్రాణుల రూపములో బీజము నుండి మరియొక బీజము పుట్టినట్లు ప్రవాహరూపమున ఏర్పడుటయే విసర్గము (ప్రతిసర్గము) అనబడును. (12)

శ్లో ॥ వృత్తిర్భూతాని భూతానాం చరణామచరాణిచ
కృతా స్వేన నృణాం తత్ర కామచ్చోదనయాపి వా - 13

జీవుడు స్వభావముతోడగానీ, కోరిక తోడగానీ చరాచరములను ఆధారముగా చేసికొని జీవికను సాగించినచో అది వృత్తియనబడును. (13)



టీ :- వృత్తిరితి. చరాణాం భూతానాం సామాన్యతోఽచరాణి చకారాచ్చరాణి చ. కామాద్వృత్తిః తత్ర తు నృణాం స్వేన భావేన కామాచ్చోదనయాపివా యా నియతా వృత్తిర్జీవికా కృతా. సా వృత్తిరుచ్యత ఇత్యర్థః. (13)

శ్లో ॥ రక్షాచ్యుతావతారేహా విశ్వస్యానుయుగే యుగే
తిర్యఙ్మర్త్యర్షిదేవేషు హన్యన్తే యైస్త్రయీద్విషః - 14

టీ :- రక్షేతి. తిర్యఙ్మర్త్యర్షిదేవేషు యే అచ్యుతావతారా స్తేషామీహాలీలా. సా విశ్వస్య రక్షోచ్యత ఇత్యర్థః. యైరవతారైరితి సమాసాన్నిష కృష్య కథంచిత్సంబంధః. త్రయాద్విషో దైత్యాః. (14)

తిర్యక్కులు (పశు పక్ష్యాదులు), మర్త్యుల్యు (మానవులు), ఋషులు దేవతలు మొదలైన వారిలో విష్ణువు యొక్క అవతారములు, వాని లీలలు రక్షయను పేరుతో పిలువబడును. ఈ అవతారమూర్తులచే దైత్యాది దుర్వర్తనులు చంపబడెదరు.(14)

శ్లో ॥ మన్వన్తరం మనుర్దేవాః మనుపుత్రాః సురేశ్వరః
ఋషయోంశావతారశ్చ హరే షడ్విధముచ్యతే - 15

టీ :- మన్వంతరమితి. షడ్విధం మన్వంతరముచ్యతే షడ్విధత్వమేవాహ - మనురితి. మన్వాదయః షడేతే వర్గాః స్వస్వాధికారేణ యత్ర ప్రవర్తంతే తన్మన్వంతరమిత్యర్థః. (15)

మనువు మొదలగు ఆరుగురు, ఆరు వర్గములుగ నుందురు. వారు తమ అధికారములతో కూడియున్నప్పుడు మన్వంతరమని పిలువబడును.(15)



శ్లో ॥ రాజ్ఞాం బ్రహ్మప్రసూతానాం వంశస్త్రైకాలికోఽన్వయః
వంశానుచరితం తేషాం వృత్తం వంశధరాశ్చ యే - 16

టీ :- వంశమాహ - రాజ్ఞామితి. బ్రహ్మణస్సకాశాత్ ప్రసూతిర్యేషాం శుద్ధానామిత్యర్థః. తేషా మన్వయో వంశః. తేషాం వృత్తం. యే చ వంశధరాస్తేషాం చ వృత్తం వంశానుచరితముచ్యతే వంశానుచరితమితి పాఠే వంశేభవా వంశ్యాసేషాం వృత్తమిత్యర్థః. (16)

బ్రహ్మ నుండి ఉద్భవించిన పవిత్రులైన రాజుల వంశములు, వారి శీలములు, వారి వంశజులైన వారి చరిత్రములు వంశానుచరితములగును. వంశధరశబ్దము చేత ఇచట ప్రియవ్రతుడు, ధ్రువుడు, పృథువు మొదలైన రాజులు పేర్కొనబడుచున్నారు. (16)

శ్లో ॥ నైమిత్తికః ప్రాకృతికో నిత్య ఆత్యన్తికో లయః
సంస్థేతి కవిభిః ప్రోక్తాః చతుర్ధాస్య స్వభావతః - 17

టీ :- నైమిత్తిక ఇతి. అస్య విశ్వస్య స్వభావతో మాయాతో నిష్పన్నస్య. యద్వా మాయాతో యశ్చతుర్విధో లయ ఇతి. (17)

మాయతో ఏర్పడిన ఈ ప్రపంచము యొక్క లయము (ప్రళయము) నాలుగు విధములుగ సంభవించును. మొదటిది నైమిత్తికము. రెండవది ప్రాకృతికము. మూడవది నిత్యము, నాల్గవది ఆత్యన్తికము. (17)

శ్లో ॥ హేతుర్జీవోఽస్య సర్గాదేరవిద్యా కర్మకారకః
యం చానుశయినం ప్రాహురవ్యాకృతముతాపరే - 18

టీ :- హేతురితి. అస్య జగతః సర్గాదేర్హేతుర్నిమిత్తం జీవః సోఽత్ర హేతురుచ్యత ఇత్యర్థః. తస్య నిమిత్తతామాహ - అవిద్యయా కర్మకారకః

ఈ విశ్వము యొక్క సృష్టి స్థితిలయములకు కారణము జీవుడే. కావున అతడు హేతువని చెప్పబడుచున్నాడు. దీనికి కారణము జీవుని అవిద్యాజన్యములైన కర్మములే. జీవుని అదృష్టఫలములు గనే విశ్వము యొక్క సృష్టిస్థితిలయములేర్పడును. కొందరు విశ్వ సృష్టి స్థితి లయములకు చైతన్య ప్రధానుడైన అనుశయి కారణమనుచుండగా, మరికొందరు ఉపాధి ప్రాధాన్యముతోడనే జరుగుననుచున్నారు. (18)



కర్మకర్తా జీవాదృష్టప్రయుక్తత్వాద్విశ్వవిసర్గాదేః స తు తత్ర హేతురిత్యర్థః నన్వనుశయీ నిమిత్తమితి కేచిత్. అవ్యాకృతమిత్యపరే. తత్రాహ – యమితి. చైతన్యప్రాధాన్యే నానుశయినం ఉపాధిప్రాధాన్యవివక్షయా అవ్యాకృతం. (18)

శ్లో ॥ వ్యతిరేకాన్వయో యస్య జాగ్రత్ స్వప్నసుషుప్తిషు
మాయామయేషు తద్బ్రహ్మ జీవవృత్తిష్వపాశ్రయః – 19

టీ :– అపాశ్రయమాహ – వ్యతిరేకేతి. జాగ్రదాదిష్వవస్థాసు జీవతయా వర్తంత ఇతి జీవవృత్తయో విశ్వతైజసప్రాజ్ఞాస్తేషు మాయామయేషు సాక్షితయా అన్వయః. సమాధ్యాదౌ చ వ్యతిరేకో యస్య, తద్బ్రహ్మసంసార ప్రతీతిబాధయోరధిష్ఠానావధిభూత మపాశ్రయ ఉచ్యత ఇత్యర్థః. (19)

శ్లో ॥ పదార్థేషు యథా ద్రవ్యం సన్మాత్రం రూపనామసు
బీజాది పంచతాన్తాసు హ్యవస్థాసు యుతాయుతమ్ – 20

టీ :– ఏతదేవ సదృష్టాంతం ప్రపంచయతి – పదార్థేష్వితి. పదార్థేషు ఘటాదిషు ద్రవ్యం మృదాది యథాయుతం అన్వితం అయుతం చ బహి రప్యవస్థానాత్ రపనామసు చ సన్మాత్రం సత్తామాత్రం యథా.

జాగ్రదాద్యవస్థలలో జీవునివలె నుండువారు విశ్వ, తైజస, ప్రాజ్ఞులు. మాయామయులైన వారిలో సాక్షివలె అన్వయించునదియు, సమాధ్యాదులో వ్యతిరేకముగ నుండునదియు అపాశ్రయమనబడును. (19)

'కుండ' మొదలైన పదార్థములలో మట్టి వంటి ద్రవ్యము అన్వయించుటయు, అన్వయించపోవుటయు సంభవించును. రూపము చేతను, పేరు చేతను మాత్రమే కుండ ఉండును. అట్లే గర్భాధానాది రూపమున దేహావస్థలో జీవుడు సాక్షిరూపమున ఉండుటయు, ఉండక పోవుటయు జరుగుచుండును. ఇదియే అపాశ్రయము. (20)



ఏవం బీజం గర్భాధానమాది ర్యాసాం పంచతా అన్తే చ యాసాం తాసు దేహావస్థాసు. శ్లో. "నిషేకగర్భజన్మాని బాల్యకౌమారయౌవనమ్, వయోమధ్యం జరా మృత్యురిత్యవస్థాస్తనో ర్నవ. ఏతాసు నవస్వపి అధిష్ఠానత్వేన సాక్షిత్వేన చ యుతమయుతం చ యత్. తదపాశ్రయ ఇతి. (20)

శ్లో ॥ విరమేత యదా చిత్తం హిత్వా వృత్తి త్రయం స్వయమ్
యోగేన వా తదాఽత్మానం వేదేహాయా నివర్తతే - 21

సృష్టి స్థితిలయములనెడి మూడు వృత్తులను మాయామయముగ భావించుట వలన తనకు తానే బుద్ధి వీనిని వదిలివేయును. దేవహూతి మొదలగువారు యోగము ననుష్ఠించి వీనిని తొలగించుకొన్నట్లని భావము. అప్పుడు విక్షేపము నశించును గాన ఆత్మను తెలిసికొనుటకు వీలగును. అవిద్య తొలగినప్పుడు సంసార రూపమైన ఈహ నశించును. (21)

టీ :- ఏవం దశాపి లక్షణాని వ్యాఖ్యాయ ఇదానీం. శ్లో. "దశమస్య విశుద్ధ్యర్థం నవానామిహ లక్షణం, వర్ణయంతి మహాత్మాన ఇతి యదుక్తం తదాహ - విరమేతేతి. యదా సర్గాదీనాం మాయామయత్వా నుసంధానేన వామదేవాదేరివ స్వయమేవ చిత్తం విరమేత్. ఇహైవా నుష్ఠితేన యోగేన వా దేవహూత్యాదివత్. తదా విక్షేపాభావా దాత్మానం వేద తదా చావిద్యానివృత్తేః ఈహాయాః సంసారరూపాయా నివర్తత ఇత్యర్థః. (21)

శ్లో ॥ ఏవం లక్షణ లక్ష్యాణి పురాణాని పురావిదః
మునయోఽష్టాదశ ప్రాహుః క్షుల్లకాని మహాన్తి చ - 22

ఈ విధముగ పురాణములు దశ విధములగు లక్ష్య లక్షణములతో కూడియుండునని పూర్వవిదులు చెప్పుచున్నారు. ఈ మహా పురాణములు పదునెనిమిది కలవనియు చెప్పుచున్నారు. (22)



టీ :- పురాణవిభాగప్రస్తావేన తల్లక్షణాదికం ప్రాసంగిక ముక్త్వా ప్రస్తుతమాహ - ఏవమితి. ఏవంవిధైర్లక్షణైర్లక్ష్యాణి. (22)

శ్లో ॥ బ్రాహ్మం పాద్మం వైష్ణవం చ శైవం లైంగం సగారుడమ్
నారదీయం భాగవతమాగ్నేయం స్కాంద సంజ్ఞితమ్ - 23

శ్లో ॥ భవిష్యం బ్రహ్మవైవర్తం మార్కండేయం సవామనమ్
వారాహం మాత్స్యంకౌర్మంచ బ్రహ్మాండాఖ్యమితి త్రిషట్ - 24

శ్లో ॥ బ్రహ్మన్నిదం సమాఖ్యాతం శాఖా ప్రణయనం మునేః
శిష్య శిష్య ప్రశిష్యాణాం బ్రహ్మతేజోవివర్ధనమ్ - 25

టీ :- భవిష్యదితి. త్రిషట్ అష్టాదశ. (23)

టీ :- ఉపసంహరతి - బ్రహ్మన్నితి. మునేర్వ్యాసస్య శిష్యాదీనాం చ బ్రహ్మతేజో బ్రహ్మవర్చసం తద్వివర్ధనం శ్రోతౄణామితి శేషః. (24,25)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే ద్వాదశస్కంధే సప్తమోఽధ్యాయః**

బ్రహ్మ, పద్మ, విష్ణు, శివ, లింగ, గరుడ, నారద, భాగవత, అగ్ని, స్కాంద, భవిష్య, బ్రహ్మవైవర్త, మార్కండేయ, వామన, వరాహ, మత్స్య, కూర్మ, బ్రహ్మాండములనెడి పేర్లతో పదునెనిమిది పురాణములు కలవు.

ఈ పురాణ విభాగము వ్యాసునిచే చెప్పబడినది. ఇది వ్యాస శిష్యులు, వారి శిష్యుల బ్రహ్మ వర్చస్సును పెంపొందింపజేయగలదు. శ్రోతలకు కూడా తేస్సును ప్రసాదించును. (23,24,25)

**శ్రీమద్భాగవత మహాపురాణము యొక్క ద్వాదశస్కంధమునందలి సప్తమాధ్యాయము సమాప్తము.**



## అష్టమోऽధ్యాయః

**శౌనక ఉవాచ**

శ్లో ॥ సూత జీవ చిరం సాధో వదనో వదతాం వర
తమస్యపారే భ్రమతాం నృణాం త్వం పారదర్శనః - 1

టీ :- అష్టమే తు తపశ్చర్యా మార్కండేయస్య మోహకైః, కామాదిభిరసంమోఘో నరనారాయణస్తుతిః. పురాణవిభాగ ప్రసంగేన పురాణ కర్తుర్మార్కండేయస్య చరితం పృచ్ఛతి - సూతేతి. త్వమేవ వక్తుం యోగ్య ఇత్యాహ - తమసి సంసారే భ్రమతాం పారదర్శనస్తన్నివర్తకః (1)

శ్లో ॥ ఆహుశ్చిరాయుషమృషిం మృకండుతనయం జనాః
యః కల్పాన్తే ఉర్వరితో యేన గ్రస్తమిదం జగత్ - 2

టీ :- కర్తవ్యమాహ - ఆహురితి. ఉర్వరితః అవశిష్టః యేన కల్పాంతేన ఏతత్కథం ఘటత ఇత్యేకః ప్రశ్నః. (2)

శ్లో ॥ స వా అస్మత్కులోత్పన్నః కల్పేఽస్మిన్భార్గవర్షభః
నైవాధునాపి భూతానాం సంప్లవః కోఽపి జాయతే - 3

## అష్టమాధ్యాయము

**శౌనకుడు పలుకుచున్నాడు**

ఈ అష్టమాధ్యాయమున మార్కండేయుని తపశ్చర్య, కామాదులకు ఆతడు లొంగకపోవుట, నరనారాయణులస్తుతి వర్ణింపబడుచున్నది. పురాణ విభాగములను గూర్చి ప్రస్తావించుటచేత పురాణ కర్తయగు మార్కండేయుని చరితమును గూర్చి శౌనకుడు సూతుని ప్రశ్నించుచున్నాడు - ఓ సూతమునీ ! నీవు చిరకాలము జీవింపుము. మా ప్రశ్నలకు సమాధానము చెప్పగల సమర్థుడవు నీవే. అపారమైన అజ్ఞానమనెడి అంధకారములో కొట్టుమిట్టాడుచున్న నరులకు మార్గదర్శకుడవు నీవే ! (1)

కల్పాంతమున ఈ జగత్తు అంతయు నశించినను, మార్కండేయుడు చిరాయువై నిలిచియున్నాడని జనులు పలుకుచున్నారు. ఇదెట్లు సంభవించునో తెలుపుము.(2)

మా వంశమున ప్రభవించిన ఆ భార్గవుడు ఈ కల్పమున నున్న కారణముచేత ప్రాణులకు ప్రాకృతిక, నైమిత్తిక ప్రళయములు సంభవించుట లేదు. (3)



టీ :- ప్రలయాభావాదప్యేతన్నఘటత ఇత్యాహ - స ఇతి. యతో భార్గవర్షభః. కోఽపి ప్రాకృతికో నైమిత్తికో వా. (3)

శ్లో ॥ ఏక ఏవార్ణవే భ్రామ్యన్దదర్శ పురుషం కిల
వట పుత్రపుటే తోకం శయానం త్వేకమద్భుతమ్ - 4

ఆ మార్కండేయుడు సకలము ఏకావర్ణమై (ఒకే సముద్రముగ మాత్రమే నిలిచినదై) యుండగా, తిరుగుచు, ఒక మర్రియాకుపై పరుండియున్న ఆశ్చర్యజనకుడైన బాలుని చూచెను. (4)

టీ :- అన్యదప్యఘటితమేవేత్యాహ - ఏక ఇతి. తోకం బాలకం. (4)

శ్లో ॥ ఏ షనః సంశయోభూయాన్ సూత! కౌతూహలం యతః
తం నశ్ఛింధి మహాయోగిన్! పురాణేష్వపి సమ్మతః - 5

ఓ సూతమునీ! ఈ మా సంశయమును తొలగింపుము. మాకు తెలిసికొనవలెనను కుతూహలము మిక్కుటముగనున్నది. ఓ మహాయోగీ ! నీవు బహుపురాణజ్ఞుడవని ప్రసిద్ధిచెందియున్నావు కావున మా సంశయములను ఛేదింపగల సమర్థుడవు నీవే.(5)

టీ :- ఏష ఇతి. కౌతూహలం ఔత్సుక్యం తం సంశయం న కేవలం త్వం మహాయోగీ కిం తు పూర్వేణేష్వపి జ్ఞాతృత్వేన సమ్మతః. (5)

**సూత ఉవాచ**

శ్లో ॥ ప్రశ్నస్త్వయా మహర్షేఽయం కృతో లోక భ్రమాపహః
నారాయణ కథా యత్ర గీతా కలిమలాపహా - 6

**సూతుడు పలుకుచున్నాడు**

ఓ శౌనకమహర్షీ! నీవు అడిగిన ప్రశ్న సమస్తలోకుల భ్రమలను తొలగింపగలదు. కావున నీ ప్రశ్న అభినంద్యమైనది. నీ ప్రశ్నమున కలియుగములోని పాపములను తొలగించు విష్ణు కథ నిండియున్నది. (6)



టీ :- ప్రశ్నమభినందతి - ప్రశ్న ఇతి. హే మహర్షే అయం ప్రశ్నః తత్ర హేతుః. నారాయణేతి. యత్ర ప్రశ్నవిషయే. (6)

శ్లో ॥ ప్రాప్తద్విజాతి సంస్కారో మార్కండేయః పితుః క్రమాత్
ఛందాంస్యధీత్య ధర్మేణ తపః స్వాధ్యాయ సంయుతః - 7

టీ :- తత్ర మార్కండేయస్తపసా భగవంతమారాధ్య మాయా ప్రదర్శనం వవ్రే తతశ్చ తేనైవ భగవాన్మాయయా సప్తకల్పాః దృష్టాః నాన్యైరిత్యుక్తం వక్తుమాదిత ఆరభ్య తస్య చరితమాహ - ప్రాప్తేతి. మార్కండేయో మృత్యుం జిగ్య ఇతి పంచమశ్లోకేనాన్వయః. మధ్యమగ్రంథేన తస్య ధర్మః కథ్యతే ప్రాప్తో ద్విజాతిసంస్కారః ఉపనయనాఖ్యో యేన సః. పితుస్సకాశాత్ గర్భాధానాదిక్రమాత్ ఛందాంసి వేదాన్. (7)

శ్లో ॥ బృహద్వ్రతధర శ్శాన్తో జటిలో వల్కలాంబరః
బిభ్రత్కమండలుం దండముపవీతం సమేఖలమ్ - 8

టీ :- బృహద్వ్రతధరః నైష్ఠిక బ్రహ్మచారీ సన్.(8)

మార్కండేయుడు తపస్సుతో భగవంతుని ఆరాధించి, మాయా ప్రదర్శనమును కోరెను. అప్పుడతని కోరికపై భగవంతుడు తన మాయచే ఆతనికి సప్త కల్పములు చూపించెను. ఇతరులకెవ్వరికినీ లభింపని ఆ అదృష్టము మార్కండేయునకొక్కనికే లభించినదను విషయమును చెప్పబోవుచు సూతుడు మార్కండేయుని కథను సమగ్రముగ చెప్పదలచి ఇట్లనుచున్నాడు - ఓ శౌనక మునీ! మార్కండేయుడు ఉపనయనమనెడి ద్విజాతి సంస్కారమును పొందిన వాడై, తండ్రి వలన గర్భాధానాది సంస్కారములకు సంబంధించిన వేదమంత్రములను అధ్యయనమునొనర్చి తపస్సు, స్వాధ్యాయము మొదలైన నియమయములతో కూడియుండెను. (7)

మార్కండేయుడు నైష్ఠికబ్రహ్మచారియై, శాంతుడై, జటావల్కల ములను ధరించినవాడై, కమండలువును, దండమును, ఉపవీతమును, మేఖలను ధరించినవాడై యుండెను. (8)



శ్లో ॥ కృష్ణాజినం సాక్షసూత్రం కుశాంశ్చ నియమర్ధయే
అగ్న్యర్క గురువిప్రాత్మస్వర్చయన్ సంధ్యయోర్హరిమ్ - 9

టీ :- కృష్ణాజినమితి, సన్నియమర్ధయే ధర్మాభివృద్ధయే అగ్న్యాదిషు పంచసు హరిమర్చయన్. (9)

ధర్మమును వర్ధిల్లజేయుటకై మార్కండేయుడు జింకచర్మమును, అక్షమాలను, దర్భలను ధరించినవాడై, అగ్ని, సూర్య, గురు, బ్రాహ్మణ, ఆత్మలలో హరినే భావించుచు, ఉభయ సంధ్యలలో (ప్రాతస్సాయం కాలములలో) హరినే పూజించెను.(9)

శ్లో ॥ సాయం ప్రాతః స గురవే భైక్ష్యమాహృత్య వాగ్యతః
బుభుజే గుర్వనుజ్ఞాతః సకృన్నో చేదుపోషితః - 10

సాయం, ప్రాతః కాలములలో గురువుకొరకై భిక్షను తెచ్చి, ఆ గురువు ఆజ్ఞతో భుజించుచుండెను. గురువు అనుజ్ఞ లేనిచో, ఒక్కొక్క సమయములో ఉపోషితుడై (ఏ ఆహారమును స్వీకరింపనివాడై) యుండెను. (10)

శ్లో ॥ ఏవం తపః స్వాధ్యాయపరో వర్షాణామయుతాయుతమ్
ఆరాధయన్ హృషీకేశం జిగ్యే మృత్యుం సుదుర్జయమ్ - 11

ఈ విధముగ ఆ మార్కండేయుడు తపస్సు, స్వాధ్యాయములలో నిమగ్నుడై అనేక సంవత్సరములు హృషీకేశుడైన భగవంతుని ఆరాధించుచు, జయింపవీలుకాని మృత్యువును జయించెను. (11)

శ్లో ॥ బ్రహ్మా భృగుర్భవో దక్షో బ్రహ్మపుత్రాశ్చ యేఽపరే
నృదేవపితృభూతాని తేనాసన్నతివిస్మితాః - 12

టీ :- సాయమితి. భైక్ష్యం గుర్వర్థమాహృత్య తేనానుజ్ఞాతాశ్చేత్తర్హి బుభుజే నోచేత్సకృ త్కదాచిదుపోషితో భవతి. బ్రహ్మేతి - తేన మృత్యుంజయేన. (10,11,12)

మార్కండేయుని మృత్యుజయమును చూచి, బ్రహ్మదేవుడు, భృగువు, శివుడు, దక్షుడు, బ్రహ్మ మానస పుత్రులు, నరోత్తములు, పితృదేవతలు, సకల భూతములు ఆశ్చర్యమునకు లోనయ్యెను.(12)



శ్లో ॥ ఇత్థం బృహద్వ్రతధరస్తపః స్వాధ్యాయ సంయమైః
దధ్యావధోక్షజం యోగీ ధ్వస్తక్లేశాన్త రాత్మనా - 13

ఈ విధముగ ఆ మార్కండేయుడు బ్రహ్మవ్రతములను దాల్చిన వాడై, తపః స్వాధ్యాయ సంయమియై, రాగద్వేషాదిక్లేశములు లేనివాడై, యోగియై అధోక్షజుడైన భగవంతుని హృదయమున నిలుపుకొనెను. (13)

శ్లో ॥ తస్యైవం యుంజతశ్చిత్తం మహాయోగేన యోగినః
వ్యతీయాయ మహాన్‌కాలో మన్వంతర షడాత్మకః - 14

టీ :- ఇత్థమితి. యోగేన ధ్వస్తాః క్లేశాః రాగాదయో యస్య తేన అంతరాత్మనా ప్రత్యాహృతేన మనసా. (13,14)

మహాయోగముతో కూడియున్నవాడైన యోగియగు ఆ మార్కండేయుడు ఆరు మన్వంతరముల మహాకాలమును దాటిన వాడయ్యెను. (14)

శ్లో ॥ ఏతత్పురందరో జ్ఞాత్వా సప్తమేஉస్మిన్ కిలాంతరే
తపోవిశంకితో బ్రహ్మన్నారేభే తద్విఘాతనమ్ - 15

టీ :- తస్య తపోనిష్ఠామితిహాసేన వర్ణయతి - ఏతదితి. అస్మిన్ సప్తమే మన్వంతరే. తమసా మత్పదం గ్రహీష్యతీతి విశంకితః(15)

మార్కండేయుడు ఏడవ మన్వంతరములోనికి అడుగుపెట్టగా, ఇంద్రుడు ఆ మార్కండేయుని తపస్సునకు భయపడినవాడై, ఆతడు తన ఇంద్రపదవిని తీసికొనునేమో అను సందేహముతో ఆతని తపస్సును భంగము చేయబూనుకొనెను. (15)

శ్లో ॥ గంధర్వాప్సరసః కామం వసంతమాలయానిలౌ
మునయే ప్రేషయామాస రజస్తోకమదౌ తథా - 16

మార్కండేయుని తపస్సును భంగము చేయుటకు ఇంద్రుడు గంధర్వులను, అప్సరసలను, మన్మథుని, వసంతుని, మలయానిలమును, రజోగుణమునకు అతిప్రియసంతానమైన లోభ, మదములను పంపెను. (16)



శ్లో ॥ తే వై తదాశ్రమం జగ్ముర్హిమాద్రేః పార్శ్వ ఉత్తరే
పుష్పభద్రానదీ యత్ర చిత్రాఖ్యా చ శిలా విభో! - 17

టీ :- గంధర్వేతి. మునయే మునిం భ్రంశయితుం రజసోక్తం అతిప్రియమపత్యంలోభః మదశ్చతౌ. (16,17)

ఇంద్రునిచే పంపబడిన గంధర్వాదులు హిమాలయమునకు ఉత్తరభాగమున, పుష్పభద్రానదీతీరమున, చిత్రయనెడి శిల నెలకొన్న చోట గల మార్కండేయుని ఆశ్రయమునకు చేరుకొనిరి.(17)

శ్లో ॥ తదాశ్రమపదం పుణ్యం పుణ్యద్రుమలతాంచితమ్
పుణ్యద్విజకులాకీర్ణం పుణ్యామలజలాశయమ్ 18

టీ :- తదితి. తదాశ్రమపదం ప్రవిష్టో వాయుర్వవావితి తృతీయేనాన్వయః. పుణ్యైర్ద్రుమైర్లతాభిశ్చార్చితం పూజితం పుణ్యానాం ద్విజానామృషీణాం కులైరాకీర్ణం వ్యాప్తం పుణ్యా అత్యమలా జలాశయా యస్మిన్ తత్. (18)

పుణ్యప్రదములైన వృక్షములతోడను, లతలతోడను పూజింపబడునదియు, పుణ్యాత్ములైన ఋషులచే కూడినదియు, పుణ్యప్రదములును, నిర్మలములును అయిన జలాశయములతో నిండినదియు అయిన ఆ మార్కండేయాశ్రమమును వారు చేరుకొనిరి. (18)

శ్లో ॥ మత్తభ్రమర సంగీతం మత్తకోకిలకూజితమ్
మత్తబర్హినటాటోపం మత్తద్విజకులాకులమ్ - 19

టీ :- మత్తేతి. మత్తభ్రమరాణాం సంగీతం యస్మిన్. మత్తకోకిలానాం కూజితం యస్మిన్ మత్తా బర్హిణ ఏవ నటాస్తేషామాటోపః సంభ్రమో యస్మిన్. మత్తద్విజానాం పక్షిణాం కులై రాకులం వ్యాప్తం. (19)

ఆ మార్కండేయాశ్రమమున మత్తెక్కిన తుమ్మెదలు ఝుంకారములు చేయుచుండెను. మత్తకోకిలలు మధురముగా కూయుచుండెను. మత్తెక్కిన నెమళ్ళు నటులై నృత్యములొనర్చుచుండెను. మత్తెక్కిన పక్షులు కిలకిలరావములు చేయుచుండెను. (19)



శ్లో ॥ వాయుః ప్రవిష్ట ఆదాయ హిమనిర్ఝర శీకరాన్
సుమనోభిః పరిష్వక్తో వవాయుత్తంభయన్ స్మరమ్ - 20

టీ :- వాయురితి. ఏవం భూతం తదాశ్రమపదం ప్రవిష్టస్సన్ వాయుర్మలయానిలో వవౌ ప్రససార. ఉత్తంభయన్నుద్దీపయన్. తత్ర వృక్షేషు ప్రవేశాన్మాంద్యం హిమనిర్ఝరకణానామాదానాచ్ఛైత్యం పుష్పపరిష్వంగాత్సౌరభ్యం చోక్తం. (20)

ఈ విధముగ మనోహరమైయున్న ఆ ఆశ్రమములోనికి మంచుకొండలపై నుండి ప్రవహించు వాగులపై నుండి నీటి తుంపరలతో కూడి వీచుచున్న మలయానిలము మదన తాపమును పురిగొల్పుచు వీచుచుండెను. దీని కారణముగానే చెట్లలో మాంద్యము (మత్తెక్కిన తీరు), మంచుకొండల వాగులలో చల్లదనము, పుష్పములలో సౌగంధ్యము వెల్లువెత్తినదని తాత్పర్యము.(20)

శ్లో ॥ ఉద్యచ్చంద్రనిశావక్త్రః - ప్రవాలస్తబకాలిభిః
గోపద్రుమలతాజాలై స్త త్రాసీత్కుసుమాకరః - 21

టీ :- కించ. ఉద్యదితి. ఉద్యన్ చంద్రో యస్మిన్ తత్. నిశా వక్త్రం రజనీముఖం యస్మిన్ సః ప్రవాలస్తబకానామాలయః శ్రేణయో యేషు తైః గుప్యంతి విటపైః సంశ్లిష్యంతీతి గోపాః ద్రుమాః లతాశ్చ తేషాం జాలైః సమూహైరుపలక్షితః. కుసుమాకరః వసంతః ఆసీత్ ఆవిర్బభూవ. (21)

ఉదయించుచున్న చంద్రునితో కూడిన రజనీముఖము (సాయం సంధ్యాకాలము) గలవాడై, చిగురుగుత్తుల వరుసలు గల వృక్షములు గలవాడై, పైన వేసుకొనియున్న లతావృక్షములు గలవాడై వసంతుడు ఆ వనములో ఆవిర్భవించెను.(21)

శ్లో ॥ అన్వీయమానో గంధర్వైర్గీత వాదిత్ర యూథకైః
అదృశ్యతాత్త చాపేషుః స్వః స్త్రీయూథపతిః స్మరః - 22

గాయకాది సమూహములతో కూడిన గంధర్వులతో అనుసరింపబడినవాడై, అప్సరసగణములతో కూడిన వాడై, కనబడని



టీ :- కించ. అన్వీయమాన ఇతి. తదా గీతవాదిత్రయూథికైః గాయకాదిసముదాయిభిః గంధర్వైరన్వీయమానః. తథా స్వస్తి యోఽప్సరసస్తాసాం యూథస్య పతిః. ఆత్తః చాప ఇషుశ్చ యేన సః స్మరశ్చ తత్రాదృశ్యత. (22)

ధనుర్బాణములు గలవాడై మన్మథుడు కూడ ఆ ఆశ్రమములో ప్రవేశించెను. (22)

శ్లో ॥ హుత్వాగ్నిం సముపాసీనం దదృశుః శక్ర కింకరాః
మీలితాక్షం దురాధర్షం మూర్తిమన్తమివానలమ్ - 23

శ్లో ॥ ననృతుస్తస్య పురతః స్త్రియోఽథో గాయకాజగుః
మృదంగవీణాపణవైర్వాద్యం చక్రుర్మనోరమమ్ - 24

టీ :- హుత్వేతి. దురాధర్షం అభిభవితుమశక్యం. (23,24)

హోమములను నెరవేర్చి, కన్నులు మూసికొని, అగ్నివలె అమిత తేజస్సుతో ప్రకాశించుచున్నవాడై, లొంగదీసికొనుటకు సాధ్యము కాని రీతిలో తపస్సు చేయుచున్న ఆ మార్కండేయుని ఇంద్రుని సేవకులు చూచిరి. ఆ మార్కండేయుని ఎదుట స్త్రీలు నృత్యములు చేసిరి. గాయకులు గీతములనాలపించిరి. మృదంగము, వీణ, పణవము మొదలైన వాద్యములను మనోహరముగ ప్రయోగించిరి. (23,24)

శ్లో ॥ సందధేఽస్త్రం స్వధనుషి కామః పంచముఖం తదా
మధుర్మనో రజస్తోక ఇంద్రభృత్యా వ్యకంపయన్ - 25

శ్లో ॥ క్రీడంత్యాః పుంజికస్థల్యాః కందుకైః స్తనగౌరవాత్
భృశముద్విగ్న మధ్యాయాః కేశవిస్రంసితస్రజః - 26

మన్మథుడు తన ధనుస్సునెక్కుపెట్టి, శోషణము, దీపనము, సమ్మోహనము, తాపనము, ఉన్మాదనము అను అయిదు ముఖములు గల బాణములను ప్రయోగించెను. వసంతుడు పుష్పాదులతోడను, ఇంద్రుని సేవకులు కామోద్దీపన సామగ్రులతోడను మార్కండేయుని మనస్సును చలింపజేయుటకు యత్నించిరి. నాట్యములు చేయుచున్న విలాసినులు స్తనముల బరువుతో బంతులాడుచు విలాసముతో కూడిన



టీ :- సందధ ఇతి. శోషణమోహన సందీపనతాపనోన్మాదనాఖ్యాని పంచముఖాని యస్య తదస్త్రం. సందధే తదైవ మధుర్వసంతః. రజస్తోకశ్చ పుంస్త్వమార్షం. అన్యేచేంద్రభృత్యాః. తస్య మనో వ్యకంపయన్. కిం చ. క్రీడంత్యా ఇతి.(25, 26)

నడుములు గలవారై, శిరోజములనుండి పువ్వులు జారి పడుచుండగా తమ హొయలను ప్రదర్శించిరి. (25,26)

శ్లో ॥ ఇతస్తతో భ్రమద్దృష్టేశ్చలన్త్యా అనుకందుకమ్
వాయుర్జహార తద్వాసః సూక్ష్మం తృటితమేఖలమ్ - 27

బంతుల వెంబడి పరుగెత్తుచు, చంచల నేత్రములతో కూడిన ఆ విలాసినుల సూక్ష్మములైన మొలత్రాళ్ళు తెగిపోగా, వారు ధరించిన వస్త్రములను గాలి అపహరించెను. (27)

టీ :- తత ఇతి. వాయేర్మలయానిలః పుంజికస్థల్యాః తత్సూక్ష్మం వాసో జహార. (27)

శ్లో ॥ విససర్జ తదా బాణం మత్వాతం స్వజితం స్మరః
సర్వం తత్రాభవన్మోఘమనీశస్య యథోద్యమః - 28

అప్పుడు మన్మథుడు ఆ మార్కండేయుని వశపరచుకొన్నట్లు భావించి, బాణమును విడిచెను. కాని దురదృష్టవంతుని ప్రయత్నము వ్యర్థమైనట్లు ఆ మన్మథుని ప్రయత్నము కూడ వ్యర్థమయ్యెను. (28)

టీ :- విససర్జేతి. సర్వం తేషాం కర్మ తత్ర తస్మిన్ మోఘం వ్యర్థం అనీశస్య నిర్దైవస్య. (28)

ఈ విధముగ ఆ మార్కండేయునికి అపకారము తలపెట్టిన ఆ ఇంద్రసేవకులు, ఆ ముని యొక్క తేజస్సుచే దహింపబడినవారై, వెనుదిరిగి పోయిరి. (29)

శ్లో ॥ త ఇత్థమపకుర్వంతో మునేస్తత్తేజసా మునే
దహ్యమానా నివవృతుః ప్రబోధ్యాహిమివార్భకాః - 29



టీ :- త ఇతి. మునేరపకుర్వంతః ప్రతికూలమాచరంతః. హే మునే. (29)

శ్లో ॥ ఇతీంద్రానుచరైర్బ్రహ్మన్ధర్షితోఽపి మహామునిః
యన్నాగాదహమో భావం న తచ్చిత్రం మహత్సుహి -30

ఈ విధముగ ఇంద్రుని అనుచరులు ఎంత భాదించినను, అహంకారమునకు గురికాక, ఆ మార్కండేయుడు నిశ్చలుడై యుండెను. మహాత్ములకు ఇది చిత్రమేమియుకాదు.(30)

టీ :- స ఇతి. అహమః అహంకారస్య భావం వికారం. (30)

శ్లో ॥ దృష్ట్వా నిస్తేజసం కామం సగణం భగవాన్ స్వరాట్
శృత్వానుభావం బ్రహ్మర్షేర్విస్మయం సమగాత్పరమ్ - 31

మన్మథుడు వెలవెలబోయిన ముఖముగలవాడై, వెనుదిరుగగా, ఆతనిని, మరియు అతని అనుచరులను చూచిన ఇంద్రుడు బ్రహ్మర్షియగు ఆ మార్కండేయుని స్థిరచిత్తమునకు ఆశ్చర్యచకితుడయ్యెను. (31)

టీ :- దృష్ట్వేతి. నిస్తేజసం మ్లానవదనం స్వరాడింద్రః. (31)

శ్లో ॥ తస్యైవం యుంజతశ్చిత్తం తపః స్వాధ్యాయసంయమైః
అనుగ్రహాయావిరాసీన్నరనారాయణో హరిః - 32

తపస్సు, స్వాధ్యాయము, సంయమనము మొదలైన గుణములతో కూడియున్న ఆ మార్కండేయుని అనుగ్రహించుటకు విష్ణువు నరనారాయణుల రూపములో, ఆతని యెదుట ప్రత్యక్షమయ్యెను. (32)

టీ :- తస్యేతి. నరానారయణరూపో హరిః. (32)



శ్లో ॥ తౌ శుక్లకృష్ణౌ నవకంజలోచనౌ
చతుర్భుజౌ రౌరవవల్కలాంబరౌ
పవిత్రపాణీ ఉపవీతకం త్రివృ
త్కమండలుం దండమృజుంచ వైష్ణవమ్ - 33

టీ :- తావనువర్ణయతి - ద్వాభ్యాం. తావితి. రౌరవం కృష్ణాజినం వల్కలం చాంబరం యయోస్తౌ పవిత్రే పాణ్యోర్యయోస్తౌ త్రివృత్ త్రిగుణం నవతంతుకమితి వా. త్రివృద్బహిష్పవమానమిత్యాదౌ నవకే ప్రయోగాత్. ఉపవీతకం దధానౌ. (33)

ఆ నరనారాయణులు తెలుపు, నలుపు రంగు శరీరములు గలవారై, తామర రేకుల వంటి కన్నులు గలవారై, నాలుగు చేతులు, కృష్ణాజినమును, వల్కలాంబరములను (నారచీరలు) దాల్చిన వారై, పవిత్ర హస్తులై, పై వస్త్రములను దాల్చినవారై, తొమ్మిది పోగులతో కూడిన యజ్ఞోపవేతములను ధరించినవారై, దండకమండల ములను పట్టుకొన్నవారై, ఆవిర్భవించిరి. (33)

శ్లో ॥ పద్మాక్షమాలాముత జంతుమార్జనం
వేదంచ సాక్షాత్తపఏవ రూపిణౌ
తపత్తడిద్వర్ణ పిశంగరోచిషా
ప్రాంశూ దధానౌ విబుధర్షభార్చితౌ - 34

టీ :- పద్మేతి. జంతుమార్జనం సూక్ష్మతంత్వాదిమయం. వేదం చ దర్భముష్టిం. కించ. సాక్షాత్తప ఏవ తౌ. తత్ర హేతుః - తపత్తటిద్వర్ణం దీప్యమానవిద్యుత్సంకాశం యత్పిశంగం రోచిస్తేన రూపిణౌ మూర్తిమంతౌ. తాదృక్తేజోయుక్తమూర్తిభ్యాం తపోమయత్వేన ప్రకాశమానావిత్యర్థః. ప్రాంశూ ఉన్నతౌ. (34)

తామరపూసలతో కూడిన అక్షరమాలలను, జంతుచర్మములను దాల్చినవారై, దర్భలచే పవిత్రమైన పిడికిలిగలవారై, సాక్షాత్కరించిన తపస్సువలె కనబడుచున్నవారై, మెరుపులతో కూడిన మేఘములవంటి వర్ణముగలవారై, ఉన్నతులై, దేవతలచే స్తుతింపబడుచున్నవారై ఆవిర్భవించిరి. (34)



శ్లో ॥ తే వై భగవతోరూపే నరనారాయణావృషీ
దృష్ట్వా త్థాయాదరేణో చ్చైర్నమామాంగేన దండవత్ - 35

టీ :- తావితి. ఉచ్చైర్మహతా ఆదరేణ. (35)

ఆ నరనారాయణులను చూచి, మార్కండేయుడు గొప్ప ఆదరభావముతో లేచి, తన శరీరమును దండమువలె వంచినవాడై వారికి నమస్కారము చేసెను. (35)

శ్లో ॥ స తత్సందర్శనానంద నిర్వృతాత్మేంద్రియాశయః
హృష్టరోమాశ్రుపూర్ణాక్షో న సేహే తావుదీక్షితుమ్ - 36

టీ :- స ఇతి. తయోస్సందర్శనేన య ఆనందస్తేన నిర్వృతా ఉపశాంతా ఆత్మేంద్రియాశాయాః దేహేంద్రియమనాంసి యస్య సః నసేహేనాశక్నోత్. (36)

ఆ ఇరువురిని చూచిన ఆనందముతో శాంతించిన దేహేంద్రియ మనస్సులు గలవాడైన ఆ మార్కండేయుడు, తన మేనిలోని రోమములు ఆనందముచే నిక్కబొడుచుకోగా, ఆనందబాష్పములుగల కన్నులతో వారిని దర్శించుటకు సమర్థుడు కాలేకపోయెను. (36)

శ్లో ॥ ఉత్థాయ ప్రాంజలిః ప్రహ్వరౌత్సుక్యాదాశ్లిషన్నివ
నమో నమ ఇతీశానౌ బభాషే గద్గదాక్షరః - 37

టీ :- ఉత్థాయేతి. ఆశ్లిషన్ ఆలింగయన్నివ. (37)

వంగి నమస్కరించిన మార్కండేయుడు, పైకి లేచి, అంజలి ఘటించినవాడై, ఉత్సుకతతో ఆలింగనము చేసికొన్నవాని వలె నిలిచి, గద్గదమైన గొంతులతో, నమోనమః అని ఆ నరనారాయణులను సంబోధించెను. (37)

శ్లో ॥ తయోరాసనమాదాయ పాదయోరవనిజ్య చ
అర్హణేనానులేపేన ధూపమాల్యైరపూజయత్ - 38

ఆ ఇరువురికి ఆసనములను తెచ్చి, పాదములను కడిగి, అర్ఘ్యముతోడను, చందనాద్యనులేపనముతోడను, ధూప, పుష్పమాలాది



టీ :- తయోరితి. పాదయోరవనిజ్య పాదౌ ప్రక్షాల్య అర్ఘ్ణేన అర్ఘ్యేణ. (38)

సమర్పణతోడను పూజించెను. (38)

శ్లో ॥ సుఖమాసనమాసీనౌ ప్రసాదాభిముఖౌమునీ
పునరానమ్య పాదాభ్యాం గరిష్ఠావిదమబ్రవీత్ - 39

సుఖమయములగు ఆసనములపై కూర్చొని, ప్రసన్నులైయున్న ఆ మునిశ్రేష్ఠుల పాదములకు మరల నమస్కరించి, మార్కండేయుడు ఇట్లు పలికెను. (39)

టీ :- సుఖమితి. పాదాభ్యాం పాదావనమ్య. గరిష్ఠౌ పూజ్యతమౌ ప్రతి. (39)

**మార్కండేయ ఉవాచ**

శ్లో ॥ కిం వర్ణయే తవ విభో! యదుదీరితోऽసుః
సంస్పందతే తమను వాఙ్మన ఇంద్రియాణి
స్పందంతివై తనుభృతామజశర్వయోశ్చ
స్వస్యాప్యథాపి భజతామసి భావబంధుః 40

ఓ ప్రభూ! నిన్ను గూర్చి నేనేమి వర్ణింపగలను? నీ ప్రేరణతోడనే ప్రాణములు స్పందించుచున్నవి. వానిననుసరించి వాక్కు, మనస్సు, ఇంద్రియములు స్పందించుచున్నవి. కేవలము మానవులకే గాక, బ్రహ్మ రుద్రాల హృదయములు కూడ స్పందించును. నీవు మానవుల ఆత్మ బంధువైయున్నావు. తల్లిదండ్రులవలె కేవలము శారీరక బంధువుకాదు. నీ దయాళుత్వము అమోఘము ! (40)

టీ :- అంతర్యామిణస్తస్యైవ ప్రాణాదిప్రవర్తకత్వాదాత్మనః స్తుతావ స్వాతంత్ర్యం పశ్యన్నాహ - కిమితి. హే విభో. తవ త్వాం. కిమహం వర్ణయే కథం స్తౌమి. యద్యేన త్వయైవ ఉదీరతః ప్రేరితః అసుః ప్రాణః. సంస్పందతే ప్రవర్తతే. తమనుచ వాగాదయః స్పందతి. అత్ర



హేతుః – వై. అన్వయవ్యతిరేకాభ్యాం "శ్రోత్రస్య శ్రోత్రమి" త్యాది శ్రుతిభిశ్చ ఏతత్ప్రసిద్ధమిత్యర్థః. న కేవలం ప్రాకృతానాం తనుభృతాం. కింతు. అజశర్వయోశ్చ. అతః స్వస్య మమాపి తథైవ ఏవం యద్యపి న క్వచిదపి కస్యాపి స్వాతంత్ర్యం అథాపి దారుయంత్రవత్స్వప్రవర్తితైరపి వాగాదిభిర్భజతాం పుంసాం. త్వం భావబంధురాత్మబంధురపి న తు పిత్రాదివద్దేహమాత్రబంధుః అహోకృపాలతాతవేత్యర్థః. (40).

శ్లో ॥ మూర్తీఇమే భగవతో భగవంస్త్రిలోక్యాః
క్షేమాయ తాపవిరమాయ చ మృత్యుజిత్యై
నానా బిభర్ష్యవితుమన్యతనూర్యథేదం
సృష్ట్వా పునర్గ్రససి సర్వమివోర్ణనాభిః – 41

ఓ భగవంతుడా! నీ యీ స్వరూపములు ముల్లోకముల క్షేమమునకు, దుఃఖవినాశనమునకు, మోక్షమునకు ఉద్దేశించినవేగాని, మరొకటికాదు. విశ్వపాలనమునకై మత్స్య, కూర్మాద్య వతారముల నెత్తినావు. కేవలము విశ్వపాలనమేకాదు. సృష్టి, లయములను సైతము ఊర్ణనాభి (సాలెపురుగు) వలె ఎవరి ప్రమేయములేకయే స్వయముగా నొనర్తువు. (41)

టీ :– నను కథమావాం ప్రాణాదిప్రవర్తకౌ. ధర్మపుత్రత్వాదా వయోరితి చేన్నకస్యాపి పుత్ర ఇత్యాహ – మూర్తీ ఇతి. హే భగవన్. భగవతస్తవ ఇమే మూర్తీ. త్రిలోక్యాః క్షేమాయ పాలనాయ. తాపవిరమాయ చ దుఃఖనివృత్త్యై మృత్యుజిత్యై మోక్షాయ చ. న తు త్వం కస్యాపి పుత్ర ఇత్యర్థః. అత్ర దృష్టాంతః– యథేదం విశ్వమవితుం అన్యాస్త నూర్మూర్తీర్మత్స్య కూర్మాది లక్షణాః. నానా అనేక ప్రకారాః బిభర్షి. తద్వత్. న కేవలం పాలనాదిమాత్రం తవ కర్మ కింతు సృష్టిప్రలయా



వపీత్యాహ–సృష్ట్వేతి. తత్రాప్యన్య నిరపేక్షత్వే దృష్టాంతః– ఊర్ణనాభి రివేతి. (41)

శ్లో ॥ తస్యావితుః స్థిరచరేశితురంఘ్రిమూలం
యత్థ్సం న కర్మగుణకాలరజః స్పృశన్తి
యద్వై స్తువన్తి నినమంతి యజంత్యభీక్ష్ణం
ధ్యాయన్తి వేదహృదయా మునయస్తదాప్త్యై - 42

టీ :– యస్మాదేవంభూతస్త్వం తస్మాత్తవాంఘ్రిమూలం భజామీత్యాహ – తస్యేతి. తస్యావితుః పాలకస్య. స్థావరజంగమానా మీశ్వరస్య అంఘ్రిమూలం భజామీతి తృతీయశ్లోకేనానుషంగః. కథంభూత మంఘ్రిమూలం. యత్థ్సం యత్ర స్థితం కర్మగుణ కాలానాం రజః మలం. అన్యే చ పూర్వోక్తాస్తాపాదయః. న స్పృశంతి. రుజ ఇతి వా పాఠః. యతః వేదాః హృదయే యేషాం తే వేదతాత్పర్యవిదో మునయః . యదేవ స్తువంతి. నితరాం నమంతి. తత్ప్రాప్తయే వః స్తవనాదీని కుర్వంతి. (42)

స్థావరజంగమముల పాలకుడవైన నీ పాదమూలమును సేవింతును. నీ పాదమూలము కర్మగుణకాలములను, రజస్సును అంటుకొని యుండదు. అనగా వానికి దూరమైయుండును. వేదతాత్పర్యములు తెలిసిన మునులు నీ పాదమూలమును స్తుతింతురు. నమస్కరింతురు. ధ్యానింతురు. దానిని పొందుటకై యాగములొనర్తురు. (42)



శ్లో ॥ నాన్యం తవాంఘ్ర్యుపనయాదపవర్గమూర్తేః
క్షేమం జనస్య పరితోభియ ఈశ విద్మః
బ్రహ్మా బిభేత్యలమతో ద్విపరార్ధధిష్ణ్యః
కాలస్య తే కిముత తత్కృతభౌతికానామ్ - 43

టీ :- తతో౽న్యః పురుషార్థో నాస్తీత్యాహ- నాన్యమితి. తవ అంఘ్ర్యుపనయాత్ శ్రీమచ్చరణప్రాప్తేః. అన్యం క్షేమం న విద్మః. పరితః సర్వేష్వపి లోకేషు భీర్యస్య తస్య జనస్య. తదేవాహ - ద్విపరార్ధం ధిష్ణ్యం స్థానం యస్య సః. బ్రహ్మాపి. తే కాలస్యత్వద్భ్రూ విజృంభరూపాత్ కాలాదలంబిభేతి. అతః కిమువక్తవ్యం తేనైవ బ్రహ్మణా కృతానాం భౌతికానాం ప్రాణినాం భయమితి. (43)

అపవర్గమూర్తివైన నీయొక్క పాదమూలమును చేరుట కంటె మరియొక్క క్షేమంకరమగు విషయమేదియులేదు. సమస్తలోకములలో భీతినొందు వారికి నీ పాదమూలమే శరణ్యము. ఉన్నతస్థానమున నుండు బ్రహ్మదేవుడు కూడ నీ కనుబొమ్మల కదలిక వంటి కాలమునకు భయపడును. ఇక, బ్రహ్మ సృష్టించిన భౌతిక ప్రాణులను గూర్చి ఏమని చెప్పవలెను? (43)

శ్లో ॥ తద్వై భజామ్యృతధియస్తవ పాదమూలం
హిత్వేదమాత్మచ్ఛది చాత్మగురోః పరస్య
దేహాద్యపార్థమసదన్త్య మభిజ్ఞ మాత్రం
విందేత తే తర్హి సర్వమనీషితార్థమ్ - 44

టీ :- యస్మాదేవం. తదితి. తత్తస్మాతవ పాదమూలమేవ భజామి. కథంభూతస్య ఋతధియః సత్యజ్ఞానస్వరూపస్య. యద్వా. ఋతా

సత్యజ్ఞాన స్వరూపుడవు, జీవనియామకుడవు, ఆత్మావరకమైన తుచ్ఛమగు అజ్ఞానరూపమైన, నశ్వరదేహాది రూపమైన అభిమానమును భేదించుటవలన పొందదగినవాడవు అయిన నిన్ను అపవర్గ ప్రాప్తికొరకై భజించువారు, నీ వలన తాము కోరిన ప్రయోజనములనెల్ల పొందగలరు. (44)

సత్యా. ధీరస్యయస్మిన్యాతస్య ఆత్మగురోర్జీవనియంతుః. అతః కారణాత్పరస్య కిం కృత్వా. ఆత్మఛదిం స్వాత్మావారకం. అపార్థం చ నిష్ఫలం అసచ్ఛ తుచ్ఛం. అంత్యం చ నశ్వరం ఇదం దేహగేహాదికం హిత్వా దేహాదిభజనం త్యక్త్వా. అసచేత్కథం ప్రతీయతే తత్రాహ – అభిజ్ఞమాత్రం న హ్యత్యంతమసత్ కిం త్వాత్మమాత్రం నతతః పృథగస్తీత్యర్థః. నన్వపవర్గాయ భవతు మద్భజనం ఫలాంతరార్థం త్వన్యభజనం కార్యమేవ తత్రాహ – తర్హీతి. యది త్వాం భజతి పురుషః . తర్హి త్వత్త ఏవ సర్వం మనీషితమర్థం విందేతేతి. (44)

శ్లో ॥ సత్త్వం రజస్తమ ఇతీశ! తవాత్మబంధో
మాయామయాః స్థితిలయోదయహేతవోఽస్య
లీలా ధృతా యదపి సత్త్వమయీ ప్రశాన్త్యై
నాన్యే నృణాం వ్యసనమోహభియశ్చ యాభ్యామ్ – 45

టీ :– నను బ్రహ్మరుద్రావపి మమైవ మూర్తీ. అతో మామైవ కిమిత్య త్యంతమాద్రియసే? తత్రాహ – సత్త్వమితి. యదపి యద్యపి తవైవ మాయయా కృతాః. ఏతాః లీలాః త్వయైవ ధృతాః. తథాపి యా సత్త్వమయీ సైవ ప్రశాంత్యై మోక్షాయ న కేవలం ప్రశాంత్యభావ మాత్రమన్యభజనే కింత్వనిష్టం చ కిందన్యథాత్వే భవేదిత్యాహ – వ్యసనేతి. (45)

ఓ ఈశా! స్థితి, లయ, సృష్టి హేతువులైన సత్త్వరజస్తమస్సులు నీ మాయతో కూడినవే. అయినను సత్త్వమయమగు నీ లీలయే మోక్షమునకు దారిచూపును. కావున నీ పాదమూలమునే ఆశ్రయించు చున్నాము. (45)



శ్లో ॥ తస్మాత్త్వేహ భగవన్నథ తావకానాం
శుక్లాం తనుం స్వదయితాం కుశలా భజన్తి
యత్సాత్త్వతాః పురుష రూపముశన్తి సత్త్వం
లోకో యతోఽభయముతాత్మసుఖం న చాన్యత్ - 46

టీ :- తదేవ సదాచారేణ ద్రఢయతి - తస్మాదితి. హే భగవన్. తవ శుక్లాం తనుం శ్రీనారాయణాఖ్యాం. అథ తావకానాం చ శుక్లాం తనుం నరాఖ్యాం యద్యస్మాత్ సాత్త్వతాః. సత్త్వమేవ పురుష్యస్యాధీశ్వరస్య రూపముశంతి మన్యం తే. నత్వన్యత్. రజస్తమశ్చేతి. అత్ర హేతుః. యతః సత్వాత్. లోకో వైకుంఠాఖ్యః లోకత్వే సత్యప్యభయం చ భోగే సత్యప్యాత్మసుఖం చ. (46)

ఓ భగవంతుడా ! నారాయణాఖ్యమగు, నీ తెల్లని రూపమును, నరాఖ్యమగు నీవారి తెల్లని రూపమును సత్త్వగుణముగలవారు పురుష శ్రేష్ఠుడవైన నీ రూపముగనే భావింతురు. అంతేగాని, రజస్తమో రూపములు నీ రూపములు గావు. ఏలయనగా సత్త్వరూపమువలననే ఈ లోకము వైకుంఠమగుచున్నది. అభయమగుచున్నది. ఆత్మసుఖ మయమగుచున్నది. (46)

శ్లో ॥ తస్మై నమో భగవతే పురుషాయ భూమ్నే
విశ్వాయ విశ్వగురవే పరదైవతాయ
నారాయణాయ ఋషయే చ నరోత్తమాయై
హంసాయ సంయతగిరే నిగమేశ్వరాయ - 47

టీ :- అతస్తం ప్రణమతి. - తస్మా ఇతి. హంసాయ శుద్ధాయ సంయతగిరే నియమితవాచే. అథ చ. నిగమేశ్వరాయ వేదమార్గ ప్రవర్తకాయ. (47)

భగవంతుడవు, పురుషోత్తముడవు, అన్నింటికి ఆధారమైన వాడవు, విశ్వరూపుడవు, విశ్వగురుడవు, పరదైవమవు, నారాయణుడవు, నరోత్తముడవు, ఋషివి, నిగమవేద్యుడవు, శుద్ధుడవు, వేదమార్గ ప్రవర్తకుడవు అయిన నీకు నమస్కారము.(47)



శ్లో ॥ యం వై న వేద వితథాక్షపథైర్భ్రమద్ధీః
సన్తం స్వఖేష్వసుషు హృద్యపి దృక్పథేషు
తన్మాయయాఽవృతమతిః స ఉ ఏవ సాక్షాత్
ఆద్యస్తవాఖిల గురోరుపసాద్యవేదమ్ - 48

టీ :- వేదార్థసంప్రదాయప్రవర్తనే హేతుత్వం వదన్ స్తౌతి - యమితి. కపటేంద్రియమార్గైః. భ్రమద్ధీః విక్షిప్తబుద్ధిః పుమాన్ స్వేంద్రియాదిషు నియంతృత్వేన సంతమపి. యం త్వాం న వేద దృక్పథేషు విషయేషు బుద్ధివిక్షేపే హేతుః. తన్మాయయా తస్య తవైవ మాయయా. ఆవృతా అనాత్మనిష్ఠామతిర్యస్య. సఉ సోఽపి ఆద్య ఏవ పూర్వమజ్ఞాత్వైవ. అఖిలగురోస్తవ త్వత్ప్రవర్తితం వేదముపసాద్య ప్రాప్య. తం త్వాం సాక్షాద్వేద. (48)

కపటములైన ఇంద్రియముల మార్గములచేత భ్రమించుచు, వాని ఉచ్చులో పడిన మానవుడు ఇంద్రియములను నియంత్రించు వాడవైననిన్ను తెలిసికొనలేకున్నాడు. విషయలోలుడై, నీ మాయచే ఆవరింపబడిన వాడగుచు అవిద్వాంసుడై తిరుగాడు ఆ మానవుడు నీవు ప్రవర్తింపజేసిన వేదమును పొందిన తరువాత నిన్ను ప్రత్యక్షముగ తెలిసికొనుచున్నాడు. (48)

శ్లో ॥ యద్దర్శనం నిగమ ఆత్మరహః ప్రకాశం
ముహ్యన్తి యత్ర కవయోఽజపరా యతన్తః
తం సర్వవాద విషయ ప్రతిరూపశీలం
వందే మహాపురుషమాత్మ నిగూఢ బోధమ్ - 49

టీ :- వేదనైవ తద్ జ్ఞానమిత్యుపపాదయన్ప్రణమతి. - యదితి.

ఓ భగవంతుడా! నీ దర్శనము వేదమునందు సంభవించును. నీ దర్శనము ఆత్మతత్త్వమును ప్రకాశింపజేయును. బ్రహ్మాదులైన కవులు సాంఖ్యయోగాదులచే నిన్ను దర్శింపగోరినవారై మోహమునకు గురియగుచున్నారు. నీ స్వరూపము సాంఖ్యయోగాది సమస్త వాదాలకు అనుకూలమైనది. దేహాదులచే కప్పివేయబడుటచే నిగూఢమైనది. ఇట్టి సర్వోత్కృష్టుడైన నిన్ను నమస్కరించుచున్నాను. (49)

యస్య తవ దర్శనం నిగమే భవతి. కథంభూతం. ఆత్మనస్తవ రహః ప్రకాశకం సత్త్వ ప్రకాశకం. అస్య దుర్జ్ఞేయతామాహ - అజపరాః బ్రహ్మముఖ్యాః కవయోఽపి సాంఖ్యయోగాదిభిర్యతమానాః యత్ర త్వయి. స్వయం ముహ్యంతి. కుత ఇత్యత ఆహ - సర్వేషాం సాంఖ్యాదివాదానాం యే విషయాః భేదాదయస్తేషాం ప్రతిరూపం తత్తదనుసారి శీలం స్వభావో యస్య తం. కుతః ఆత్మనా దేహాది సంఘాతేన నిగూఢో బోధో యస్య తం. ఏవం భూతం మహాపురుషం త్వాం వద ఇతి. (49)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే ద్వాదశస్కంధే అష్టమోఽధ్యాయః**

**శ్రీమద్భాగవత మహాపురాణము యొక్క ద్వాదశస్కంధమునందలి అష్టమాధ్యాయము సమాప్తము.**



## నవమోఽధ్యాయః

**సూత ఉవాచ**

శ్లో ॥ సంస్తుతో భగవానిత్థం మార్కండేయేన ధీమతా
నారాయణో నరసఖః ప్రీత ఆహ భృగూద్వహమ్ - 1

టీ :- శ్లో. నవమే భగవన్మాయాదిదృక్షోర్దర్శనం ముహుః. మాయాశిశోర్లయాబ్ధౌ చ మునేర్నిర్వేశ నిర్గమైః. భగవతః పరితోష పూర్వకం తదపేక్షితవరదానం కథయితుమాహ - సంస్తుత ఇతి. (1)

**శ్రీ భగవానువాచ**

శ్లో ॥ భో భో బ్రహ్మర్షివర్యాసి సిద్ధ ఆత్మసమాధినా
మయి భక్త్యానపాయిన్యా తపః స్వాధ్యాయసంయమైః - 2

టీ :- భోభో ఇతి. ఆత్మసమాధినా చిత్తైకాగ్ర్యేణ. (2)

శ్లో ॥ వయంతే పరితుష్టాః స్మ త్వద్బృహద్వ్రతచర్యయా
వరం ప్రతీచ్ఛ భద్రం తే వరదేశాదభీప్సితమ్ - 3

## నవమాధ్యాయము

**సూతుడు పలుకుచున్నాడు**

ఈ నవమాధ్యాయమున భగవన్మాయను దర్శింపగోరిన మార్కండేయునికి భగవంతుడు తన మాయాస్వరూపమును చూపుట, మాయాశిశువైన బాలకృష్ణుడు (విష్ణువు) ప్రళయ సముద్రములో తేలియాడుట మొదలగు విషయములు వర్ణింపబడినవి.

మార్కండేయునిచే స్తుతింపబడిన భగవంతుడగు నారాయణుడు నరునితో కూడినవాడై ప్రీతితో భృగువునుద్దేశించి ఇట్లు పలికెను. (1)

**శ్రీభగవానుడు పలుకుచున్నాడు**

ఓయీ ! బ్రహ్మర్షి శ్రేష్ఠుడా! నీవు ఏకాగ్రచిత్తముతో సిద్ధుడవైనావు. నాపై అకుంఠితమైనభక్తితోడను, తపస్సు, స్వాధ్యాయము, సంయమనాదులతోడను నాయందే మనస్సు నిలిపినావు. (2)

నీ సుదీర్ఘ బ్రహ్మచర్యవ్రతమునకు మేము సంతృప్తులమైనాము (ఇచట బహువచనము 'సర్వదేవతలు' అనెడి అభిప్రాయముతో ప్రయోగింపబడినది) వరించవలసిన స్థానము నుండి నీ మనస్సులోని



టీ :- వయమితి. వయం తే పరితుష్టాస్మే ౯తి బహువచనం సర్వదేహాభిప్రాయేణ. వరదేశాదిత్యేకవచనం ద్వయోరైక్యాభిప్రాయేణ ప్రతీచ్ఛ గృహాణ. (3)

కోరికకు అనుగుణమైన వరమును స్వీకరింపుము. నీకు మంగళమగును. (3)

**ఋషిరువాచ**

శ్లో ॥ జితం తే దేవదేవేశ ! ప్రపన్నార్తి హరాచ్యుత!
వరేణైతావతాలం నో యద్భవాన్ సమదృశ్యత - 4

టీ :- జితమితి. వరేణ ఛందయతా త్వయా జితం. ఉత్కర్షో దర్శితః మమ తు వరాకాంక్షా నాస్తీత్యాహ - వరేణేతి. (4)

**మార్కండేయఋషి పలుకుచున్నాడు**

ఓ దేవదేవోత్తమా! ప్రసన్నుల ఆర్తిని హరించు అచ్యుతుడా! స్వచ్ఛందముగనే (నీ ఇష్టానుసారము) నీ మహిమను నాకు దర్శింపజేసితివి. నాకు ఏ వరమును కోరుకొనుటపై ఇచ్ఛలేదు.(4)

శ్లో ॥ గృహీత్వాజాదయో యస్య శ్రీమత్పాదాబ్జదర్శనమ్
మనసా యోగపక్వేన స భవాన్మేౖక్ష గోచరః - 5

టీ :- వాంఛతీతి. యస్య తవ. శ్రీమత్పాదాబ్జదర్శనం. అజాదయో బ్రహ్మాదయో వాంఛంతి. స భవాన్. మే అక్షిగోచరో జాతోౖ సి కిమతఃపరం వరేణేత్యర్థః. (5)

ఓ భగవంతుడా! బ్రహ్మాదిదేవతలు మనస్సులో నిన్ను దర్శించి కృతార్థులగుచుండగా, అట్టి నీవు నా కన్నులకు కనబడుట వలన వారికంటె మిన్నగా ధన్యుడనైనాను. ఇంతకంటె మించిన వరమేది యుండగలదు?(5)



ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శ్లో ॥ అథాప్యంబుజపత్రాక్ష ! పుణ్యశ్లోక శిఖామణే !
ద్రక్ష్యే మాయాం యయా లోకః సపాలో వేద సద్భిదామ్ - 6

టీ :- అథేతి. ద్రక్ష్యే ద్రష్టుమిచ్ఛామి. లోకపాలైః బ్రహ్మాదిభిస్సహితః అయం లోకో జనః. సద్భిదాం. సతి వస్తుని భిదాం భేదం యయా వేదేతి. (6)

తామరరేకుల వంటి కన్నులు గలవాడా ! పుణ్యశ్లోకుల యొక్క శిరోమణీ ! బ్రహ్మాదులతో కూడిన ఈ లోకము సత్యవస్తువునందు ఎట్లు భేదింపబడుచున్నదో, అట్టి మాయను చూడగోరుచున్నాను. (6)

**సూత ఉవాచ**

శ్లో ॥ ఇతీడితోఽర్చితః కామమృషిణా భగవాన్మునే!
తథేతి స స్మయన్ప్రాగాద్బదర్యాశ్రమమీశ్వరః -7

టీ :- ఇతీతి తథేతి. ద్రక్ష్యసీతి. స ఈశ్వరః స్మయన్ స్మయమానః ప్రాగాత్. సస్మయమితి పాఠాంతరే క్రియావిశేషణం. (7)

**సూతపౌరాణికుడు పలుకుచున్నాడు**

ఇట్లు ఆ ఋషిచే కోరబడిన భగవంతుడు - 'ఓ మునీ! అట్లే నీవు మాయను దర్శింపగలవు' అని నవ్వుచు పలికినవాడై, బదర్యాశ్రమమునకు వెళ్ళెను.(7)

శ్లో ॥ తమేవ చింతయన్నర్థమృషిః స్వాశ్రమ ఏవ సః
వసన్నగ్న్యర్క సోమాంబు భూ వాయు వియదాత్మసు - 8

టీ :- తమితి. తమేవార్థం మాయాదర్శనరూపం అగ్న్యాద్యష్టమూర్తిషు. (8)

తాను చూడగోరిన మాయాదర్శనమును గూర్చియే ఆలోచించుచు, ఆ ముని తన ఆశ్రమములోనే అగ్ని, సూర్య, చంద్ర, జల, భూ, వాయు, ఆకాశ, ఆత్మలలో మాయను చూచుటకై వేచి యుండెను. (8)



శ్లో ॥ ధ్యాయన్ సర్వత్ర చ హరిం భావద్రవ్యైరపూజయత్
క్వచిత్పూజాం విసస్మార ప్రేమ ప్రసర సంప్లుతః - 9

టీ :- ధ్యాయన్నితి. భావద్రవ్యైః మనోమయైర్ద్రవైః క్వచిత్ కదాచిత్. భక్తిప్రసరసంప్లుతః భక్త్యుద్రేకవ్యాప్తః. (9)

ఆ ముని అంతట హరినే ధ్యానించుచు, మనోమయములైన ద్రవ్యములతోడనే పూజించెను. ఒక్కొక్కసారి ప్రేమోద్రేకమును పొందిన వాడై పూజను సైతము మరచిపోయెను. (9)

శ్లో ॥ తస్యైకదా భృగుశ్రేష్ఠ! పుష్పభద్రాతటే మునేః
ఉపాసీనస్య సంధ్యాయాం బ్రహ్మన్వాయురభూన్మహాన్ - 10

టీ :- మాయాదర్శనమాహ - తస్యేతి. (10)

ఒకనాడు ఆ ముని పుష్పభద్రానదీ తీరములో సంధ్యా సమయములో ఉపాసనాతత్పరుడై యుండగా, ప్రచండ వాయువు వీచెను. (10)

శ్లో ॥ తం చండ శబ్దం సముదీరయన్తం
బలాహకా అన్వభవన్కరాలాః
అక్షస్థవిష్ఠా ముముచుస్తడిద్భిః
స్వనంత ఉచ్చైరభివర్షధారాః - 11

టీ :- తమితి. తం వాయుమను బలాహకా మేఘాః అభవన్ ఆవిర్బభూవుః. తేచ తటిద్భిః విద్యుద్భిస్సహితాః. ఉచ్చైః స్వనంతో గర్జంతః. అక్షో రథాంగం తద్వత్ స్థవిష్ఠాః అభితో వర్ష ధారాఃముముచు. (11)

ఆ ప్రచండవాయు శబ్దమును ఆ ముని వినుచున్నంతలోనే దట్టముగా కాలమేఘములు క్రమ్ముకొనెను. అవి మెరుపులతో గర్జించుచున్నవై, రథముల ఇరుసుల వంటి జలధారలతో వర్షించినవి. (11)



శ్లో ॥ తతో వ్యదృశ్యన్త చతుః సముద్రాః
సమన్తతః క్ష్మాతలమాగ్రసన్తః
సమీరవేగోర్మిభిరుగ్రనక్ర
మహాభయావర్త గభీరఘోషాః - 12

టీ :- తత ఇతి. చతుర్దిక్షు వర్తమానాః. సముద్రాః. సమీరవేగేన ఊర్మయస్తైర్భూతలం ఉద్గ్రసంతః. ఉగ్రా నక్రా యేషు. భయానకా ఆవర్తా యేషు. గభీరః ఘోషో యేషు. తే చ తే చ తే చ. (12)

శ్లో ॥ అంతర్బహిశ్చాద్భిరతిద్యుభిః స్వఖరైః
శతహ్రదాభీరుపతాపితం జగత్
చతుర్విధం వీక్ష్య సహాత్మనా మునిః
జలాప్లుతాం క్ష్మాం విమనాః సమత్రసత్ - 13

టీ :- అంతరితి. ఆత్మనా సహ జరాయుజాదిచతుర్విధం జగత్. అంతర్బహిశ్చోపతాపితం వీక్ష్య. క్ష్మాం చ జలాప్లుతాం వీక్ష్య. మునిః సమత్రసత్ భయం ప్రాప. కేనోపతాపితం. అద్భిః. కథం భూతాభిః అతిద్యుభిః అతిక్రాంతా ద్యౌర్యాభిః. ఖరైశ్చ సూర్యరశ్మిభిః వాయుభిర్వేతి శేషః, శతహ్రదాభిశ్చ విద్యుద్భిః. దీర్ఘమార్షం ఛందోనుసారేణ. (13)

అప్పుడు నలుదిక్కులలో నున్న సాగరములు ప్రచండవాయు వేగముచే ఆకర్షింపబడిన తరంగములుగలవై, భూతలమును మ్రింగివేయుచు, భయంకరములైన మొసళ్ళు గలవై, మహాభయమును గొలుపు సుడిగుండములు గలవై, గంభీరమైన హోరుగలవై విస్తరించుట ప్రారంభించినవి. (12)

ఆత్మతో కూడిన జరాయుజాదికమగు నాలుగు విధములుగ నున్న జగత్తు లోపల, వెలుపల తపించిపోవుటను, భూమి జలముచే మ్రింగి వేయబడుటను చూచిన ఆ ముని భయమునొందెను. అప్పుడు మెరుపులతో కూడిన వర్షములు ఆకసము నిండిపోయెను. సూర్యరశ్మి, వాయువులచేతను, మెరుపులచేతను సమస్తము పీడింపబడెను. (శతహ్రదాభిః అనుచోట దీర్ఘము ఛందస్సుననుసరించి ఋషి ప్రయుక్తమైనందువలన సాధువగును) (13)



శ్లో ॥ తస్యైవముద్వీక్షత ఊర్మిభీషణః
ప్రభంజనాఘూర్ణితవార్మహార్ణవః
అపూర్యమాణో వరషద్భిరంబుదైః
క్ష్మామప్యధాద్ద్వీపవర్షాద్రిభిః సమమ్ - 14

ప్రచండవాయువుచే చలించిపోయిన నీరుగలదైన మహాసాగరము భూమిని, ద్వీపములను, పర్వతములను సమానముగ కబళించి వేయుచుండగా ఆ ముని చూచెను.(14)

టీ :- తస్యేతి. ప్రభంజనేన ఆఘూర్ణితం ప్రకంపితం వాః ఉదకం యస్మిన్ సః. అప్యధాత్ ఛాదయామాస సమం సహ. (14)

శ్లో ॥ సక్ష్మాంతరిక్షం సదివం సభాగణం
త్రైలోక్యమాసీత్సహ దిగ్భిరాప్లుతమ్
స ఏక ఏవోర్వరితో మహామునిః
బభ్రామ విక్షిప్య జటాజడాంధవత్ 15

భూమియు, అంతరిక్షము, స్వర్గము, నక్షత్రసముదాయము, దిక్కులు ఈ విధముగ త్రిలోకములు నీటితో నిండిపోగా, భీతిల్లిన ఆ ముని జటలను విదల్చి, జడునివలె, గ్రుడ్డివానివలె తిరుగుచుండెను. (15)

టీ :- సక్ష్మేతి. సహసా సక్ష్మాంతరిక్షం భూమ్యంతరిక్షస్థప్రాణి సహితం. సదివం స్వర్గస్థదేవసహితం. భాగణార్జ్యోతిర్గణాః తైస్సహితం జటాః విక్షిప్య వికీర్య. (15)



శ్లో ॥ క్షుత్ త్రుట్ పరీతో మకరైస్తిమింగిలైః
ఉపద్రుతో వీచినభస్వతాహతః
తమస్యపారే పతితో భ్రమన్దిశో
న వేద ఖం గాం చ పరిశ్రమేషితః - 16

టీ :- క్షుదితి. పరిశ్రమేణ ఇషితః గతః వ్యాప్త ఇత్యర్థః. ఇషుసర్పణ ఇత్యస్మాత్. (16)

అప్పుడు ఆకలిదప్పులతో కూడిన వాడైన ఆ ముని మొసళ్ళు, తిమింగలముల వలన కలిగెడి అపాయములు గలవాడై, ఆకాశమును తాకుచున్న కెరటములచే అన్ని దిక్కులు అపారమైన చీకటిలో మునిగియుండగా ఆకాశమునుగాని, భూమినిగాని గుర్తింపలేక అటునిటు తిరుగుచు, అలసి పోయెను. (16)

శ్లో ॥ క్వచిద్గతో మహావర్తే తరలైస్తాడితః క్వచిత్
యదోభిర్భక్ష్యతే క్వాపి స్వయమన్యోన్యఘాతిభిః - 17

శ్లో ॥ క్వచిచ్ఛోకం క్వచిన్మోహం క్వచిద్దుఃఖం సుఖంభయమ్
క్వచిన్మృత్యుమవాప్నోతి వ్యాధ్యాదిభిరుతార్దితః -18

టీ :- క్వచిదితి. అన్యోన్యఘాతిభిః తద్భక్షణాయ పరస్పరం యుధ్యద్భిః. (17,18)

సుడులు తిరుగుచున్న సాగరమున నొకసారి మునుగుచు, ఒకసారి కెరటములచే కొట్టబడుచు, నీటిచే కబళింపబడుచు, పరస్పరతరంగములచే తాకిడికి గురియగుచు ఆ ముని ఒకసారి శోకమును, ఒకసారి మోహమును, ఒకసారి దుఃఖమును, ఒకసారి సుఖమును, ఒకసారి భయమును, ఒకసారి మృత్యువును, ఒకసారి వ్యాధులు మొదలైనవానిని ఎదుర్కొనుచుండెను.(17,18)

శ్లో ॥ అయుతాయుతవర్షాణాం సహస్రాణి శతాని చ
వ్యతీయుర్భ్రమతస్తస్మిన్ విష్ణుమాయావృతాత్మనః - 19

విష్ణుమాయా ప్రభావితుడైన ఆముని వందలు, వేలు, కోట్ల సంవత్సరములు ఇట్లు సంచరించుచునే యుండెను. (19)



టీ :- అయుతేతి. విష్ణుమాయయావృతాత్మన ఇతి స తథా దృష్టవానిత్యర్థః. (19)

శ్లో ॥ స కదాచిద్భ్రమంస్తస్మిన్ పృథివ్యాః కకుది ద్విజః
న్యగ్రోధపోతం దదృశే ఫలపల్లవశోభితమ్ - 20

ఆ ముని ఈ భూమిపై ఇట్లు తిరుగుచుండగా, ఒక సమయములో ఎత్తైన చోట కోమలమైన మర్రి చెట్టు కనబడెను. దాని యందు చిగుళ్ళు, పండ్లు విరాజిల్లుచుండెను. (20)

టీ :- స ఇతి. కకుది ఉన్నతప్రదేశే. న్యగ్రోధపోతం కోమలవటం (20)

శ్లో ॥ ప్రాగుత్తరస్యాం శాఖాయాం తస్యాపి దదృశే శిశుమ్
శయానం పర్ణపుటకే గ్రసంతం ప్రభయాతమః - 21

ఆ మర్రి చెట్టులోని ఈశాన్య దిక్కులో గల కొమ్మపైనున్న ఒక ఆకులో వెలుగులు విరజిమ్ముచున్న ఒక శిశువును ఆ ముని చూచెను. (21)

టీ :- ప్రాగితి. తస్యేశానదిక్శాఖాయాం. శిశుమపి. (21)

శ్లో ॥ మహామరకతశ్యామం శ్రీమద్వదనపంకజమ్
కంబుగ్రీవం మహోరస్కం సునాసం సుందరభ్రువమ్ - 22

ఆ శిశువు మరకత మణివలె నీల దేహముగలవాడై, రమణీయమైన ముఖపద్మముగలవాడై, శంఖమువంటి మెడగలవాడై, విశాలమైన వక్షఃస్థలముగలవాడై, చక్కని ముక్కుగలవాడై, అందమైన కనుబొమ్మలు గలవాడై యుండెను. (22)

టీ :- మహామరకతేతి. శ్రీమత్ రమ్యం వదనపంకజం యస్య తం కంబువత్త్రిరేఖా వృత్తా గ్రీవా యస్య తం. మహోరస్కం విశాలవక్షసం.



సునాసం శోభనా నాసా యస్య తం. సుందరే భ్రువౌ యస్య తం. (22)

శ్లో ॥ శ్వాసైజదలకాభాతం కంబు శ్రీకర్ణదాడిమమ్
విద్రుమాధర భాసేషచ్ఛోణాయిత సుధాస్మితమ్ - 23

టీ :- శ్వాసేతి. శ్వాసై రేజంతః కంపమానా యే అలకాస్తైరాభాతం శోభితం. కంబువత్ అంతర్వలయేన శ్రీర్యయో స్తౌ కంబుశ్రియౌ. తయోః కర్ణయోర్దాడిమపుష్పే యస్య తం. విద్రుమతుల్యాధరభాసా ఈషచ్ఛోణాయితం సుధాతుల్యం స్మితం యస్య తం. (23)

ఉచ్ఛ్వాస నిశ్వాసములచే కదలాడుచున్న ముంగురులు గలవాడై, శంఖమువంటి వలయములు లోన విలసిల్లుచుండగా అందముగ చెవులయందు దానిమ్మ పువ్వులు గలవాడై, పగడముల వంటి కాంతితో అలరారుచున్న పెదవులపై అమృతమువంటి చిరునగవులొలుకుచున్నవాడై ఆ శిశువు ఆకట్టుకొనుచుండెను.(23)

శ్లో ॥ పద్మగర్భారుణాపాంగం హృద్యహాసావలోకనమ్
శ్వాసైజద్వలిసంవిగ్నినిమ్ననాభిదలోదరమ్ - 24

టీ :- పద్మేతి. పద్మగర్భవత్ ఆ ఈషత్ అరుణావపాంగౌ నేత్రాంతౌ యస్య తం. హృద్యోహాసో యస్మిన్ తదవలోకనం యస్య తం. శ్వాసైరేజంత్యశ్చలంత్యో వలయ స్త్రిర్యజ్నిమ్నరేఖా స్తాభిః సంవిగ్నా చంచలా నిమ్నా చ గంభీరా నాభిర్యస్మిన్ తత్. దలవదశ్వత్థదల సంకాశముదరం యస్య తం. (24)

పద్మగర్భము (పద్మము యొక్క నడిమి ప్రదేశము) వలె కొంచెము ఎర్రనైన నేత్రములుగలవాడును, మనస్సునాకట్టుకొనెడి చిరునవ్వుతో చూచుచున్నవాడును, శ్వాసతో కదలుచున్న పొట్టమీద ముడతలతో కూడిన నాభి (బొడ్డు) గలవాడును, మఱ్ఱియాకులవలె లేత పొట్టగలవాడును అయిన కిశోరుని (బాలుని) ఆ ముని చూచెను. (24)



శ్లో ॥ చార్వంగులిభ్యాం పాణిభ్యామున్నీయ చరణాంబుజమ్
ముఖే నిధాయ విప్రేన్ద్రో ధయన్తం వీక్ష్య విస్మితః - 25

టీ :- చార్వితి. చారవః అంగులయో యయోస్తాభ్యాం ఉన్నీయ ఆకృష్య. ధయంతం పిబంతం. (25)

అందమైన చేతివ్రేళ్ళతో తన పాద పద్మమునెత్తి, దానిని తననోట నిలుపుకొని, చప్పరించుచున్న ఆ బాలుని మునీంద్రుడు, ఆశ్చర్యముతో చూచెను. (25)

శ్లో ॥ తద్దర్శనాద్వీత పరిశ్రమోముదా
ప్రోత్ఫుల్లహృత్పద్మవిలోచనాంబుజః
ప్రహృష్టరోమాద్భుతభావశంకితః
ప్రష్టుం పురస్తం ప్రససార బాలకమ్ - 26

టీ :- తదితి. హృత్పద్మం చ విలోచనాంబుజే చ ప్రోత్ఫుల్లాని తాని యస్య సః. అద్భుతభావః అత్యాశ్చర్య రూపం తేన శంకితస్సన్నపి. తం ప్రష్టుం పురః ప్రససార సమీపం గతః. (26)

ఆ అద్భుతబాలుని చూచుటచే కలిగిన ఆనందముతో తన అలసటను మరచిపోయినవాడైన ఆ మునీంద్రుడు తన హృధయ పద్మము, లోచనపద్మములు వికసించుచుండగా (మనస్సు, కన్నులు ఆనందపరవశములై వికసింపగా అని తాత్పర్యము) హర్షముతో పులకించిన తనువు గలవాడై ఆ బాలునితో ముచ్చటించుటకు సమీపమునకు వెళ్ళెను. (26)

శ్లో ॥ తావచ్ఛిశోర్వై శ్వసితేన భార్గవః
సోఽన్తః శరీరం మశకోయథాఽ విశత్
తత్రాప్యదో న్యస్తమచష్టకృత్స్నశో
యథా పురాఽముహ్యదతీవ విస్మితః - 27

ఆ బాలుని శ్వాసచే ఆ మునీంద్రుడు మశకము (దోమ) వలె ఆ బాలుని శరీరములోనికి ప్రవేశించినవాడై, అచట ప్రళయమునకు ముందు ఉంచబడిన ఈ సృష్టినంతయు ఆశ్చర్యముతో తిలకించెను. (27)



టీ :- తత్రేతి. అదః ఇదం జగత్. యథా పురా ప్రలయాత్పూర్వం న్యస్తం విన్యస్తం. దృష్ట్వా చ అతీవ విస్మితస్సన్. అముహ్యత్.(27)

శ్లో ॥ ఖం రోదసీ భగణానద్రిసాగరాన్
దీ్వపాన్ సవర్షాన్ కకుభః సురాసురాన్
వనాని దేశాన్ సరితః పురాకరాన్
ఖేటాన్ వ్రజానాశ్రమ వర్ణ వృత్తయః - 28

టీ :- కృత్స్నశో దర్శనం ప్రపంచయతి - ఖమితి. కకుభో దిశః పురాణి ఆకరాంశ్చ. ఖేటాన్ కర్షకగ్రామాన్. వ్రజాన్ గోకులాని. ఆశ్రమాంశ్చ వర్ణాంశ్చ తేషాం వృత్తీశ్చేత్యర్థః. (28)

శ్లో ॥ మహాన్తి భూతన్యథ భౌతికాన్యసౌ
కాలం చ నానాయుగకల్ప కల్పనమ్
యత్కించి దన్య ద్వ్యవహార కారణం
దదర్శ విశ్వం సదివావభాసితమ్ - 29

ఆ బాలుని అంతఃశరీరములో ఆకాశమును, రోదసిని, నక్షత్రములను, పర్వతములను, సాగరములను, ద్వీపములను, వర్షములను, దిక్కులను, దేవతలను, దానవులను, అరణ్యములను, దేశములను, నదులను, పురములను, ఆకరములను, కర్షకులు నివసించు పల్లెలను, గోకులములను, ఆశ్రమములను, వానిలోని ధర్మకర్మలను చక్కగా ఆ ముని దర్శించెను.(28)

ఆ మునీంద్రుడు భౌతికములైన మహాభూతములను, అనేక యుగకల్పములతో కల్పితమైన కాలమును, ఇతరములైన వ్యవహారకారణములైన అనేక పదార్థములను కలిగియున్న విశ్వమును, పరమార్థమువలె కనబడుచున్న దానిని చూచెను. పిదప హిమాలయమును, పుష్పములకాలవాలమైన పుష్పభద్రానదిని, దాని తీరములో ఆశ్రమమును, అచట మునులను చూచెను. మరల ఆ శిశువు శ్వాస విడువగానే ఆ మునీంద్రుడు వెలుపలికి విసరివేయబడి, ప్రళయ సాగరమున పడెను.(29,30)



శ్లో ॥ హిమాలయం పుష్పవహాం చ తాం నదీం
నిజాశ్రమం తత్ర ఋషీనపశ్చత్
విశ్వం విపశ్యన్ శ్వసితాచ్ఛిశోర్వై
బహిర్నిరస్తో న్యపతల్లయా బ్ధౌ - 30

టీ :- మహాంతీతి. నానాయుగాని కల్పాంశ్చ కల్పయతి తైర్వా కల్ప్యత ఇతి తథా తం. కాలం చ. సదివ పరమార్థమివ అవభాసితం తేనైవ. (29,30)

శ్లో ॥ తస్మిన్ పృథివ్యాః కకుది ప్రరూఢం
వటం చ తత్పర్ణపుటే శయానమ్
తోకం చ తత్ప్రేమ సుధాస్మితేన
నిరీక్షితోఽపాంగ నిరీక్షణేన - 31

శ్లో ॥ అథ తం బాలకం వీక్ష్య నేత్రాభ్యాం ధిష్ఠితం హృది
అభ్యయాదతి సంక్లిష్టః పరిష్వక్తుమధోక్షజమ్ - 32

టీ :- తస్మిన్నితి. వటం చ తోకం చ వీక్ష్య తస్య ప్రేమ్ణా సుధాతుల్యస్మిత యుక్తేనాపాంగనిరీక్షణేన నిరీక్షితస్సన్.(31)

అప్పుడా మునీంద్రుడు భూమిపై ఈశాన్య దిక్కులో పెరిగిన మఱ్ఱిచెట్టుపై నున్న మఱ్ఱియాకుపై పరుండియున్న బాలుని అమృతమయవీక్షణములచేత చూడబడినవాడై ఆనందించెను. పిమ్మట ఆ బాలుని ఆలింగనము చేసికొనుటకై సమీపమునకు వెళ్ళెను. (31,32)



టీ :- అథేతి. అథ తం బాలకమధోక్షజం పరిష్వక్తుం. అభ్యయాదిత్యన్వయః. కథంభూతం హృద్యధిష్ఠితం. (32)

శ్లో ॥ తావత్స భగవాన్ సాక్షాద్యోగాధీశో గుహాశయః
అంతర్దధ ఋషేః సద్యః యథేహానీశనిర్మితా -33

ఆ మునీంద్రుడు బాలుని ఆలింగనము చేసికొనబోవగా, అసమర్థుని కోరిక నెరవేరని విధముగా ఆ బాలుడు (భగవంతుడు) వెంటనే అంతర్థానమైపోయెను. (33)

టీ :- తావదితి. తావత్ పరిష్వంగలాభాత్పూర్వమేవ ఋషేస్తస్య. అంతర్హితో బభూవ. తదుద్యమవైఫల్యే దృష్టాంతః. అనీశో నిర్దైవః తేన నిర్మితా. ఈహా క్రియా యథేతి. (33)

శ్లో ॥ తమన్వథ వటో బ్రహ్మన్ సలిలం లోక సంప్లవః
తిరోధాయి క్షణాదస్య స్వాశ్రమే పూర్వవత్ స్థితః - 34

ఇట్లు భగవంతుడంతర్ధానమైపోవుట తోడనే మఱ్ఱి చెట్టు, నీరు, జలప్రళయములు కూడ అంతర్ధానమయ్యెను. ఆ మునీంద్రుడు పూర్వమువలెనే తన ఆశ్రమమున నిలిచెను.(34)

టీ :- తమితి. తమంతర్హితం భగవంతమను వటః. సలిలం లోకసంప్లవశ్చ తిరోధాయి అంతర్హితః స చ స్వాశ్రమ ఏవ యథా పూర్వం స్థిత ఇతి. (34)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే**
**ద్వాదశస్కంధేమాయాదర్శనంనామ**
**నవమోఽధ్యాయః**

**శ్రీమద్భాగవత మహాపురాణము యొక్క ద్వాదశస్కంధమునందలి**
**నవమాధ్యాయము సమాప్తము.**



## దశమోఽధ్యాయః

**సూత ఉవాచ**

శ్లో ॥ స ఏవ మనుభూయేదం నారాయణ వినిర్మితమ్
వైభవం యోగమాయాయాస్తమేవ శరణం యయౌ - 1

టీ :- శ్లో. దశమే శివ ఆగత్య మునేస్తుష్టో వరానదాత్, తేన సాకమితి ప్రీత్యా సమాభాష్య సభాజయన్. (1)

**మార్కండేయ ఉవాచ**

శ్లో ॥ ప్రపన్నోఽస్మ్యంఘ్రిమూలం తే ప్రపన్నాభయదం హరే!
యన్మాయయాఽపి విబుధా ముహ్యన్తి జ్ఞానకాశయా-2

టీ :- ప్రపన్నోఽస్మీతి. జ్ఞానకాశయా జ్ఞానవత్ప్రకాశమానయా త్వద్భజనం వినా విద్వాం సోఽపి యస్య తవ మాయయా జ్ఞానినో వయమిత్యహంకారేణ ముహ్యంతీత్యర్థః. (2)

**సూత ఉవాచ**

శ్లో ॥ తమేవం నిభృతాత్మానం వృషేణ దివి పర్యటన్
రుద్రాణ్యా భగవాన్ రుద్రో దదర్శ స్వగణైర్వృతః - 3

## దశమాధ్యాయము.

**సూతుడు పలుకుచున్నారు**

ఈ దశమాధ్యాయమున మార్కండేయముని భక్తికి మెచ్చి శివుడు ప్రత్యక్షమై, ఎంతో ప్రీతిగా అతనితో ముచ్చటించి వరములను గ్రహించుట వర్ణింపబడినది.

మార్కండేయుని ఈ విధముగ భగవంతుడైన నారాయణుడు కల్పించిన మాయను అనుభవించినవాడై, ఆ యోగమాయనే శరణువేడెను. (1)

**మార్కండేయుడు పలుకుచున్నారు**

ఓ హరీ! నేను నీ పాదమూలమును ఆశ్రయించి, ప్రసన్నుడనైనాను. నీ పాదములు ప్రసన్నులైనవారికి అభయమొసంగును నిన్ను సేవింపకున్నచో విద్వాంసులు సైతము జ్ఞానమువలె ప్రకాశించు మాయకు లోబడినవారై మేమనెడి అహంకారముతో కొట్టుమిట్టాడుచుందురు. (2)

**సూతుడు పలుకుచున్నారు**

ఈ విధముగ ఆ మార్కండేయుడు దేహమును, ఇంద్రియములను, మనస్సును నిశ్చలముగ నుంచుకొని ధ్యానించుచుండగా



టీ :- శ్రీనారాయణ ఏవ స్వమాయాదర్శనశ్రాంతం శ్రీశివరూపేణ సాంత్వయామాస. తదాహ - తమితి. నిభృతాత్మానం సమాహితచిత్తం రుద్రాణ్యా భవాన్యా. (3)

ఆకాశమార్గమున వృషభారూఢుడై పార్వతీదేవితోడను, ప్రమథగణము తోడను ప్రయాణించుచున్న శివుడు ఆతని చూచెను. (3)

శ్లో ॥ అథోమా తమృషిం వీక్ష్య గిరిశం సమభాషత
పశ్యేమం భగవన్విప్రం నిభృతాత్మేంద్రియాశయమ్ - 4

టీ :- అథేతి. నిభృతాః నిశ్చలాః ఆత్మేంద్రియాశయాః దేహేంద్రియ మనాంసి యస్య సః. (4)

అప్పుడు పార్వతీదేవి ఆ మార్కండేయమునిని చూచి, ఈశ్వరునితో - ప్రభూ ! నిశ్చలాత్మేంద్రియ శరీరుడైన ఈ విప్రుని చూడుము అని పలికెను. (4)

శ్లో ॥ నిభృతోదఝషవ్రాతం వాతాపాయే యథార్ణవమ్
కుర్వస్య తపసః సాక్షాత్సంసిద్ధిం సిద్ధిదో భవాన్ - 5

టీ :- నిభృతేతి. నిభృతః నిశ్చలః ఊర్మిర్ఝషవ్రాతః యస్మిన్ సః. సంసిద్ధం ఫలం. సాక్షాత్కురు ప్రకటీకురు యతో భవాన్ సిద్ధిదః(5)

గాలి తగ్గిన తరువాత నిశ్చలమైన జలములు, చేపలు గల సముద్రము రూపొందినట్లు, ఈతని తపస్సునకు ఫలమును ప్రసాదింపుము. ఏలయన - నీవే సిద్ధులను ప్రసాదించువాడవు గదా (5)

**శ్రీ భగవానువాచ**

శ్లో ॥ నైవేచ్ఛత్యాశిషః క్వాపి బ్రహ్మర్షిర్మోక్షమప్యుత
భక్తిం పరాం భగవతి లబ్ధవాన్ పురుషేఽవ్యయే - 6

**శ్రీభగవానుడు పలుకుచున్నాడు**

ఓ పార్వతీ! ఈతడు (మార్కండేయుడు) ఇప్పటిదాకా తన తపస్సునకు ఫలముగ ఆశీస్సులనుగాని, మోక్షమునుగాని కోరుటలేదు. కారణమేమనగా ఈతడు అవ్యయుడైన భగవంతుని యందే



టీ :- నేతి. ఆశిషః అభ్యుదయలక్షణాః. ఉతస్విత్ అత్ర హేతుః. భక్తిమితి. (6)

ఉత్తమభక్తిని పొందియున్నాడు. (6)

శ్లో ॥ అథాఽపి సంవదిష్యామో భవాన్యేతేన సాధునా
అయం హి పరమో లాభో నృణాం సాధుసమాగమః - 7

టీ :- అథేతి. సంవదిష్యామః సంవాదం కరిష్యామః. (7)

అయినప్పటికినీ, ఈతనితో మనము సంభాషించెదము. సజ్జన సాంగత్యము మానవులకు పరమలాభకరము గదా ! (7)

**సూత ఉవాచ**

శ్లో ॥ ఇత్యుక్త్వా తముపేయాయ భగవాన్ స సతాంగతిః
ఈశానః సర్వ విద్యానామీశ్వరః సర్వదేహినామ్ - 8

టీ :- ఇతీతి. సతాం గతిత్వే హేతుః - ఈశాన ఇతి. (8)

**సూతుడు పలుకుచున్నాడు**

సర్వవిద్యలకు నిలయుడును, సకల శరీరధారులకు నియామకుడును అయిన పరమేశ్వరుడీవిధముగ పార్వతితో పలికి, ఆ మార్కండేయుని సమీపించెను. (8)

శ్లో ॥ తయోరాగమనం సాక్షాదీశయోర్జగదాత్మనోః
న వేద రుద్ధధీవృత్తి రాత్మానం విశ్వమేవచ - 9

జీవజగత్తులు రూపుదాల్చినవారును, ఆదిదంపతులును అయిన పార్వతీ పరమేశ్వరులు తన సమీపమునకు రాగా, నిశ్చలాంతః కరణుడైన ఆ మార్కండేయుడు తనను, విశ్వమును మరచిపోయెను. (9)

శ్లో ॥ భగవాంస్తదభిజ్ఞాయ గిరీశో యోగమాయయా
ఆవిశత్తద్గుహాకాశం వాయుశ్ఛిద్రమివేశ్వరః - 10



టీ :- తయోరితి. రుద్ధాః ధియోऽంతఃకరణస్య వృత్తయో యేన సః (9,10)

ఆతని నిశ్చేష్టతను తెలిసికొన్న ఈశ్వరుడు యోగమాయతో ఆతని హృదయాకాశములోనికి (రంధ్రములోనికి గాలి ప్రవేశించినట్లు) ప్రవేశించెను. (10)

శ్లో ॥ ఆత్మన్యపి శివం ప్రాప్తం తడిత్పింగజటాధరమ్
త్ర్యక్షం దశభుజం ప్రాంశుముద్యన్తమివ భాస్కరమ్ 11

టీ :- ఆత్మనీతి. న కేవలం బహిరేవ కింతు ఆత్మన్యపి ప్రాప్తం శివం విచక్ష్య విస్మితః. కథం ప్రాప్తం. సహసా అకస్మాదేవ హృది భాంతం కథంభూతం తటిత్పింగా జటా ధారయతీతి తథా తం. త్రీణ్యక్షీణి యస్య తం. (11)

బాహ్యముగానే గాక, ఆత్మయందును ప్రవేశించిన వాడును, మెరుపుతీగలవలె నున్న పింగళవర్ణ జటలను ధరించినవాడును, మూడుకన్నులు, పదిచేతులు గలవాడును, ఉదయించు చున్న సూర్యునివలెనున్న వాడును అయిన శివుని చూచి మార్కండేయుడు ఆశ్చర్యమునొందెను.. (11)

శ్లో ॥ వ్యాఘ్రచర్మాంబరధరం శూలఖట్వాంగచర్మభిః
అక్షమాలాడమరుక కపాలాసి ధనుః సహ - 12

టీ :- వ్యాఘ్రేతి. శూలాదిభిస్సహాక్షమాలాదీన్ బిభ్రాణమిత్యన్వయః అక్షమాలాదీనాం ద్వంద్వైక్యం. (12)

పులితోలును కట్టుకొన్నవాడును, శూల ఖట్వాంగ చర్మములను ధరించినవాడును, అక్షమాల, డమరుకము, కపాలము, కత్తి, ధనుస్సును దాల్చిన వాడును అయిన శివుని చూచి మార్కండేయుడు విస్మయమునొందెను. (12)



శ్లో ॥ బిభ్రాణం సహసా భాతమ్ విచక్ష్య హృది విస్మితః
కిమిదం కుత ఏవేతి సమాధేర్విరతో మునిః - 13

టీ :- విస్మయపూర్వకం బహిర్దర్శనమాహ - కిమిదమితి. సోమం ఉమయా సహాగతం రుద్రం దదృశే. (13)

ఇట్టి అలంకరణలతో కూడిన పరమేశ్వరుడు తృటిలో తన యెదుట ప్రత్యక్షముకాగా, మార్కండేయుడు సాశ్చర్యాంతరంగుడై, ఇదేమిటి? ఇదెట్లు జరిగినది? అని ధ్యానమునుండి మేల్కొనెను. (13)

శ్లో ॥ నేత్రే ఉన్మీల్య దదృశే సగణం సోమయాఽఽగతమ్
రుద్రం త్రిలోకైకగురుం ననామ శిరసామునిః - 14

కన్నులు తెరచిన ఆ మార్కండేయుడు తన యెదుట పార్వతీదేవితో కూడియున్న వాడును, ప్రమదగణముచే సేవింపబడు చున్న వాడును అయిన త్రిలోకపూజ్యుడగు ఈశ్వరుని చూచి, శిరస్సువంచి నమస్కరించెను. (14)

శ్లో ॥ తస్మై సపర్యాం వ్యదధాత్సగణాయ సహోమయా
స్వాగతాసన పాద్యార్ఘ్య గంధస్రగ్ధూపదీపకైః - 15

టీ :- రుద్రమితి. తతో ననామ. (14,15)

పార్వతీ దేవితోడను, ప్రమధులతోడను కూడియున్న ఆ ఈశ్వరునికి స్వాగతము, ఆసనము, పాద్యము, అర్ఘ్యము, గంధము, పుష్పమాల, ధూపము, దీపము మున్నగు ఉపచారములతో మార్కండేయుడు పూజలు చేసెను. (15)

శ్లో ॥ ఆహ చాత్మానుభావేన పూర్ణకామస్య తే విభో!
కరవామ కిమీశాన ! యేనేదం నిర్వృతం జగత్ - 16

ఓ ఈశ్వరా! పూర్ణకాముడవైన నిన్ను ఆత్మలో దర్శింపగా, ఈ జగత్తు అంతయు పూర్ణమనోరథమగుచున్నది అని మార్కండేయుడు పలికెను. (16)



టీ :- ఆహేతి. పూర్ణకామత్వం వ్యనక్తి - యేన త్వయా జగన్నిర్వృతం భవతీతి. (16)

శ్లో ॥ నమశ్శివాయ శాన్తాయ సత్త్వాయ ప్రమృడాయచ
రజోజుషేఽప్యఘోరాయ నమస్తుభ్యం తమోజుషే - 17

నిర్గుణుడైన శివునకు, శాన్తునకు, ప్రాణులలో నున్న వానికి, సుఖ ప్రదాయకునకు, రజో మూర్తికి, అఘోరునకు, తమోమూర్తికి నమస్కారము' అని ఆ మార్కండేయుడు శివుని స్తుతించెను. (17)

**సూత ఉవాచ**

శ్లో ॥ ఏవం స్తుతః స భగవాన్ ఆదిదేవః సతాం గతిః
పరితుష్టః ప్రసన్నాత్మా ప్రహసంస్తమభాషత - 18

టీ :- నిర్గుణత్వేన సగుణత్వేన చ నమస్కరోతి - నమ ఇతి. నమశ్శివాయ నిర్గుణాయ సత్త్వాయ సత్త్వాధిష్ఠాత్రే. అత ఏవ ప్రమృడ యతి ప్రకర్షేణ సుఖయతీతి తథా తస్మై నమః. (17,18)

**సూతుడు పలుకుచున్నాడు**

ఈ విధముగ మార్కండేయునిచే స్తుతింపబడిన సజ్జన శరణ్యుడైన ఆదిదేవుడగు శివుడు సంతుష్టుడై, ప్రసన్నాత్ముడై, నవ్వుచు ఆ మార్కండేయునితో ఇట్లు పలికెను. (18)

**శ్రీ భగవానువాచ**

శ్లో ॥ వరం వృణీష్వ నః కామం
వరదేశా వయం త్రయః
అమోఘం దర్శనం యేషాం
మర్త్యో యద్విందతేఽమృతమ్ - 19

**శ్రీభగవానుడు పలుకుచున్నాడు**

ఓ మార్కండేయా! బ్రహ్మ విష్ణు మహేశ్వరులను పేరుతో మేము ముువ్వరము మానవులకు అమోఘ దర్శనమునొసంగుట ద్వారా అమృతము నందించుచున్నాము. కావున మా నుండి నీవు వరమును పొందుము. (19)



టీ :- వరమితి. త్రయః బ్రహ్మవిష్ణుమహేశ్వరాః. యత్ యేభ్యః తే వయం. (19)

శ్లో ॥ బ్రాహ్మణాః సాధవః శాన్తా నిస్సంగాః భూతవత్సలాః
ఏకాంతభక్తాః అస్మాసు నిర్వైరాః సమదర్శినః - 20

సాధువులైన బ్రాహ్మణులు శాన్తులై నిస్సంగులై, ప్రాణిదయ గలవారై, వైరములేని వారై, సమదృష్టి గలవారై, మా యందే అనన్య భక్తి తత్పరులై యుందురు. (20)

టీ :- వరదానాదినా భవత్సేవైవాస్మాభిః. క్రియతే. న త్వనుగ్రహః. జగద్వంద్యత్వాద్భవతామితి బ్రాహ్మణాం స్తౌతి - బ్రాహ్మణా ఇతి. యే సాధవః సదాచారాః. శాంతాః మత్సరాదిరహితాః. నిస్సంగా నిష్కామాః. (20)

శ్లో ॥ సలోకా లోకపాలాస్తాన్వందంత్యర్చన్త్యుపాసతే
అహం చ భగవాన్బ్రహ్మా స్వయం చ హరిరీశ్వరః - 21

సకలలోకములు, లోకపాలకులు ఆ హరిని నమస్కరింతురు, పూజింతురు, ఉపాసింతురు, నేను, బ్రహ్మదేవుడును ఆ హరి నుపాసింతుము. (21)

టీ :- సలోకా ఇతి. న కేవలం త ఏవ కింతు అహం చేత్యాది. (21

శ్లో ॥ న తే మయ్యచ్యుతేஉజే చ భిదామణ్వపి చక్షతే
నాత్మనశ్చ జనస్యాపి తద్యుష్మాన్వయ మీమహి - 22

సమదర్శనులైన వారు నాయందును, హరి యందును, బ్రహ్మ దేవుని యందును అణువంత భేదమును కూడ చూడరు. అట్టి వారిలో నీవొకడవు కావున నిన్ను అనుగ్రహించుచున్నాను. (22)

శ్లో॥ నహ్యమ్మయాని తీర్థాని న దేవాశ్చేతనోర్ఝితాః
తే పునంత్యురుకాలేన యూయం దర్శన మాత్రతః - 23

టీ :- పూజ్యతమత్వే హేత్వంతరమాహ - నేతి. అణ్వపి అణుమాత్ర మపి న చక్షతే న పశ్యంతి. తత్తస్మాత్. ఏవంభూతాన్ యుష్మాన్ ఈమహి భజేమహి. (22,23)

అట్టి ఉత్తములైన వారిని దర్శించినంత మాత్రముననే తీర్థ స్నానముల వలన కలిగిన పుణ్యము, దేవతలను పాసించిన పుణ్యము లభించును. (23)

శ్లో॥ బ్రాహ్మణేభ్యో నమస్యామో యే ఒస్మద్రూపం త్రయీమయమ్
బిభ్రత్యాత్మసమాధాన తపః స్వాధ్యాయ సంయమైః - 24

టీ :- బ్రాహ్మణేభ్య ఇతి. బ్రాహ్మణేభ్యః బ్రాహ్మణాన్. ఆత్మసమాధానం చిత్తైకాగ్ర్యం తపః ఆలోచనం స్వాధ్యాయః అధ్యయనం సంయమః వాగాదినియమః. తైః. (24)

త్రయీ (వేద) మయుమగు మా రూపమును దాల్చిన బ్రాహ్మణులకు నమస్కరింతుము. వారు చిత్తమునేకాగ్రముగనుంచి, ఆలోచనలతో, అధ్యయనాదులనొనర్చుచు, వాగాదులయందు నియమములతో నుందురు. (24)

శ్లో॥ శ్రవణాద్దర్శనాద్వాపి మహాపాతకినోఒపి వః
శుధ్యేరన్నన్త్యజాశ్చాపి కిము సంభాషణాదిభిః - 25

టీ :- కించ. శ్రవణాదితి. (25)

మహాపాతకములనొనర్చిన వారు సైతము మమ్ముదర్శించి నంతలో, నామములను వినినంతలో పునీతులగుదురు. అన్త్యజులు ఛండాలాదులు కూడ పవిత్రులగుదురు. ఇక సంభాషణాదులవలన ఎంత మహిమను పొందెదరో చెప్పనేల? (25)



**సూత ఉవాచ**

శ్లో ॥ ఇతి చంద్రలలామస్య ధర్మగుహ్యోపబృంహితమ్
వచోఽమృతాయనమృషిర్నాతృప్యత్కర్ణయోః పిబన్ - 26

టీ :-ఇతీతి. చంద్రోలలామం భూషణం యస్య తస్య. ధర్మ రహస్య యుక్తం అమృతాస్పదం వచః కర్ణాభ్యాం పిబన్ నాతృప్యత్ అలమితి నామన్యత కర్ణయోరమృతాయనమితి వా అన్వయః. (26)

**సూతుడు పలుకుచున్నాడు**

ఈ విధముగ చంద్రశేఖరుడైన శివుడు ధర్మ రహస్యముతో కూడిన అమృతవాక్కులను పలుకగా, వాటిని వినుట ద్వారా చెవిలో అమృతమొలికినట్లు అత్యానందమునొంది, ఇంకను వినవలెనను కోరికగలవాడై మార్కండేయుడు తృప్తి నొందలేదు. (26)

శ్లో ॥ స చిరం మాయయా విష్ణోర్భ్రామితః కర్శితో భృశమ్
శివవాగమృతధ్వస్తక్లేశపుంజస్తమ బ్రవీత్ - 27

టీ :- స ఇతి. శివస్య వాగేవ అమృతం తేన ధ్వస్తః క్లేశపుంజో యస్య సః. (27)

చిరకాలము విష్ణు మాయాప్రభావముచే తిరుగుచు, కృశించి పోయిన మార్కండేయుడు శివుని మాటలనెడి అమృతపు జల్లులవలన తన కష్టము లన్నియు దూరముకాగా, శివునితో యిట్లు పలికెను. (27)

**ఋషిరువాచ**

శ్లో ॥ అహో! ఈశ్వరలీలేయం దుర్విభావ్యా శరీరిణామ్
యన్నమంతీశితవ్యాని స్తువంతి జగదీశ్వరాః - 28

టీ :- అహో ఇతి. ఇయమీశ్వరలీలా దుర్విభావ్యా అవితర్క్యా

**ఋషి పలుకుచున్నాడు**

అహో! ఈశ్వరుని లీల అమోఘము, అది బుద్ధికి అందనిది. సకల సృష్టిలోని చరాచరమంతయు జగదీశ్వరుడైన భగవంతుని స్తుతించును. (28)



యద్భయా ఈశితవ్యాని నియమ్యాని యాని భూతాని తాని జగదీశ్వరాః స్వయం నమంతి స్తువంతి చేతి. (28)

శ్లో ॥ ధర్మం గ్రాహయితుం ప్రాయః ప్రవక్తారశ్చ దేహినామ్
ఆచరన్త్యను మోదన్తే క్రియమాణం స్తువంతి చ - 29

టీ :- అథవా లోకసంగ్రహార్థమేతదిత్యాహ - ధర్మమితి. ప్రవర్తకారో ఽపి స్వయం దేహినాం ధర్మమాచరంతి. (29)

శ్లో ॥ నైతావతా భగవతః స్వమాయామయవృత్తిభిః
న దుష్యేతానుభావస్తైర్మాయినః కుహకం యథా - 30

టీ :- నన్వేతత్స్వప్రభావ తిరస్కారకం కథం మయా క్రియతే? తత్రాహ - నేతి. ఏతావతా లోకసంగ్రహమాత్రేణ తైర్నమనాదిభిః కథం భూతైః స్వమాయామయీ వృత్తిర్యేషు తైః. భగవతో మాయిన స్తవానుభావో న దుష్యేత యతః. ప్రసిద్ధస్య మాయినః కుహకం కపటం యథా తథైతాని నమనాదీని అతస్తస్య కుహకేన యథానుభావోన దుష్యేత. తద్వదితి. ప్రదుష్యేతేతి పాఠే నకారస్య దృష్టాంతేనానుషంగః. (30)

ధర్మమును స్వీకరించుటకై ప్రవక్తలైనవారు దేహధారులైన వారి ధర్మములను ఆచరింతురు. అట్టి ధర్మమునాచరించుచు, ఆచరించెడి వారిని ప్రోత్సహించుచు స్తుతింతురు. (29)

భగవంతుని మాయలచేత ప్రవక్తలైన వారి హృదయములలో గల భగవద్భక్తి నశింపదు. మాయలు చేయువాని మాయవలె అది హృదయ గతములైన భావనలను మార్చివేయదు. (30)



శ్లో ॥ సృష్ట్వేదం మనసా విశ్వమాత్మనాను ప్రవిశ్యయః
గుణైః కుర్వద్భిరాభాతి కర్తేవ స్వప్నదృగ్యథా - 31

టీ :- మాయాచేష్టితం ప్రపంచయతి - సృష్ట్వేతి స్వప్నదృక్ యథేత్య విద్యాచేష్టితే దృష్టాంతః (31)

భగవంతుడీ విశ్వమును సృష్టించి, ఆత్మ రూపమున ప్రవేశించిన వాడై గుణములచేత కర్తవలె ఆభాసించును. ఆతని మాయ స్వప్న దృష్టివలె నుండును. (31)

శ్లో ॥ తస్మై నమో భగవతే త్రిగుణాయ గుణాత్మనే
కేవలాయాద్వితీయాయ గురవే బ్రహ్మ మూర్తయే - 32

టీ :- తస్మా ఇతి. త్రిగుణత్వేఽపి న జీవవత్తదభిభూతాయ కిన్తు మహాత్మనే గుణాత్మన ఇతి పాఠే గుణానామాత్మనే నియంత్రే. (32)

త్రిగుణుడైన వాడును, గుణాత్ముడును, కేవలుడును, అద్వితీయుడును, గురువును, బ్రహ్మమూర్తియునైన భగవంతునకు నమస్కారము. (32)

శ్లో ॥ కం వృణే ను పరం భూమన్వరం త్వద్వరదర్శనాత్
యద్దర్శనాత్పూర్ణకామః సత్యకామః పుమాన్భవేత్ - 33

ఓ దేవా! నీ దర్శనమనెడి వరముకంటె వేరైన వరమును నేనేమి కోరగలను? నీ దర్శనమాత్రముననే నేను పూర్ణమనోరథుడ నైనాను. సత్యకాముడననగా సర్వానంద సందోహరూపుడనైనాను. సర్వానందుడనైనాను. (33)

శ్లో ॥ వరమేకం వృణేఽథాపి పూర్ణాత్కామాభివర్షణాత్
భగవత్యచ్యుతాం భక్తిం తత్పరేషు తథా త్వయి - 34

పూర్ణకాముడనైనను ఒక వరమును వేడెదను. నాకు భగవంతునిపై అచ్యుతమగు (నాశము లేనిదగు) భక్తియు, అట్లే



టీ :- వరంవృణీష్వేతి యదుక్తం తత్రాహ - కిమితి. వరం దర్శనం యస్య తస్మాత్. తత్ త్వత్తః పరం కం ను వరంవృణే యస్య తవ దర్శనాత్. పూర్ణకామః సర్వానందసన్దోహరూపః. సత్యకామః యథేచ్ఛం ప్రాప్తసర్వానందః. (33,34)

భగవద్భక్తులైన వారియందును, నీయందును భక్తి నిలిచియుండునట్లు వరము నొసంగుము. (34)

**సూత ఉవాచ**

శ్లో ॥ ఇత్యర్చితోఽభిష్టుతశ్చ మునినా సూక్తయాగిరా
తమాహ భగవాన్ శర్వః శర్వయా చాభినందితః - 35

**సూతుడు పలుకుచున్నాడు**

ఇట్లు శివుడు మార్కండేయునిచే అర్చింపబడినవాడై, స్తుతింపబడినవాడై, మార్కండేయుని కోరిక విషయములో పార్వతీదేవిచే అభినందనామోదములను తెలుపు వాడై, ఆతనితో ఇట్లనెను. (35)

టీ :- ఇతీతి. వరదానాయ స్వయమేవ ప్రవృత్తః. శర్వాణ్యా ఉమయా చ అభినందితః అనుమోదితస్సన్నాహ. (35)

శ్లో ॥ కామో మహర్షే సర్వోఽయం భక్తిమాంస్త్వ మధోక్షజే
ఆకల్పాన్తాద్యశః పుణ్యమజరామరతా తథా - 36

ఓ మార్కండేయ మహర్షీ! నీవు హరియందు అచంచలభక్తి గలవాడవు కనుక, నీవు కోరిన కోర్కె సఫలమగును. కల్పాంతము వరకు కీర్తిని, పుణ్యమును, అజరామరత్వమును నీవు పొందగలవు. (36)

శ్లో ॥ జ్ఞానం త్రైకాలికం బ్రహ్మన్విజ్ఞానం చ విరక్తిమత్
బ్రహ్మవర్చస్వినో భూయాత్పురాణాచార్యతాస్తు తే - 37

నీకు త్రికాలములకు సంబంధించిన జ్ఞానము, వైరాగ్య భావముతో కూడిన విజ్ఞానము, బ్రహ్మవర్చస్సు కలుగును.



టీ :- కామ ఇతి. కామో౽యం సర్వో౽పి అన్యచ్చపుణ్యం యశ ఇత్యాది. బ్రహ్మవర్చస్వినస్తే భూయాదిత్యుత్తరేణాన్వయః యస్త్వమధోక్షజే భక్తిమాన్. (36,37)

పురాణాచార్యుడవై కీర్తిని గడింపగలవు.(37)

**సూత ఉవాచ**

శ్లో ॥ ఏవం వరాన్ సమునయే దత్త్వా గాత్ర్యక్ష ఈశ్వరః
దేవ్యై తత్కర్మ కథయన్ననుభూతం పురా మునా - 38

**సూతుడు పలుకుచున్నాడు**

ఇట్లు పరమశివుడు మార్కండేయుడు కోరిన వరములనొసగి, పార్వతీదేవితో మార్కండేయుని పూర్వగాథలను గూర్చి ముచ్చటించుచు, అంతర్ధానమై పోయెను. (38)

టీ :- ఏవమితి. తస్య కర్మతప ఆది అమునా పురానుభూతం యద్భగవన్మాయావైభవం తచ్చ కథయన్. (38)

శ్లో ॥ సో ౽ ప్యవాప్తమహా యోగమహిమా భార్గవోత్తమః
విచరత్యధునాప్యద్ధా హరావేకాంతతాం గతః - 39

అప్పుడు మార్కండేయుడు మహా యోగమహిమను పొందినవాడై విష్ణువునందైక్యమునొంది, నేటికి అచట సంచరించుచున్నాడు. (39)

టీ :- స ఇతి. అవాప్తో మహాయోగమహిమా యేన సః. (39)

శ్లో ॥ అనువర్ణిత మేతత్తే మార్కండేయస్య ధీమతః
అనుభూతం భగవతో మాయావైభవమద్భుతమ్ - 40

ఈ విధముగ మార్కండేయుని చరితము, ఆతడనుభవించిన భగవన్మాయావైభవము మీకు ప్రబోధింపబడినది. (40)



టీ :- అనువర్ణితమితి, ఏతన్మార్కండేయస్య చరితం. తేనానుభూతంచ భగవన్మాయావైభవం అనువర్ణితం. (40)

శ్లో॥ ఏతత్కేచితద విద్వాంసో మాయాసంసృతిమాత్మనః
అనాద్యావర్తితం నృణాం కాదాచిత్కం ప్రచక్షతే - 41

టీ :- నేన్వేవమప్యస్మత్కులోత్పన్నస్య సప్తకల్పాయుష్ట్వం వృద్ధై రుచ్యమానం విరుద్ధమేవ తత్రాహ - ఏతదితి. ఏతన్మార్కండేయేనానుభూతం భగవన్మాయావైభవం నానాకల్పరూపం కాదాచిత్కం ఈశ్వరేచ్ఛయా తస్యైవాకస్మికం న తు సర్వసాధారణం ఏతత్కేచిత్. అనాది బహుకాలం. ఆవర్తితం దైవయుగసహస్ర ద్వయమానేన పునః పునః పరివర్తితం ప్రచక్షతే కేతే? నృణాం సంసృతిః సర్గప్రలయాదిలక్షణా ఆత్మనో భగవతో మాయేత్యేవ మవిద్వాంసః. విద్వాంసస్తు మాయాశిశోః శ్వాసోచ్ఛ్వాసాభ్యాం సప్తకృత్వస్తదుదరప్రవేశ నిర్గమనతః సప్తకల్పత్వలక్షణమాత్రమేవేతి వదంతి. అతో న విరోధ ఇత్యర్థః. (41)

కొందరు అవిద్వాంసులు మానవుల సృష్టి స్థితిలయములే భగవన్మాయలనియు, మార్కండేయుడనుభవించిన నానాకల్పరూపమైన భగవన్మాయావైభవము కేవలము ఈశ్వరేచ్ఛతో కదాచిత్తుగ (అరుదుగ) మార్కండేయునివంటి వారికి చూపబడినదని భావింతురు. అది సరిగాదు. విద్వాంసులు మాత్రము మాయాశిశువైన భగవంతుని యొక్క ఉచ్ఛ్వాస నిశ్వాసములచేత సప్తకల్పములు ఆతని ఉదరమున ప్రవేశించి, వెలుపలికి వచ్చుట జరిగినదని చెప్పెదరు. కావున ఈ మాటతో పై విరోధము పరిహరింపబడినది. (41)



శ్లో ॥ య ఏవమేతద్భృగువర్య వర్ణితం
రథాంగపాణేరనుభావభావితమ్
సంశ్రావయేత్సంశ్రుణుయాదు తావుభౌ
తయోర్న కర్మాశయసంసృతిర్భవేత్ - 42

టీ :- య ఇతి. భృగువర్యస్య వర్తితం వృత్తమిత్యర్థః. యః సంశృణుయాదుత సంశ్రావయేద్వా. యః తయోరుభయోః కర్మవాసనాకృతా సంసృతిర్నభవతి. (42)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే ద్వాదశస్కంధే దశమోఽధ్యాయః**

ఈ విధముగ మార్కండేయుని విష్ణు భక్తి తత్పరతను గూర్చిన గాథను ఎవరు వినెదరో, ఎవరు వినిపించెదరో, ఆ ఉభయులకు కర్మాశయములవలన కలిగెడి సంసార దుఃఖము దూరమగును. (42)

**శ్రీమద్భాగవత మహాపురాణము యొక్క ద్వాదశస్కంధమునందలి దశమాధ్యాయము సమాప్తము.**

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. 

## ఏకాదశోఽధ్యాయః

**శౌనక ఉవాచ**

శ్లో ॥ అథేమమర్థం పృచ్ఛామో భవన్తం బహువిత్తమమ్
సమస్తతంత్రరాద్ధాన్తే భవాన్ భాగవత తత్త్వవిత్ – 1

టీ :– ఏకాదశే తు పూజార్థం మహాపురుషవర్ణనం, రవేర్వ్యూహస్య చాఖ్యానం ప్రతిమాసం పృథక్పృథక్. యేనామర్త్యత్వమాపన్నో మర్త్యోఽసౌ భార్గవోత్తమః, తం పృచ్ఛతి క్రియా యోగం సాంగోపాంగాది కల్పితమ్. అథేతి. అథేతి హేతౌ. హే భాగవత యతో భవాన్సమస్త రాద్ధాంతతత్త్వవిత్. (1)

శ్లో ॥ తాంత్రికాః పరిచర్యాయాం కేవలస్య శ్రియః పతేః
అంగోపాంగాయుధాకల్పం కల్పయన్తి యథా చ యైః – 2

శ్లో ॥ తన్నో వర్ణయ భద్రంతే క్రియాయోగం బుభుత్సతామ్
యేన క్రియానైపుణేన మర్త్యోయాయాదమర్త్యతామ్ – 3

టీ :– ప్రష్టవ్యమాహ –తాంత్రికా ఇతి. పరిచర్యాయాం ఉపాసనాయాం

## ఏకాదశాధ్యాయము

**శౌనకుడు పలుకుచున్నాడు**

ఈ ఏకాదశాధ్యాయమున పూజార్థమైన మహాపురుష వర్ణనము చేయబడుచున్నది. అట్లే ప్రతిమాసమున సూర్యుని మహిమ వర్ణింపబడుచున్నది. మార్కండేయుడు ఈ యుపాసనమువలననే అమరుడైనాడు. ఈ మహిమ సాంగోపాంగముగ (కూలంకషముగ) ఇచట తెలుపబడుచున్నది. ఓ భగవంతుడా! నీవు సమస్త తంత్ర సిద్ధాంతములను తెలిసిన తత్త్వవేత్తవు. రహస్యజ్ఞుడవు. కావున నిన్ను ప్రశ్నించుచున్నాము. (1)

తాంత్రికులు వారి ఉపాసనలో చైతన్య ఘనుడైన ఆ శ్రీహరి యొక్క అంగములను (పాదాదులను), ఉపాంగములను (గరుడ, సుదర్శనాద్యాయుధములను), ఏ యే తత్త్వములతో అనుసంధానించి పూజింతురో ఆ విధానమును మాకెరింగింపుము. మానవుడు ఆ ఉపాసనచే అమరుడగు పద్ధతిని తెలియపరచుము. నీకు శుభమగును. (2,3)



విషయే కేవలస్య చైతన్యఘనస్య అంగాని పాదాదీని ఉపాంగాని గరుడాదీని ఆయుధాని సుదర్శనాదీని ఆకల్పాః కౌస్తుభాదయః తేషాం ద్వంద్వైక్యం తద్యథా కల్పయంతి యైశ్చ తత్త్వైః కల్పయంతి. తమితి. తన్నో వర్ణయేతి. (2,3)

**సూత ఉవాచ**

శ్లో ॥ నమస్కృత్య గురూన్ వక్ష్యే విభూతీన్ వైష్ణవీరపి
యాః ప్రోక్తాః వేదతంత్రాభ్యామాచార్యైః పద్మజాదిభిః - 4

టీ :- గురూపదేశగమ్యత్వాదస్యార్థస్య తన్నమస్కార పూర్వకమాహ - నమస్కృత్యేతి. విభూతీః విరాడ్విగ్రహాద్యాః. (4)

శ్లో ॥ మాయాద్యైర్నవభిస్తత్త్వైః స వికారమయో విరాట్
నిర్మితో దృశ్యతే యత్ర సచిత్కే భువనత్రయమ్ - 5

టీ :- అంగాదికల్పానాం భూరాదిభిర్దర్శయితుం ప్రథమం తావత్ యథా కల్పయంతీతి ప్రశ్నస్య వైరాజరూపేణేత్యుత్తరం వక్తుం విరాడ్విగ్రహమాహ - మాయేతి. మాయాద్యైః ప్రకృతిసూత్ర మహదహంకార పంచతన్మాత్రైః నవభిస్తత్త్వైః.వికారాః ఏకాదశేంద్రియాణి పంచమహా

**సూతుడు పలుకుచున్నాడు**

అర్థములన్నియు గురూపదేశగమ్యములు గావున, తొలుత గురువులకు నమస్కరించి, విష్ణువు యొక్క విరాడ్రూపములను గూర్చి వేద, తంత్రాదుల చేతను పద్మజుడుమొదలైన ఆచార్యులచేతను తెలుపబడిన రీతిలో చెప్పెదను. (4)

మాయాదులైన ప్రకృతి సూత్రమహదహంకార పంచతన్మాత్రల నెడి తొమ్మిది తత్త్వములచేత, ఏకాదశేంద్రియములు, పంచమహా భూతములతో కూడిన విరాట్ పురుషుడు నిర్మింపబడెను. ఆ విరాట్పురుషుని యందే ముల్లోకములు చైతన్యాధిష్ఠితములై యున్నవి. (5)

భూతానీతి షోడశ. తన్మయో విరాట్. సప్రసిద్ధః నిర్మితః యత్ర విరాజి సచిత్కే చేతనాధిష్ఠితే. భువనత్రయం దృశ్యతే. అనేనాంగాదికల్పనా సౌలభ్యం దర్శితమ్. (5)

శ్లో ॥ ఏతద్వై పౌరుషం రూపం భూః పాదౌ ద్యౌః శిరోనభః
నాభిః సూర్యోఽక్షిణీ నాసే వాయుః కర్ణౌ దిశః ప్రభోః - 6

ఇదియే పౌరుషమగు రూపము, అనగా విరాట్పురుషరూపము ఆ పురుషునికి భూమియే పాదములు స్వర్గమే శిరస్సు. ఆకాశమే నాభి. సూర్యుడే నేత్రము, వాయువే నాసిక, దిక్కులే చెవులు. (6)

టీ :- ఏకదితి. ఏతద్వై పౌరుషం రూపం పురుషస్య వైరాజస్య రూపమేవ ఈశ్వరేణాధిష్ఠితత్వాత్తదభేదవివక్షయా తస్యాపి రూపముచ్యతే. అంగకల్పనామాహ - భూః పాదావిత్యాదిభిస్త్రిభిః. భూరాద్యనువాదేన భగవత్పాదాదిభావనా విధీయతే. (6)

శ్లో ॥ ప్రజాపతిః ప్రజననమపానో మృత్యురీశితుః
తద్బాహవోలోకపాలాః మనశ్చంద్రో భ్రువౌయమః - 7

ప్రజాపతియే విరాట్పురుషుని మేఢ్రము (పురుషాంగము) మృత్యువే పాయువు (గుదము) లోకపాలకులే బాహువులు. చంద్రుడే మనస్సు. యముడే కనుబొమ్మ. (7)

శ్లో ॥ లజ్జోత్తరోఽధరో లోభో దన్తా జ్యోత్స్నా స్మయో భ్రమః
రోమాణి భూరుహో భూమ్నో మేఘాః పురుష మూర్ధజాః - 8

లజ్జయే పై పెదవి, లోభమే క్రింది పెదవి, దంతములే వెన్నెలలు, భ్రమమే చిరునవ్వు, భూమిపైనున్న చెట్లే రోమములు. మేఘములే శిరోజములు.(8)

టీ :- ప్రజేతి. ప్రజననం మేఢ్రం అపానం పాయుః. (7,8)



శ్లో ॥ యావానయం వై పురుషో యావత్యా సంస్థయా మితః
తావానసావపి మహాపురుషో లోకసరిస్థయా - 9

టీ :- అనుక్తమన్యదప్యేవమూహ్యామిత్యాహ - యావానితి. యావానయం వ్యష్టిపురుషః. తావాన్ సమష్టిపురుషః. స్వమానతః సప్తవితస్తిసంజ్ఞయా సంస్థయా అవయవసన్నివేశేన మితః పరిమితః (9)

ఈ విధముగ వ్యష్టియగు పురుషుడు ఆయా అవస్థలను అనుసరించి, మహాపురుషుడగును. (9)

శ్లో ॥ కౌస్తుభవ్యపదేశేన స్వాత్మజ్యోతిర్బిభర్త్యజః
తత్ప్రభా వ్యాపినీ సాక్షాచ్ఛ్రీవత్సమురసా విభుః - 10

టీ :- భూషణాదీన్యాహ - కౌస్తుభేతి. స్వాత్మజ్యోతిః శుద్ధజీవచైతన్యం యా తస్య కౌస్తుభస్య ప్రభా తామేవ శ్రీవత్సం బిభర్తి. (10)

ఆ విరాట్పురుషుని శుద్ధ జీవచైతన్యము కౌస్తుభమనెడి పేరుతో వెలుగొందుచున్నదై సాక్షాత్తు శ్రీవత్సమై వక్షఃస్థలమున అలరారును. (10)

శ్లో ॥ స్వమాయాం వనమాలాఖ్యాం నానాగుణమయీం దధత్
వాసశ్ఛందోమయం పీతం బ్రహ్మసూత్రం తివృత్స్వరమ్- 11

టీ :- స్వామితి. త్రివృత్స్వరం త్రిమాత్రం ప్రణవం. (11)

ఆ విరాట్పురుషుడు నానాగుణములతో కూడిన వనమాలికనే తన మాయగా ధరించును. ఆతని వసనము (వస్త్రము) ఛందస్సు. ఇది పసుపువన్నెగలది. త్రిమాత్రలతో కూడిన ప్రణవమే (ఓంకారమే) ఆతని బ్రహ్మసూత్రము. అనగా యజ్ఞోపవీతము. (11)



శ్లో ॥ బిభర్తి సాంఖ్యం యోగం చ దేవోమకరకుండలే
మౌలిం పదం పారమేష్ఠ్యం సర్వలోకాభయంకరమ్ - 12

టీ :- బిభర్తీతి. పారమేష్ఠ్యం పదం బ్రహ్మలోకం. (12)

ఆ విరాట్పురుషుని మకరకుండలములు సాంఖ్యయోగములు. బ్రహ్మలోకమే సర్వలోక అభయంకరమగు ఆతని శిరస్సు. (12)

శ్లో ॥ అవ్యాకృతమనన్తాఖ్యమాసనం యదధిష్ఠితః
ధర్మజ్ఞానాదిభిర్యుక్తం సత్త్వం పద్మమిహోచ్యతే - 13

టీ :- అవ్యాకృతమితి. అవ్యాకృతం ప్రధానం యత్ అధిష్ఠితః అధిష్ఠాయ స్థితః. తత్ ఆసనభూతం. పద్మం. సత్త్వం సత్త్వగుణః. (13)

ఆ విరాట్పురుషుని ఆసనము సత్త్వగుణ పద్మము. అది ప్రధానమైనది. అనంతమైనది. ధర్మజ్ఞానాదులతో కూడినది.(13)

శ్లో ॥ ఓజః సహో బలయుతం ముఖ్యతత్త్వం గదాం దధత్
అపాం తత్త్వం దరవరం తేజస్తత్త్వం సుదర్శనమ్ - 14

ఓజోగుణముచే కూడినదియు, బలయుతమైనదియుఅగు గదయే ముఖ్యతత్త్వము. శంఖమే ఆతని జలతత్త్వము. సుదర్శన చక్రమే ఆ పురుషుని తేజస్తత్త్వము. (14)

శ్లో ॥ నభోనిభం నభస్తత్త్వమసిం చర్మ తమోమయమ్
కాలరూపం ధనుః శార్ఙ్గం తథా కర్మమయేషుధిమ్ - 15

టీ :- ఓజ ఇతి. ముఖ్యతత్త్వం. ప్రాణతత్త్వం. శ్రు. "ప్రాణో వై ముఖ్య" ఇతి. - శ్రుతేః. దరవరం శంఖం. (14,15)

ఆకాశముననుండునది ఆతని నభస్తత్త్వము. అది ఆతని కరవాలము - చర్మమే తమోగుణము - శార్ఙ్గమనెడి ధనుస్సు కాలరూపము. కర్మలే అమ్ములపొదలు. (15)



శ్లో ॥ ఇంద్రియాణి శరానాహురాకూతీరస్య స్యందనమ్
తన్మాత్రాణ్యస్యాభివ్యక్తిం ముద్రయార్థక్రియాత్మతామ్ - 16

టీ :- ఇంద్రియాణీతి. ఆకూతిః క్రియాశక్తియుక్తం మనః. అస్య రథస్య. అభివ్యక్తిః బహిరభివ్యక్తం రూపం. ముద్రయా. ధృతయా అర్థక్రియాత్మతాం వరదిభయాదిరూపత్వం. తత్తన్ముద్రయా తథా తథా భావయేదిత్యర్థః. (16)

ఇంద్రియములే బాణములు. క్రియాశక్తి యుక్తమైన మనస్సు ఆతని రథము. ఆ రథమును అభివ్యక్తమొనర్చునవి తన్మాత్రలు. వరదాభయాది ముద్రలే అర్థ క్రియలు. (16)

శ్లో ॥ మండలం దేవయజనం దీక్షాసంస్కార ఆత్మనః
పరిచర్యా భగవతః ఆత్మనో దురితక్షయః - 17

టీ :- మండలమితి. మండలం దేవయజనం దేవపూజాభూమిం సూర్యమండలత్వేన భావయేదిత్యర్థః. అంతర్వహ్నిమండలం వా. దీక్షాసంస్కారః ఆత్మనః గురుకృతాం మంత్రదీక్షామేవ ఆత్మనస్తు తత్పూజాయోగ్యతాం భావయేదిత్యర్థః. పరిచర్యేతి. భగవతస్తాం పరిచర్యాం స్వస్య సకలపాక్షయాయ ఏవం రూపాం భావయేదిత్యర్థః (17)

సూర్యమండలమే దేవతలనర్చించుస్థానము. దీక్షయే సంస్కారము భగవంతుని పరిచర్యయే (సేవయే) ఆత్మచేసిన పాపములను తొలగించును. (17)



శ్లో ॥ భగవాన్ భగశబ్దార్థం లీలాకమలముద్వహన్
ధర్మం యశశ్చ భగవాంశ్చామరవ్యజనే భజత్ - 18

టీ :- పూర్వమాసనం పద్మయుక్తం ఇదానీమంతస్థ ్ం పద్మమాహ - భగవానితి. భగశబ్దార్థమైశ్వర్యాదిషాడ్గుణ్యం. (18)

శ్లో ॥ ఆతపత్రంతు వైకుంఠం ద్విజా ధామాఽకుతోభయమ్
త్రివృద్వేదః సుపర్ణాఖ్యో యజ్ఞం వహతి పూరుషమ్ - 19

టీ :- ధర్మమితి. హే ద్విజాః. ద్విజేత్యేకవచనాంతో వా పాఠః. అకుతోభయం కైవల్యం ధామ గృహం అభజత్. యద్వా వైకుంఠస్యైవ విశేషణం అకుతోభయం ధామేతి. త్రివృదితి. త్రివృత్ ఋగ్యజుస్సామ రూపో వేదః. శ్రు. "సుపర్ణోసి గరుత్మాన్ త్రివృత్తే శిర" ఇత్యాది మంత్రలిగాత్. యజ్ఞం యజ్ఞరూపం పురుషం. శ్రు. "యజ్ఞోవై విష్ణు" రితి శ్రుతేః. (19)

శ్లో ॥ అనపాయినీ భగవతీ శ్రీః సాక్షాదాత్మనో హరేః
విష్వక్సేనస్తంత్రమూర్తి ర్విదితః పార్షదాధిపః - 20

టీ :- అనపాయినీ హరేః శక్తిః. తత్ర హేతుః. సాక్షాదాత్మనః. స్వస్వరూపస్య చిద్రూపత్వాత్తస్యాస్తదభేదాదిత్యర్థః. విష్వక్సేన ఇతి.

సమగ్రమగు ఐశ్వర్యము, వీర్యము (బలము), యశస్సు (కీర్తి), శ్రీ (సంపద), జ్ఞానము, వైరాగ్యము అనెడి ఆరు విధములైన వాటిని ధరించుటచే భగవంతుడను పేరు వచ్చినది. ఆతడు చేతిలో ధరించు లీలాకమలమే ఈ సంపదలకు ప్రతీకము. ఆతనికి సమర్పించు చామరములు, వ్యజనములే ధర్మయశస్సులు.(18)

తెల్లగొడుగే ఎచటి నుండియు భయములేనిదగు వైకుంఠము (నివాస స్థానము) ఋగ్యజుస్సామరూపమైన వేదమే గరుత్మంతుని అవతారము. యజ్ఞమే పురుష రూపము.(19)

లక్ష్మియే ఆ భగవంతుని అనపాయినియగు శక్తి (చిద్రూపిణియగుటచే) హరికి అభిన్నురాలే. పాంచరాత్రాద్యాగమ రూపమైన తంత్ర స్వరూపమే విష్వక్సేనుడు. అణిమాద్యష్టసిద్ధులే ద్వారపాలకులు. (20)



తంత్రమూర్తిః పాంచరాత్రాద్యగమరూపః. యేణిమాదయో అష్టౌ గుణాః తే హరేర్ద్వారపాలాః నందాదయః (20)

శ్లో ॥ వాసుదేవః సంకర్షణః ప్రద్యుమ్నః పురుషః స్వయమ్
అనిరుద్ధ ఇతి బ్రహ్మన్మూర్తిర్వ్యూహోஉభిధీయతే - 21

టీ :- తస్యైవ చతుర్వ్యూహోపాసనమాహ - వాసుదేవ ఇతి. వాసుదేవాదిశబ్దైః పురుషః శ్రీనారాయణ ఏవ స్వయం మూర్తివ్యూహే ఉపాస్య ఇత్యభిధీయతే. (21)

శ్లో ॥ స విశ్వస్తైజసః ప్రాజ్ఞ స్తురీయ ఇతి వృత్తిభిః
అర్థేంద్రియాశయజ్ఞానై ర్భగవాన్ పరిభావ్యతే - 22

టీ :- తస్యైవాధ్యాత్మం చతుర్ధోపాసనమాహ - స ఇతి. స ఏవ భగవాన్ విశ్వాదిశబ్దైః వృత్తిభిర్జాగ్రదాద్యవస్థాభిః పరిభావ్యతే తద్వృత్త్యుపాధీనాహ - అర్థాః బాహ్యాః. ఇంద్రియం మనః. ఆశయస్తదుభయం సంస్కారయుక్తమజ్ఞానం జ్ఞానం త్రితయసాక్షీ. తైః (22)

వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు అను పేర్లతో కూడిన ఆ విరాట్పురుషుడే నారాయణుడు. ఈ నాలుగు పేర్లతో నాలుగు వ్యూహాలతో నాలుగు రూపములతో పూజింప బడును. (21)

ఆ విరాట్పురుషుడు విశ్వుడు, తైజసుడు, ప్రాజ్ఞుడు, తురీయుడు అను నాలుగు పేర్లతో జాగ్రదాద్యవస్థలచేతను, వాటి బాహ్యోపాధుల చేతను, ఇంద్రియములచేతను, జ్ఞానముల చేతను భావింపబడును. (22)



శ్లో ॥ అంగోపాంగాయుధాకల్పైర్భగవాంస్తచ్చతుష్టయమ్
బిభర్తి స్మ చతుర్మూర్తి ర్భగవాన్హరిరీశ్వరః -23

టీ :- ఉక్తచతుర్వ్యూహాధ్యాత్మోపాసనాద్వయేఽపి పూర్వోక్తమంగాద్యుపాసనమాహ - అంగేతి. అంగాదిభిరుపలక్షితో భగవాన్ హరిః వాసుదేవాదిచతుర్మూర్తిస్సన్. విశ్వాదిచతుష్టయం బిభర్తి స్మ. విశ్వాదిభావేఽపి తన్నియంతుస్తస్య న జీవత్వమిత్యాహ - విశ్వాదిచతుష్టయం బిభ్రదపి భగవానీశ్వర ఏవేతి. (23)

శ్లో ॥ ద్విజఋషభ స ఏవ బ్రహ్మయోనిః స్వయందృక్
స్వ మహిమ పరిపూర్ణో మాయయా చ స్వయైతత్
సృజతి హరతి పాతీత్యాఖ్యయానా
వృతాక్షో వివృత ఇవ నిరుక్త స్తత్పరైరాత్మలభ్యః - 24

టీ :- తస్యైవ బ్రహ్మాదిత్రిమూర్తితామాహ - ద్విజఋషభేతి. స ఏష భగవాన్. బ్రహ్మయోనిర్వేదస్య కారణమిత్యాదిహేతుత్రయం వస్తుతో భేదాభావేఽపి చ ఏతజ్జగత్ స్వమాయయా సృజతి హరతి పాతీతి కృత్వా ఆఖ్యయా బ్రహ్మాదిరూపయా అనావృతాక్షః అనాచ్ఛన్నజ్ఞానోఽపి వివృత ఇతి భిన్న ఇవ. నిరుక్తశ్శాస్త్రేషు న తు భిన్నః. అత్ర

అంగములచేతను, ఉపాంగములచేతను, ఆయుధములచేతను, భగవంతుడైన హరి విశ్వ, తైజస, ప్రాజ్ఞ, తురీయ నామములతోడను, వాసుదేవాది చతుర్వ్యూహములతోడను, నాలుగు మూర్తుల రూపముల తోడను విరాజిల్లుచున్నాడు. (23)

ఆ విరాట్పురుషుడు తనకు భిన్నముకాని ఈ జగత్తును తన మాయచే సృష్టించుచున్నాడు, పాలించుచున్నాడు, ఉపసంహరించుచున్నాడు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాది రూపములచే భిన్నుడుగా కనబడుచున్నను, భిన్నుడు కాదు. ఆతని యందే మనస్సు నిలిపినవారికి ఆత్మస్వరూపమున లభించుచున్నాడు. (24)



విద్వదనుభవం ప్రమాణయతి – యతస్తత్పరైరాత్మ త్వేనైవ లభ్యత ఇతి. (24)

శ్లో ॥ శ్రీ కృష్ణ కృష్ణ సఖ వృష్ణ్యృష భావనిద్రు
గ్రాజన్య వంశదహనానపవర్గవీర్య
గోవింద గోపవనితావ్రజభృత్యగీత
తీర్థశ్రవః శ్రవణమంగళ పాహి భృత్యాన్ – 25

టీ :– యస్యేదముపాసనముక్తం. తం శ్రీకృష్ణం ప్రార్థయతే – శ్రీకృష్ణేతి. కృష్ణసఖ అర్జునసఖ. వృష్ణిశ్రేష్ఠ అవనిద్రుహో యే రాజన్యాస్తేషాం వంశస్య దహన, అనపవర్గమక్షీణం వీర్యం యస్య గోపవనితానాం వ్రజాః సమూహాః భృత్యాశ్చ నారదాదయః. తైర్గీతం తీర్థభూతం శ్రవః కీర్తిర్యస్య. శ్రవణమేవ మంగలం యస్య. (25)

కృష్ణుని (అర్జునుని) సఖుడవైన ఓ శ్రీకృష్ణా! వృష్ణివంశ శ్రేష్ఠుడా! లోకపీడకులైన రాజులను వధించిన వాడా! అక్షీణ పరాక్రమము గలవాడా! గోవిందుడా! గోపవనితలు, గొల్లపల్లెల చెలికాండ్ర గీతములను, నారదాదులు పాడెడి తీర్థసమానములైన గీతములను వినువాడా! శ్రవణమే మంగళముగా గలవాడా! నీ సేవకులను కాపాడుము. (నీ నామ, గుణ, లీలాదులు శ్రవణం చేయుట వలననే జీవులకు మంగళమగును. మేమంతా మీ సేవకులము కృపతో మమ్ము రక్షించండి.) (25)

శ్లో ॥ య ఇదం కల్య ఉత్థాయ మహాపురుష లక్షణమ్
తచ్చిత్తః ప్రయతో జప్త్వా బ్రహ్మవేద గుహాశయమ్ – 26

టీ :– ఏతజ్జపత్రమాస్యాపి బ్రహ్మజ్ఞానం ఫలమిత్యాహ – య ఇతి. కల్యే ఉషః కాలే యస్తచ్చిత్తః. ప్రయతః శుచిస్సన్ గుహాశయం హృదిస్థం బ్రహ్మ పశ్యతి. (26)

ఇట్టి కృష్ణుని నామమును ఉషఃకాలమున నిద్రలేచి, జపించు వారికి హృదయమునందు ప్రతిష్ఠితమైన బ్రహ్మస్వరూపము అవగతమగును. (26)



**శౌనక ఉవాచ**

శ్లో ॥ శుకో యదాహ భగవాన్ విష్ణురాతాయ శృణ్వతే
సౌరో గణో మాసి మాసి నానా వసతి సప్తకః - 27

టీ :- మండలం దేవయజన మిత్యుక్త్వాబుద్ధిమాగతా సౌరీ తనుః వాసుదేవాది వ్యూహప్రసంగోక్త్యా సూర్యవ్యూహోఽనుస్మృతః. అతస్తం పృచ్ఛతి - శుక ఇతి. పంచమేయదాహ - తథాన్యే చ ఋషయో గంధర్వాప్సరసో నాగా గ్రామణ్యో యాతుధానా దేవా ఇత్యేకైకశో గణాస్సప్తేత్యాదినా. సౌరః సూర్యసంబంధీ సప్తకో గణః. (27)

శ్లో ॥ తేషాం నామాని కర్మాణి సంయుక్తానామధీశ్వరైః
బ్రూహి నః శ్రద్ధధానానాం వ్యూహం సూర్యాత్మనోహరేః - 28

టీ :- తేషామితి. తేషాం సప్తానాం అధీశ్వరైః తత్తత్పతిభిః. తత్తన్మాయోపాధికృతసూర్త్యైర్వా వ్యూహం విభాగం. (28)

**శౌనకుడు పలుకుచున్నాడు**

శ్రీశుకుడు విష్ణురాతునకు సౌర విజ్ఞానమునిట్లు బోధించుచున్నాడు - సూర్యసంబంధముగల గణములు ఏడు అవి ఋషి, గంధర్వ, అప్సరో, నాగ, గ్రామణ్య, యాతుధాన, దేవగణములు ప్రతి మాసమున సంభవించుచుండును. (27)

ఆ సప్త గుణముల అధీశ్వరులు, వారి అధినాథులు, ఆయా మాసములో వచ్చెడి సూర్యులు, వారి వ్యూహములు. ఇవన్నియు సూర్యాత్ముడైన ఆ శ్రీహరి వ్యూహములే. (కావున వాటిని మేము శ్రద్ధగా వినగోరెదము దయచేసి చెప్పండి) (28)



**సూత ఉవాచ**

శ్లో ॥ అనాద్య విద్యయా విష్ణోరాత్మనః సర్వదేహినామ్
నిర్మితో లోకతంత్రో యం లోకేషు పరివర్తతే - 29

టీ :- తత్ర తావత్ వ్యూహం నిరూపయితుం ప్రథమం సూర్యస్వరూపమాహ - అనాదీతి. అనాద్యవిద్యయా మాయయా. అయం సూర్యః లోకతంత్రః. లోకయాత్రాప్రవర్తకః. (29)

**సూతుడు పలికెను**

సర్వదేహులకాత్మయైన విష్ణువు యొక్క మాయచే లోకయాత్రను నిర్వహించుటకొరకు సూర్యుడు నియోగింపబడెను. (29)

శ్లో ॥ ఏక ఏవ హి లోకానాం సూర్య ఆత్మా౽దికృద్ధరిః
సర్వవేద క్రియామూల మృషిభిర్బహుధోదితః - 30

టీ :- అతస్తస్య క్రియాభేదోపాధికమేవ నానాత్వం దృశ్యతే న స్వత ఇత్యాహ - ఏక ఏవేతి. శ్రు. "సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చే"తి శ్రుతేః. లోకానాం జగతాం ఆత్మా ఆదికృత్. సృష్టికర్తా. హరిరేవ సూర్యః. స చ పర్వాసాం వేదోక్తక్రియాణాం మూలం సన్. తేన తేనోపాధినా బహుధా ఉదితః. ఉక్తః. (30)

సూర్య ఆత్మా జగతస్త స్థుషశ్చ' అను వేదవాక్యమునసుసరించి, లోకయాత్రాకారకుడైన సృష్టికర్తయగు విష్ణువే సూర్యుని రూపమున వెలుగుచున్నాడు. ఆతడు సమస్త వేదోక్త కర్మలకు ఉపాధియైనవాడు. (30)

శ్లో ॥ కాలో దేశః క్రియా కర్తా కారణం కార్యమాగమః
ద్రవ్యం ఫలమితి బ్రహ్మన్నవధోక్తో జయా హరిః - 31

కాలరూపమును దాల్చిన హరి ద్వాదశాదిత్యుల రూపములతో కనబడుచున్నాడు. సర్వకర్మలయందు ప్రవృత్తికై ఆ విష్ణుమాయ తొమ్మిది



టీ :- కాలరూపధారిణో హరేర్ద్వాదశాదిత్యరూపభేదం క్రియోపాధికం దర్శయితుం ప్రథమం సర్వకర్మప్రవృత్తయే మాయాకృతం నవధా భేదమాహ - కాల ఇతి. కాలః ప్రాతరాదిః దేశః సమాధిః క్రియా అనుష్ఠానం కర్తా బ్రాహ్మణాదిః. కరణం స్రుగాది ఆగమః మంత్రాదిః . ద్రవ్యం వ్రీహ్యాది ఫలం స్వర్గాది.(31)

భేదములను పొందుచున్నది. ఉదయాదికాలముగాను, సమాధి దేశముగాని, అనుష్ఠానాదిక్రియగాను, బ్రాహ్మణాది కర్తగాను, స్రుగాది కరణముగాను, యాగాది కార్యముగాను, మంత్రాద్యాగమము గాను, ధాన్యరూపద్రవ్యముగాను, స్వర్గాది ఫలముగాను తొమ్మిది విధములగుచున్నది. (31)

శ్లో ॥ మధ్వాదిషు ద్వాదశసు భగవాన్ కాలరూపధృక్
లోకతంత్రాయ చరతి పృథక్ ద్వాదశభిర్గణైః - 32

టీ :- మధ్వాదిష్వితి. తత్ర కాలస్వరూపధారీ భగవాన్. పృథక్చరతి మధ్వాదిషు చైత్రాదిషు. లోకతంత్రాయ లోకయాత్రానిర్వాహాయ(32

తన లోకయాత్రను నిర్వహించుటకై భగవంతుడు వసంతాది షడ్ఋతువుల (వేర్వేరు పన్నెండుగురు గణాలతోబాటు) రూపమున కాలరూపమును ధరించుచున్నాడు. వసంతము, గ్రీష్మము, వర్షము, శరత్తు, హేమంతము, శిశిరము అను ఋతువులు సూర్యుని ఆత్మలే. పన్నెండు మాసములతో కూడి యీ ఆరు ఋతువులు ప్రవర్తిల్లును. (32)

శ్లో ॥ ధాతా కృతస్థలీ హేతిర్వాసుకీ రథ కృన్మునే!
పులస్త్యస్తుంబురురితి మధుమాసం నయంత్యమీ - 33

టీ :- తానేవ గణానాహ - ద్వాదశభిః ధాతేతి. ధాతా సూర్యఃకృతస్థలీ అప్సరాః హేతిః రాక్షసః వాసుకిర్నాగః. రథకృత్ యక్షః. పులస్త్యః ఋషిః. తుంబురుః గంధర్వః. నయంతి అనువర్తయంతి. (33)

ధాత (సూర్యుడు), కృతస్థలీ (అప్సరసలు), హేతీ (రాక్షసులు), వాసుకి (నాగరాజు), రథకృత్ (యక్షుడు), పులస్త్యుడు (ఋషి), తుంబురుడు (గంధర్వుడు), అను వీరు చైత్రమాసము నందలి సౌరగణము. (33)



శ్లో ॥ అర్యమా పులహోఽథౌజాః ప్రహేతిః పుంజికస్థలీ
నారదః కచ్ఛనీరశ్చ నయంత్యేతే స్మ మాధవమ్ - 34

టీ :- అర్యమేతి అథౌజాయక్షః పాఠాంతరే జాత ఇతి ప్రహేతిః రాక్షసః నారదో గంధర్వః. కంజనీరో నాగః. పాఠాంతరే కచ్ఛనీర ఇతి. మాధవం వైశాఖం. (34)

అర్యమా (సూర్యుడు), పులహుడు (ఋషి), ఓజః (యక్షుడు) ప్రహేతి (రాక్షసుడు), పుంజికస్థలి (అప్సరస), నారదుడు (దేవర్షి), కచ్ఛనీరుడు (నాగదేవత), అను వీరు వైశాఖ మాసము నందలి సౌరగణము. (34)

శ్లో ॥ మిత్రోఽత్రిః పౌరుషేయోఽథ తక్షకో మేనకా హాహాః
రథస్వన ఇతి హ్యేతే శుక్రమాసం నయన్త్యమీ - 35

టీ :- మిత్ర ఇతి. మిత్రస్సూర్యః పౌరుషే యోరాక్షసః. రథస్వనో యక్షః. శుక్రమాసం జ్యేష్ఠం నయంతి అనువర్తయంతి. (35)

మిత్రుడు (సూర్యుడు), పౌరుషేయుడు (రాక్షసుడు), తక్షకుడు (నాగుడు), మేనక (అప్సరస), హాహా (గంధర్వుడు), రథస్వనుడు (యక్షుడు), అను వీరు శుక్ర (జ్యేష్ఠ) మాసమునందలి సౌరగణము. (35)

శ్లో ॥ వసిష్ఠో వరుణోరంభా సహజన్యస్త థా హుహూః
శుక్రశ్చిత్రస్వనశ్చైవ శుచిమాసం నయంత్యమీ - 36

టీ :- వసిష్ఠ ఇతి. వరుణః సూర్యః. సహజన్యో యక్షః. శుక్రో నాగః . చిత్రస్వనో రాక్షసః. శుచిమాసం. ఆషాఢం. (36)

వసిష్ఠుడు (మహర్షి), వరుణుడు (సూర్యుడు), రంభ (అప్సరస), సహజన్యుడు (యక్షుడు), హూహూ (గంధర్వుడు), శుక్రుడు (నాగదేవత), చిత్రస్వనుడు (రాక్షసుడు), అను వీరు శుచి (ఆషాఢ) మాసమునందలి సౌరగణము.(36)



శ్లో ॥ ఇంద్రో విశ్వావసుః శ్రోతా ఏలాపత్రస్తథాంగిరాః
ప్రమ్లోచా రాక్షసో వర్యో నభోమాసం నయంత్యమీ - 37

టీ :- ఇంద్ర ఇతి. ఇంద్రః సూర్యః. విశ్వావసుః. గంధర్వః. శ్రోతా యక్షః. ఏలాపుత్రో నాగః. చర్యోరాక్ష ఇతి. స్వయమేవ వ్యాఖ్యాతం. నభోమాసం శ్రావణం. (37)

ఇంద్రుడు (సూర్యుడు), విశ్వావసువు (గంధర్వుడు), శ్రోత (యక్షుడు), ఏలాపత్రుడు (నాగదేవత), ఆంగిరసుడు (ఋషి), ప్రమ్లోప్సరన్నవర్యుడు (రాక్షసుడు) అను వీరు నభో (శ్రావణ) మాసమునందలి సౌరగణము. (37)

శ్లో ॥ వివస్వానుగ్రసేనశ్చ వ్యాఘ్ర ఆసారణో భృగుః
అనుమ్లోచా శంఖపాలో నభస్యాఖ్యం నయంత్యమీ - 38

టీ :- వివస్వానితి. వివస్వాన్ సూర్యః ఉగ్రసేనః గంధర్వః. వ్యాఘ్రో రాక్షసః. ఆసారణో యక్షః. భృగుః ఋషిః. అనుమ్లోచా అప్సరాః శంఖపాలో నాగః. నభస్యాఖ్యం భాద్రపదం. (38)

వివస్వాన్ (సూర్యుడు), ఉగ్రసేనుడు (గంధర్వుడు) వ్యాఘ్రుడు (రాక్షసుడు) ఆసారణుడు (యక్షుడు), భృగువు (ఋషి), అనుమ్లోచా ప్సరస శంఖపాలుడు (నాగదేవత) అను వీరు నభస్యే (భాద్రపద) మాసమునందలి సౌరగణము.(38)

శ్లో ॥ పూషాధనంజయో వాతః సుషేణః సురుచిస్తథా
ఘృతాచీ గౌతమశ్చేతి తపోమాసం నయంత్యమీ - 39

టీ :- పూషేతి. ధనంజయో నాగః. వాతో రాక్షసః. సుషేణో గంధర్వః సురుచిర్యక్షః. తపోమాసం మాఘం. మాసక్రమాతిలంఘనం తు

పూష (సూర్యుడు), ధనంజయుడు (నాగదేవత), వాతుడు (రాక్షసుడు), సుషేణుడు (గంధర్వుడు), సురుచి (యక్షుడు), ఘృతాచీ (అప్సరస), గౌతముడు (ముని), అను వీరు తపో (మాఘ) (భాద్రపదమాసము తరువాత ఆశ్వీయుజము రావలసియుండగా ఇచట మాఘము చెప్పబడినది. ఈ మాస క్రమాతిలంఘనము



కౌర్మోక్తాదిత్యక్రమానుసారేణ వైష్ణవే తు మాసక్రమేణైవోక్తిః. క్వచిన్నామవ్యత్యయస్తు కల్పభేదేనేతి జ్ఞేయం. (39)

కూర్మపురాణోక్త సూర్యానుక్రమముతో ఏర్పడినదని గ్రహింపవలెను. విష్ణు పురాణములో మాత్రము, మాసములు యథాక్రమముగనే ఉన్నవి. కొన్ని మాసములకు పేర్లు మారుట అనునది కల్పభేదముననుసరించి యే అని తెలిసికొనవలెను.) మాసమునందలి సౌరగణము. (39)

శ్లో ॥ క్రతుర్వర్చా భరద్వాజః పర్జన్యః సేనజిత్తథా
విశ్వఐరావతశ్చైవ తపస్యాఖ్యం నయంత్యమీ - 40

టీ :- క్రతురితి. క్రతుర్యక్షః వర్చారాక్షసః వర్చ ఇతి పాఠాంతరే - పర్జన్యః సూర్యః. సేనజిదప్సరాః. విశ్వో గంధర్వః. ఐరావతో నాగః. తపస్యాఖ్యం ఫాల్గునం. (40)

క్రతువు (యక్షుడు) వర్చుడు (రాక్షసుడు), భరద్వాజుడు (ఋషి), పర్జన్యుడు (సూర్యుడు), సేనజిత్ (అప్సరస), విశ్వుడు (గంధర్వుడు), ఐరావతుడు (నాగదేవత) అనువీరు తపస్య (ఫాల్గుణ) మాసమునందలి సౌరగణము. (40)

శ్లో ॥ అథాంశుః కశ్యపస్తార్క్ష్య ఋతసేనస్తథోర్వశీ
విద్యుచ్ఛత్రుర్మహా శంఖః సహోమాసం నయంత్యమీ - 41

టీ :- అథేతి. అంశుః సూర్యః. అంశ ఇతి వా పాఠః తార్క్ష్యో యక్షః ఋతసేనో గంధర్వః. విద్యుచ్ఛత్రుః రాక్షసః మహాశంఖో నాగః. సహోమాసం మార్గశీర్షం. (41)

అంశువు (సూర్యుడు), కశ్యపుడు (ఋషి), తార్క్ష్యుడు (యక్షుడు), ఋతుసేనుడు (గంధర్వుడు), ఊర్వశి (అప్సరస), విద్యుచ్ఛత్రువు (రాక్షసుడు), మహాశంఖుడు (నాగదేవత) అనువీరు సహో (మార్గశిర) మాసమునందలి సౌరగణము. (41)

 

శ్లో ॥ భగః స్ఫూర్జోఽరిష్టనేమిరూర్ణ ఆయుశ్చ పంచమః
కర్కోటకః పూర్వచిత్తిః పుష్యమాసం నయంత్యమీ - 42

టీ :- భగ ఇతి. భగస్సూర్యః. స్ఫూర్జో రాక్షసః. అరిష్టనేమిర్గంధర్వః ఊర్ణో యక్షః. ఆయుః ఋషిః. కర్కోటకో నాగః. పూర్వచిత్తిరప్సరాః (42)

భగుడు (సూర్యుడు), స్ఫూర్జుడు (రాక్షసుడు), అరిష్టనేమి (గంధర్వుడు), ఊర్ణుడు (యక్షుడు), ఆయువు (ఋషి), కర్కోటకుడు (నాగదేవత), పూర్వచిత్తి అనువారు పుష్యమాసము (నా(శయింతురు) నందలి సౌరగణము. (42)

శ్లో ॥ త్వష్టా ఋచీకతనయః కంబలశ్చ తిలోత్తమా
బ్రహ్మాపేతోఽథ శతజిద్ధృతరాష్ట్ర ఇషంభరాః - 43

టీ :- త్వష్టేతి. ఋచీకతనయో జమదగ్నిః. కంబలాశ్వో నాగః. బ్రహ్మాపేతో రాక్షసః. శతజిద్యక్షః. ధృతరాష్ట్రో గంధర్వః. ఇషంభరా ఆశ్వయుజపాలకాః. (43)

త్వష్ట (సూర్యుడు), ఋచీకతనయుడు (జమదగ్ని), కంబలుడు (నాగదేవత), తిలోత్తమ (అప్సరస), బ్రహ్మాపేతుడు (రాక్షసుడు), శతజిత్తు (యక్షుడు), ధృతరాష్ట్రుడు (గంధర్వుడు) ఇషంభరః (అశ్వపాలకులు). అను వీరంతా ఆశ్వయుజమాసమునందలి సౌరగణము.(43)

శ్లో ॥ విష్ణురశ్వతరోఽరంభా సూర్యవర్చాశ్చ సత్యజిత్
విశ్వామిత్రో మఖాపేత ఊర్జమాసం నయంత్యమీ - 44

విష్ణువు (సూర్యుడు), అశ్వతరుడు (నాగదేవత) రంభ (అప్సరస), సూర్యవర్చుడు (గంధర్వుడు), సత్యజిత్ (యక్షుడు), విశ్వామిత్రుడు (ఋషి), మఖాపేతుడు (రాక్షసుడు) అనువీరు ఊర్జ (కార్తీక) మాసమునందలి సౌరగణము. (44)



శ్లో ॥ ఏతా భగవతో విష్ణోరాదిత్యస్య విభూతయః
స్మరతాం సంధ్యయోర్నౄణాం హరంత్యంహో దినేదినే - 45

వీరెల్లరు భగవంతుడైన విష్ణువు యొక్క ఆదిత్యరూపములైన విభూతులు (సంపదలు). వీరిని సంధ్యాకాలములో స్మరించువారికి అహరహము పాపములు తొలగిపోవును. విష్ణువు యొక్క ఈ ఆదిత్య రూప విశేషములు కూర్మపురాణములో విభజించి చూపబడినవి(45)

శ్లో ॥ ద్వాదశస్వపి మాసేషు దేవోఽసౌ షడ్భిరస్యవై
చరన్ సమంతాత్తనుతే పరత్రేహ చ సన్మతిమ్.- 46

దేవదేవుడైన సూర్యభగవానుడు గంధర్వాది షట్కముతో కూడినవాడై సంచరించుచు మనుష్యులకు శుభగతులనొసగును. ఐహికాాముష్మిక ఫలములను ప్రసాదించును. ఈ శ్లోకముచే గాయత్రీ మంత్రార్థము సూచించబడినది.(46)

టీ :- విష్ణురితి. విష్ణురాదిత్యః. అశ్వతరోనాగః. సూర్యవర్చా గంధర్వః. సత్యజిద్యక్షః మఘూపేతో రాక్షసః, ఊర్జమాసం కార్తికం. ఏతే చాదిత్యాదయః కౌర్మే విభజ్యోక్తాః. శ్లో. “ధాతార్యమా చ మిత్రశ్చ వరుణశ్చేంద్ర ఏవ చ, వివస్వానథ పూషా చ పర్జన్యశ్చాంశురేవ చ. భగస్త్వష్టా చ విష్ణుశ్చ ఆదిత్యాద్వాదశస్మృతాః, పులస్త్యః పులహశ్చాత్రిర్వశిష్ఠోఽథాంగిరా భృగుః. గౌతమోథ భరద్వాజః కశ్యపః క్రతురేవ చ, జమదగ్నిః కౌశికశ్చ మునయో బ్రహ్మవాదినః. రథకృచ్చ రథౌజాశ్చ గ్రామణీశ్చ రథస్వనః, సహజన్యస్తతశ్శ్రోతా సారణస్సురజిత్తథా. పాఠాంతరే స్రోతేతి సురుచిరితి చ. క్రతుస్తార్క్ష్యోఽథ ఊర్జశ్చ శతజిత్సత్యజిత్తథా. ఏతే యక్షాః. అథహేతిః ప్రహేతిశ్చపౌరుషేయో రథస్వనః, చర్యో వ్యాఘ్రో మరుద్వర్చో విద్యుత్స్ఫూర్జస్తథైవ చ.

బ్రహ్మోపేతశ్చ విప్రేంద్రయజ్ఞాపేతశ్చ రాక్షసాః పాఠాంతరేవర్య ఇతి. వాసుకిః కచ్ఛనీరశ్చ తక్షకశ్శుక్ర ఏవ చ, ఏలాపుత్రశ్శంఖపాలస్తథై రావతసంజ్ఞికః. ధనంజయో మహాశంఖస్తథా కర్కోటకో ద్విజాః, కంబలాశ్వశ్చాశ్వతరోవహంత్యేతే యథాక్రమం. పాఠాంతరే కంజనీర ఇతి. తుంబురుర్నారదో హాహాహూహూర్విశ్వావసుస్తథా, ఉగ్రసేన స్సుషేణశ్చ విశ్వోఽథ ఋతసేనకః. చిత్రసేనస్తథోర్ణాయుర్ధృతరాష్ట్రో ద్విజోత్తమాః, సూర్యవర్చా ద్వాదశేతి గంధర్వా గాయతాం వరాః. కృతస్థల్యప్సరోవర్యా తథాన్యా పుంజికస్థలీ, మేనకా సహజన్యా చ ప్రమ్లోచా చ ద్విజోత్తమాః. అనుమ్లోచా ఘృతాచీ చ విశ్వాచీచోర్వశీ తథా, అన్యాచ పూర్వచిత్తిస్స్యాదన్యాచైవ తిలోత్తమా రంభాచేతి ద్విజశ్రేష్ఠాస్తథైవాప్సరసస్మృతా" ఇతి. (44,45,46)

శ్లో ॥ సామర్గ్యజుర్భిస్తల్లింగైరృషయః సంస్తువన్త్యముమ్
గంధర్వాస్తం ప్రగాయన్తి నృత్యంత్యప్సరసోఽగ్రతః-47

టీ :- ఏతేషాం పృథక్కర్మాణి నిరూపయతి - త్రిభిః. గాంధర్వః ఇతి. అసౌ దేవసూర్యః. షడ్భిః గంధర్వాధిభిః. అస్య జనస్య సమంతాచ్చరన్. శుభాం మతిం తనుతే. గాయత్ర్యర్థోఽనేన సూచితః (47)

ఋషులు ఈ సూర్యభగవానుని సామ, ఋక్, యజుర్వేద మంత్రములతో స్తుతింతురు. గంధర్వులు గానము చేసెదరు. అప్సరసలు సూర్యుని ఎదుట నృత్యములు చేసెదరు. (47).



శ్లో ॥ ఉన్నహ్యంతి రథం నాగా గ్రామణ్యో రథయోజకాః
చోదయన్తి రథం పృష్ఠే నైఋతా బలశాలినః - 48

టీ :- సామేతి. తల్లింగైః సూర్యప్రకాశకైః. (48)

శ్లో ॥ వాలఖిల్యాః సహస్రాణి షష్టిర్బ్రహ్మర్షయోఽమలాః
పురతోఽభిముఖం యాన్తి స్తువన్తి స్తుతిభిర్విభుమ్ - 49

టీ :- ఉన్నహ్యంతీతి. ఉన్నహ్యంతి దృఢం బధ్నంతి, గ్రామణ్యో యక్షాః. నైఋతా రాక్షసాః. (49)

శ్లో ॥ ఏవం హ్యనాదినిధనో భగవాన్ హరిరీశ్వరః
కల్పే కల్పే స్వమాత్మానం వ్యూహం లోకానవత్యజః - 50

టీ :- కించ. వాలఖిల్యా ఇతి. ఏతే ప్రతిమాసం త ఏవ. విభుం సూర్యం. ఏవమితి. వ్యూహ్య విభజ్య. (50)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే ద్వాదశస్కంధే**
**ఆదిత్యవ్యూహ వివరణం నామైకాదశోఽధ్యాయః**

సూర్యుని రథమును యక్షులు దృఢముగ కట్టెదరు. వారే రథయోజకులై నడిపెదరు. బలశాలురైన రాక్షసులు రథమును అనుసరించి వెళ్ళెదరు. (నాగగణము త్రాళ్ళవలె రథమునకు బంధింపబడియుండెదరు. యక్షగణము రథమునలంకరించెదరు. బలశాలురైన రాక్షసులు రథమును వెనుకనుండి త్రోసెదరు)(48)

వేయిమంది వాలఖిల్యామహర్షులు, అరవైమంది నిర్మలులైన బ్రహ్మర్షులు, రథమునకెదురుగా వచ్చి, అనేక స్తుతులతో సూర్యభగవానుని ఆరాధింతురు. (49)

ఈ విధముగ అనాదినిధనుడైన విష్ణుభగవానుడు ప్రతికల్పములో తన వ్యూహములను (అవతారములను లేదా మహిమలను) కల్పించుచు, సకలలోకములను కాపాడును.(50)

**శ్రీమద్భాగవత**
**మహాపురాణము యొక్క ద్వాదశస్కంధమునందలి**
**ఏకాదశాధ్యాయము సమాప్తము.**



## ద్వాదశోఽధ్యాయః

**సూత ఉవాచ**

శ్లో ॥ నమో ధర్మాయ మహతే నమః కృష్ణాయ వేధసే
బ్రాహ్మణేభ్యో నమస్కృత్య ధర్మాన్వక్ష్యే సనాతనాన్ - 1

టీ :- ద్వాదశే తు పురాణోక్తసర్వార్థానుక్రమః కృతః, ప్రథమస్కంధ మారభ్య ప్రాధాన్యేన సమాసతః. తదేవమస్మిన్ పురాణే విస్తరణోక్తానర్థాన్ సంక్షేపతో వర్ణయిష్యన్ ధర్మాదీన్ ప్రణతి - నమ ఇతి. మహతే హరిభక్తిలక్షణాయ బ్రాహ్మణేభ్యః బ్రాహ్మణాన్ శాశ్వతాన్ అనాదీన్. ధర్మానిత్యుపలక్షణం - పురాణోక్తార్థానాం.(1)

శ్లో ॥ ఏతద్వః కథితం విప్రాః విష్ణోశ్చరితమద్భుతమ్
భవద్భిర్యదహం పృష్టో నరాణాం పురుషోచితమ్ - 2

టీ :- ఏతదితి. నరాణాం జీవానాం పురషత్వే ఉచితం శ్రవణాది యోగ్యం. (2)

## ద్వాదశాధ్యాయము

**సూతుడు పలికెను**

ఈ ద్వాదశాధ్యాయమున పురాణోక్తములగు సర్వార్థములు అనుసరించి చెప్పబడినవి. ప్రథమస్కంధము నుండి చివరి వరకు సారభూతముగ ఇవి వర్ణింపబడినవి. ఈ భాగవతమహాపురాణమున విస్తరముగ చెప్పబడిన అంశములన్నింటిని సంక్షిప్తముగ ఈ అధ్యాయము తెలుపుచున్నది. దానికి ఉపక్రమముగ ధర్మాదుల నమస్కారము ఇట్లు చెప్పబడుచున్నది. ఉత్కృష్టమగు ధర్మమునకు నమస్కారము. భగవంతుడైన కృష్ణునకు నమస్కారము. సనాతనులైన బ్రాహ్మణులకు నమస్కరించి, ధర్మములను తెలుపుచున్నాను. అని సూతుడు శౌనకాదిమునులతో పలికెను.(1)

ఓ మునులారా! విష్ణువు యొక్క అద్భుత చరిత్రమును గూర్చి మీరు అడిగినందున ఇప్పటివరకు వివరించితిని. ఈ చరిత్రము మానవులకు సకలార్థసాధకమై, శ్రవణాది యోగ్యమైయున్నది.(2)





శ్లో ॥ అత్ర సంకీర్తితః సాక్షాత్సర్వపాపహరో హరిః
నారాయణో హృషీకేశో భగవాన్ సాత్త్వతాంపతిః - 3

టీ :- ఏతత్ప్రపంచయతి - అత్రేతి. భగవానైశ్వర్యాదిషడ్గుణకః. సాక్షాత్సంకీర్తత ఇతి దేవతాకాండార్థః.(3)

శ్లో ॥ అత్ర బ్రహ్మపరం గుహ్యం జగతః ప్రభవాప్యయమ్
జ్ఞానం చ తదుపాఖ్యానం ప్రోక్తం విజ్ఞాన సంయుతమ్ - 4

టీ:- బ్రహ్మకాండార్థమాహ - అత్రేతి. గుహ్యం నిర్గుణం ప్రభవావ్యయం ప్రభవత్యస్మాదితి ప్రభవం అప్యేతస్మిన్ని త్యప్యయం తచ్చ తచ్చ. అనేనాశ్రయశబ్దార్థో దర్శితః విజ్ఞానసంయుతం అపరోక్షజ్ఞాన పర్యంతం. జ్ఞానం తదుపాఖ్యానం తద్ జ్ఞానం ఉపాఖ్యాయతే ప్రకాశ్యతే యేన తత్. జ్ఞానసాధనమిత్యర్థః(4)

శ్లో ॥ భక్తియోగః సమాఖ్యాతో వైరాగ్యం చ తదాశ్రయమ్
పారీక్షితముపాఖ్యానం నారదాఖ్యానమేవ చ - 5

సర్వపాపములను హరించువాడైన విష్ణువు ఈ భాగవతమున కీర్తింపబడినాడు. నారాయణుడు, హృషీకేశుడు, సత్త్వగుణవంతులైన మునులను కాపాడువాడైన ఆ శ్రీహరియే ఈ భాగవతమున నాయకుడు. (3)

ఈ భాగవతమున నిర్గుణ బ్రహ్మము జగత్తునకు ఆశ్రయమని తెలుపబడినది. అపరోక్షజ్ఞాన పర్యంతము జ్ఞానము బోధింపబడినది. ఇదంతయు విష్ణ్వధీనమని తెలుపబడినది.

(ఈ భాగవతపురాణములో పరమరహస్యమైన, అత్యంత గోపనీయమైన బ్రహ్మతత్త్వం వర్ణింపబడినది. ఆ బ్రహ్మములోనే ఈ జగత్తుయొక్క సృష్టి, స్థితి మరియు ప్రళయము యొక్క ప్రతీతి (భాసమానము) అగును. ఈ పురాణములో అట్టి పరమతత్త్వం యొక్క అనుభవాత్మక జ్ఞానము మరియు అట్టి జ్ఞానప్రాప్తికి ఆవశ్యకమైన సాధనలగూర్చి సుస్పష్టమైన నిర్దేశాలు, మార్గదర్శకాలు కలవు. (4)

సాధ్యసాధనరూపమైన (భగవత్ జ్ఞానము సాధ్యము, సాధ్యము భగవంతుడు, సాధనము యోగము) భక్తి యోగము చెప్పబడినది. ఈ ద్వాదశస్కంధములో పరీక్షిత్తు జననము నుండి అనేకాంశములు



టీ :- కర్మకాండార్థమాహ - వ్యాఖ్యాత ఇతి. భక్తియోగశ్చ సాధ్య సాధనరూపః. తదాశ్రయం భక్తియోగేన నిష్పాదితం ఏవం సామాన్యతో నిరూప్యేదానీం ద్వాదశస్కంధ ప్రకరణార్థానుక్రామతి - పారీక్షిత ముపాఖ్యానం పరీక్షిజ్జన్మాది. తత్ప్రస్తావాయ నారదాఖ్యానం చ. (5)

శ్లో ॥ ప్రాయోపవేశో రాజర్షేర్విప్రశాపాత్పరీక్షితః
శుకస్య బ్రహ్మర్షభస్య సంవాదశ్చ పరీక్షితః - 6

టీ :- ప్రాయోపవేశ ఇతి. బ్రహ్మర్షభస్య బ్రాహ్మణోత్తమస్య ఇతి ప్రథమస్కంధార్థః.(6)

శ్లో ॥ యోగధారణయోత్క్రాన్తిః సంవాదో నారదాజయోః
అవతారానుగీతం చ సర్గః ప్రాధానికోఽగ్రతః -7

టీ :- యోగేతి. ఉత్క్రాంతిరర్చిరాదిగతిః. ప్రాధానికః ప్రధానకార్య విరాడ్రూపః. అగ్రతః ఆదితః. మహదాదిక్రమేణేత్యర్థః ఇతి ద్వితీయ స్కంధార్థః. (7)

చెప్పబడినవి. పరీక్షిత్తు ప్రస్తావనను పురస్కరించుకొనిన నారదుని కథయు వర్ణితము. (5)

శృంగియను విప్రుని శాపము కారణముగ రాజర్షియగు పరీక్షిత్తు ప్రాయోపవేశము చేయుట, బ్రాహ్మణోత్తముడైన శుకునికీ, పరీక్షిత్తుకు మధ్య జరిగిన సంవాదము ఇది ప్రథమ స్కంధార్థము.(6)

యోగమార్గమున పరీక్షిత్తు అర్చిరాది గతులను పొందుట, నారద, బ్రహ్మల మధ్యన సంవాదము, ఆది నుండి భగవదవతారముల వర్ణనము ప్రధాన కార్య విరాడ్రూపమగు సృష్టి అనునవి ద్వితీయ స్కంధార్థమున చెప్పబడినవి. (7)



శ్లో ॥ విదురోద్ధవ సంవాదః క్షత్తృ మైత్రేయయోస్తతః
పురాణ సంహితా ప్రశ్నో మహా పురుష సంస్థితిః - 8

టీ :- విదురేతి. మహాపురుషస్య సంస్థితిః ప్రలయే తూష్ణీమవస్థానం(8

విదుర - ఉద్ధవులసంవాదము, క్షత్తృ - మైత్రేయుల సంవాదము, పురాణ సంహితలను గూర్చిన ప్రశ్న, మహాపురుషుల ప్రళయాకాల వస్థమున్నగునవి తృతీయాస్కంధార్థము వర్ణితము.(8)

శ్లో ॥ తతః ప్రాకృతికః సర్గః సప్తవైకృతికాశ్చయే
తతో బ్రహ్మాండ సంభూతి ర్వైరాజః పురుషోయతః - 9

టీ :- తత ఇతి. ప్రాకృతికః ప్రకృతిభవో గుణక్షోభరూపః. వైకృతికా మహదాదయః. చకారాద్వికారాశ్చ యే తేషాం చ సర్గః. (9)

అటు పిమ్మట ప్రకృతి సిద్ధమైన గుణక్షోభరూపమగు సర్గము, వైకృతికమగు మహదాదుల ఉత్పత్తి దాని నుండి బ్రహ్మాండము పుట్టుట, విరాట్పురుషుడు ఉద్భవించుట మున్నగునవి తృతీయస్కంధమున వర్ణింపబడినవి. (9)

శ్లో ॥ కాలస్య స్థూల సూక్ష్మస్య గతిః పద్మ సముద్భవః
భువ ఉద్ధరణేఽమ్భోధేర్హిరణ్యాక్షవధో యథా - 10

టీ :- కాలస్యేతి. గతిస్స్వరూపం ఉద్ధరణ ఉద్ధారణే. (10)

పద్మము నుండి పుట్టిన కాలము యొక్క స్థూల, సూక్ష్మ గతులు, భూమిని ఉద్ధరించుటకు హిరణ్యాక్షుని వధించుట మున్నగునవి తృతీయ స్కంధార్థమున వర్ణింపబడినది. (10)

శ్లో ॥ ఊర్ధ్వతిర్యగవాక్సర్గో రుద్రసర్గస్తథైవ చ
అర్ధనారీనరస్యాథ యతః స్వాయంభువో మనుః - 11

టీ :- ఊర్ధ్వేతి. అర్ధాభ్యాం నారీ చ నరశ్చ తస్య. (11)

ఊర్ధ్వ, తిర్యక్, అవాక్కుల సృష్టియు, రుద్రుని సృష్టియు అర్ధనారీశ్వరుల సృష్టియు, స్వాయంభువమనుసృష్టియు తృతీయ స్కంధార్థమున వర్ణితము. (11)



శ్లో ॥ శతరూపాచ యా స్త్రీణామాద్యా ప్రకృతిరుత్తమా
సంతానో ధర్మపత్నీనాం కర్దమస్య ప్రజాపతేః - 12

శ్లో ॥ అవతారో భగవతః కపిలస్య మహాత్మనః
దేవహూత్యాశ్చ సంవాదః కపిలేన చ ధీమతా - 13

టీ :- శతరూపేతి. సంతానో ధర్మపత్నీనామితి. నవబ్రహ్మ సముత్పత్తిరిత్యస్యానంతరం ద్రష్టవ్యం. (12, 13)

శ్లో ॥ నవబ్రహ్మసముత్పత్తిర్దక్షయజ్ఞ వినాశనమ్
ధ్రువస్య చరితం పశ్చాత్ పృథోః ప్రాచీనబర్హిషః -14

టీ :- నవేతి. చతుర్థస్కంధార్థమాహ - నవబ్రహ్మణాం మరీచ్యాదీనాం సముత్పత్తిః సంతానః. (14)

శ్లో ॥ నారదస్య చ సంవాదస్తతః ప్రైయవ్రతం ద్విజాః
నాభేస్తతో౽ను చరిత మృషభస్య భరతస్య చ - 15

టీ :- నారదస్యేతి. పంచమస్కంధార్థమాహ - తత ఇతి. ప్రైయవ్రతం ప్రియవ్రతస్య చరితం. (15)

శతరూపయనెడి ఆద్యస్త్రీ సృష్టిని గూర్చియు, కర్ధమ ప్రజాపతి యొక్క ధర్మపత్నుల సంతానమును గూర్చియు తృతీయస్కంధమున చెప్పబడినది. (12)

మహాత్ముడైన, భగవంతుడైన కపిలుని అవతారవిశేషములు, కపిలునితో దేవహూతి జరిపిన సంవాదము తృతీయస్కంధార్థమున వర్ణితము. (13)

నవబ్రహ్మల జననము, దక్షయజ్ఞ వినాశనము, ధ్రువుని చరితము, పృథువు, ప్రాచీనబర్హి అనువారి చరితము చతుర్థస్కంధార్థము వర్ణితము. (14)

నారదునితో సంవాదము, ప్రియవ్రతుని చరితము, నాభి, ఋషభుడు, భరతుల చరితము పంచమస్కంధార్థము వర్ణింపబడినది. (15)



శ్లో ॥ ద్వీపవర్షసముద్రాణాం గిరినద్యుపవర్ణనమ్
జ్యోతిశ్చక్రస్య సంస్థానం పాతాలనరకస్థితిః - 16

టీ :- ద్వీపేతి. ద్వీపాద్యుపవర్ణనం ప్రథమం సంక్షేపతః తతో ద్వీపాదీనాం యేగిరయోనద్యశ్చ తేషాముపవర్ణనం పాతాల నరకాదీనాం చ స్థితిః అనేనైవ నరకనిర్తకమజామీలోపాఖ్యానం చ గృహీతం తతః పరాచీనం. (16)

ద్వీపములు, వర్షములు, సముద్రములు, గిరులు, నదులు, మున్నగునవి వర్ణము, జ్యోతిశ్చక్రము (నక్షత్ర సమూహము) యొక్క సంస్థానము, పాతాళ నరకముల స్థితి, పంచమస్కంధార్థమున వర్ణింపబడినది. (16)

శ్లో ॥ దక్షజన్మ ప్రచేతోభ్యస్తత్పుత్రీణాం చ సంతతిః
యతో దేవాసురనరాస్తిర్యఙ్న గఖగాదయః - 17

టీ :- షష్ఠస్కంధార్థమాహ - దక్షజన్మేతి. (17)

ప్రచేతుని వలన దక్షుని జననము, దక్షుని పుత్రికల సంతానము, వారి వలన దేవాసురనరులు, తిర్యక్కులు, నగములు, పక్షులు మొదలగునవి జన్మించుట షష్ఠస్కంధమున వర్ణితము.(17)

శ్లో ॥ త్వష్టస్య జన్మ నిధనం పుత్రయోశ్చ దితేర్ద్విజాః
దైత్యేశ్వరస్య చరితం ప్రహ్లాదస్య మహాత్మనః - 18

టీ :- త్వాష్టస్యేతి. సప్తమార్థమాహ - పుత్రయోశ్చేతి. (18)

త్వష్ట జన్మించుట, మృతినొందుట, దితిపుత్రుల జననము, దైత్యరాజైన ప్రహ్లాదుడను మహనీయుని చరితము సప్తమస్కంధమున వర్ణింపబడినది.(18)



శ్లో ॥ మన్వంతరానుకథనం గజేంద్రస్య విమోక్షణమ్
మన్వంతరావతారాశ్చ విష్ణోర్హయశిరాదయః - 19

అష్టమస్కంధమున మన్వంతరముల అనుక్రమము, గజేంద్ర మోక్షకథ, మన్వంతరావతారములు, విష్ణువు యొక్క హయగ్రీవాద్యవతారకథనము వర్ణింపబడినది. (19)

శ్లో ॥ కౌర్మం ధాన్వంతరం మాత్స్యం వామనం చ జగత్పతేః
క్షీరోదమథనం తద్వదమృతార్థే దివౌకసామ్ - 20

టీ :- అష్టమార్థమాహ - మన్వంతరానుచరితమితి. క్వచిత్కస్యచిదనుక్తిః వ్యుత్క్రమోక్తిశ్చ భక్తిరసానుకూలత్వేనేతి. ద్రష్టవ్యం. (19,20)

విష్ణువు యొక్క కూర్మ, ధన్వంతరి, మత్స్య, వామనాద్యవతారముల కథనము అమృతము కొరకై దేవతలు తలపెట్టిన క్షీరసాగరమథనము అష్టమ స్కంధమున వర్ణితము.(20)

శ్లో ॥ దేవాసురమహాయుద్ధం రాజవంశానుకీర్తనమ్
ఇక్ష్వాకుజన్మ తద్వంశః సుద్యుమ్నస్య మహాత్మనః - 21

దేవాసురుల మధ్యన మహాయుద్ధము, వివిధ రాజవంశముల ప్రసక్తి, ఇక్ష్వాకుజననము, ఆతని వంశవర్ణము, మహాత్ముడగు సుద్యుమ్నుని కథ నవమస్కంధమున వర్ణితము. (21)

శ్లో ॥ ఇలోపాఖ్యానమత్రోక్తం తారోపాఖ్యానమేవ చ
సూర్యవంశానుకథనం శశాదాద్యా నృగాదయః - 22

ఇలోపాఖ్యానము, తారోపాఖ్యానము, సూర్యవంశము యొక్క కథనము, శశాదుల వర్ణనము, నృగాదుల వర్ణనము నవమస్కంధమున గలదు.(22)



శ్లో ॥ సౌకన్యం చాథ శర్యాతేః కకుత్స్థస్యచ ధీమతః
ఖట్వాంగస్యచ మాంధాతుః సౌభరేః సగరస్య చ - 23

సుకన్యకథ, శర్యాతికథ, కకుత్‌స్థుని కథ, ఖట్వాంగుని కథ, మాంధాత కథ, సౌభరికథ, సగరుని కథ నవమస్కంధమున వర్ణితము. (23)

శ్లో ॥ రామస్య కోసలేంద్రస్య చరితం కిల్బిషాపహమ్
నిమేరంగపరిత్యాగో జనకానాంచ సంభవః - 24

టీ :- దేవాసురేతి. నవమార్థమాహ - రాజవంశేతి.(21-24)

కోసలేంద్రుడైన రాముని చరితము పాపహరమై నవమ స్కంధమున వర్ణింపబడినది. అట్లే నిమి తన దేహమును చాలించుట, జనకుల జననము ఈ స్కంధము నందే వర్ణింపబడినది. (24)

శ్లో ॥ రామస్య భార్గవేంద్రస్య నిఃక్షత్రకరణం భువః
ఐలస్య సోమవంశస్య యయాతేర్నహుషస్యచ -25

టీ :- రామస్యేతి.సోమవంశాదుద్భూతస్యైలస్య చ యయాతేర్న హుషస్య చరితం. (25)

భార్గవరాముని (పరశురాముని) కథ, ఆతడు ఈ భూమిని క్షత్రియ రహితముగ చేయుట, చంద్రవంశమున కాద్యుడైన ఐలుని కథ, యయాతి చరితము, నహుష కథ నవమస్కంధమున వర్ణితము.(25)

శ్లో ॥ దౌష్యంతేర్భరతస్యాపి శంతనోస్తు త్సుతస్య చ
యయాతే ర్జ్యేష్ఠ పుత్రస్య యదోర్వంశోఽనుకీర్తితః - 26

దుష్యంతపుత్రుడైన భరతుని కథ, శంతనుని కథ, అతని సుతుడైన భీష్ముని కథ, యయాతి పెద్దకొడుకైన యదువు యొక్క వంశము ఈ నవమస్కంధముననే వర్ణితము.(26)



శ్లో ॥ యత్రావతీర్ణో భగవాన్ కృష్ణాఖ్యో జగదీశ్వరః
వసుదేవగృహే జన్మతతో వృద్ధిశ్చ గోకులే - 27

టీ :- దౌష్యంతేరితి. తత్సుతస్య భీష్యస్య. (26-27)

ఈ యదు వంశముననే జగత్పతియగు కృష్ణ భగవానుడు దయించెను. వాసుదేవుని యింట జన్మించిన ఈతడు గోకులమున పెరిగెను. ఈ కథ దశమస్కంధమున వర్ణితము.(27)

శ్లో ॥ తస్య కర్మాణ్య పారాణి కీర్తితాన్యసురద్విషః
పూతనాఽసుపయః పానం శకటోచ్చాటనం శిశోః - 28

ఆ కృష్ణ భగవానుని కర్మలు (లీలలు) అపారములై అందరిచే కీర్తింపబడినవి. శ్రీకృష్ణుడు పూతన ప్రాణములను పాలు త్రాగుట ద్వారా హరించుట, శకటాసురుని సంహరించుట దశమ స్కంధమున వర్ణితము. (28)

శ్లో ॥ తృణావర్తస్య నిష్పేషస్తథైవ బకవత్సయోః
ధేనుకస్య సహభ్రాతుః ప్రలంబస్య చ సంక్షయః - 29

టీ :- దశమస్కంధార్థమాహ - తస్య కర్మాణీతి. పూతనాయాః అసంసహిత స్తన్యపానం. (28,29)

తృణావర్తుడు, బకుడు, వత్సుడు, ధేనుకుడు, అతని సోదరులు, ప్రలంబుడు మొదలైన రాక్షసులను, దుష్టులను శ్రీకృష్ణుడు దునుమాడిన కథలు దశమస్కంధమునే గలవు. (29)

శ్లో ॥ గోపానాంచ పరిత్రాణం దావాగ్నేః పరిసర్పతః
దమనం కాలియస్యాహేర్మహోహేర్నందమోక్షణమ్ - 30

శ్రీకృష్ణుడు గోపాలకులను దావాగ్ని నుండి కాపాడుట, కాళియుడను సర్పరాజు దమనము, నందునికి మోక్షమును ప్రసాదించుట ఇత్యాద్యంశములు దశమస్కంధమున వర్ణితములు.(30)



శ్లో ॥ వ్రతచర్యాతు కన్యానాం యత్ర తుష్టోఽచ్యుతో వ్రతైః
ప్రసాదో యజ్ఞ పత్నీభ్యో విప్రాణాం చానుతాపనమ్ - 31

శ్రీకృష్ణునికై గోపికలు వ్రతముల నాచరింపగా, వానికి శ్రీకృష్ణుడు సంతుష్టుడగుట, యజ్ఞ పత్నులను అనుగ్రహించుట, విప్రుల అనుతాపము మొదలైన కథలు దశమస్కంధమున కలవు.(31)

శ్లో ॥ గోవర్ధనోద్ధారణం చ శక్రస్య సురభేరథ
యజ్ఞాభిషేకం కృష్ణస్య స్త్రీభిః క్రీడా చ రాత్రిషు - 32

శ్రీకృష్ణుడు గోవర్ధన గిరిని పైకెత్తుట, ఇంద్రుని, సురభిని అనుగ్రహించుట శ్రీకృష్ణుని యజ్ఞాభిషేకము, రాత్రివేళ గోపికలతో శ్రీకృష్ణుని రాసకేళి దశమస్కంధమున వర్ణితములు. (32)

టీ :- ధేనుకస్యేతి. సహభ్రాతుః ససఖస్య. (30-32)

శ్లో ॥ శంఖచూడస్య దుర్బుద్ధేర్వధోఽరిష్టస్య కేశినః
అక్రూరాగమనం పశ్చాత్ప్రస్థానం రామకృష్ణయోః - 33

దుష్టుడైన శంఖచూడుని కృష్ణుడు వధించుట, అరిష్టుని, కేశిని వధించుట, అక్రూరుడు ఏతెంచుట, రామకృష్ణుల ప్రస్థానము దశమాధ్యాయమున వర్ణితము. (33)

శ్లో ॥ వ్రజస్త్రీణాం విలాపశ్చ మథురాలోకనం తతః
గజముష్టికచాణూరకంసాదీనాం చ యో వధః - 34

శ్రీకృష్ణుని విరహముతో గోపస్త్రీల విలాపము, మధురానగర సందర్శనము, గజముష్టిక, చాణూర, కంసాదులను శ్రీకృష్ణుడు చంపుటమున్నగునవి దశమస్కంధమున వర్ణితమైనవి. (34)

శ్లో ॥ మృతస్యానయనం సూనోః పునస్సాందీపనేర్గురోః
మథురాయాం నివసతా యదుచక్రమస్య యత్ప్రియమ్ - 35

గురువైన సాందీపని యొక్క మృతపుత్రుని శ్రీకృష్ణుడు తెచ్చుట, యదువంశమునకు ప్రియమొనర్చుచు శ్రీకృష్ణుడు మధురలో నివసించుట దశమస్కంధమున వర్ణితము.(35)



శ్లో ॥ కృతముద్ధవ రామాభ్యాం యుతేన హరిణా ద్విజాః
జరాసంధసమానీతసైన్యస్య బహుశో వధః
ఘాతనం యవనేంద్రస్య కుశస్థల్యా నివేశనమ్ - 36

శ్లో ॥ రుక్మిణ్యా హరణం యుద్ధే ప్రమథ్య ద్విషతో హరేః
ఆదానం పారిజాతస్య సుధర్మాయాః సురాలయాత్ - 37

టీ :- యజ్ఞేతి. యజ్ఞాభిషేకం యజ్ఞః పూజా అభిషేకశ్చ తయోర్ద్వంద్వైక్యం. (33-37)

శ్లో ॥ హరస్య జృంభణం యుద్ధే బాణస్య భుజకృంతనమ్
ప్రాగ్జ్యోతిషపతిం హత్వా కన్యానాం హరణం చయత్ - 38

శ్లో ॥ చైద్య పౌండ్రకశాల్వానాం దన్తవక్త్రస్య దుర్మతేః
శంబరో ద్వివిదః పీఠో మురః పంచజనాదయః - 39

టీ :- ఆదానమితి. ద్విషతః శత్రూన్ ప్రమథ్య. (38,39)

ఉద్ధవ - బలరాములతో కూడినవాడైన శ్రీకృష్ణుడు సైన్యముతో వచ్చిన జరాసంధుని, ఆతని సైన్యమును చంపుట, కుశస్థలిలో వసించుట దశమస్కంధమున వర్ణితము.(36)

దేవలోకమునుండి కృష్ణుడు పారిజాత వృక్షమును తెచ్చుట, రుక్మిణిని అపహరించి తెచ్చుట, అప్పుడు జరిగిన యుద్ధములో శత్రువులను చంపుట మున్నగునవి దశమస్కంధమున వర్ణింపబడినవి. ఈ శ్లోకమున పూర్వార్థ ఉత్తరార్థములు వ్యత్యస్తములైనట్లు కన్పడు చున్నవి.(37)

యుద్ధమున హరుని విజృంభణము, బాణుని భుజములను నరికివేయుట, ప్రాగ్జ్యోతిషరాజును చంపి కన్యలను అపహరించుట అనుకథలు దశమస్కంధమున గలవు.(38)

చైద్య, పౌండ్రక, శాల్వ, దంతవక్త్ర, శంబర, ద్వివిద, పీఠ, ముర, పంచజనాది దుష్టులను శ్రీకృష్ణుడు సంహరించుట దశమ స్కంధమున వర్ణితములు. (39)



శ్లో ॥ మాహాత్మ్యం చ వధస్తేషాం వారాణస్యాశ్చ దాహనమ్
భారావతరణం భూమేర్నిమిత్తీకృత్య పాండవాన్ - 40

టీ :- చైద్యేతి. యే చ శంబరాదయః. (40)

వారాణసీపురదహనము, భూమండలముపై భారమును తగ్గించుట, పాండవుల ప్రసక్తి దశమస్కంధమున వర్ణితము.(40)

శ్లో ॥ విప్రశాపాపదేశేన సంహారః స్వకులస్య చ
ఉద్ధవస్యచ సంవాదో వాసుదేవస్య చాద్భుతః - 41

టీ :- మహాత్మ్యమితి. తేషాం మాహాత్మ్యం ప్రభావః వధశ్చ.(41)

విప్రశాపమనెడి మిషతో శ్రీకృష్ణుడు తన యదుకులమును నాశమొనర్చుట, ఉద్ధవునితో సంభాషించుట ఏకాదశస్కంధమున వర్ణింపబడినది. (41)

శ్లో ॥ యత్రాత్మ విద్యా హ్యఖిలా ప్రోక్తా ధర్మవినిర్ణయః
తతో మర్త్యపరిత్యాగ ఆత్మయోగానుభావతః - 42

టీ :- ఏకాదశస్కంధార్థమాహ- విప్రశాపేతి. (42)

అఖిలమగు ఆత్మవిద్యయు, వర్ణాశ్రమ ధర్మముల నిర్ణయమును, మానవత్వ వినాశము, మున్నగు అంశములు ఏకాదశస్కంధమున వర్ణితములు.(42)

శ్లో ॥ యుగలక్షణవృత్తిశ్చ కలౌ నృణాముపప్లవః
చతుర్విధశ్చ ప్రలయ ఉత్పత్తి స్త్రివిధా తథా - 43

టీ :- ఉద్ధవస్యేతి. ధర్మవినిర్ణయః వర్ణాశ్రమధర్మవినిశ్చయః. (43)

ద్వాదశస్కంధమున యుగలక్షణములు, తదనుగుణముగ వృత్తులు, కలియుగమున నరులకు కలుగు ఉపద్రవములు, చతుర్విధ ప్రళయములు, ప్రాకృతిక, నైమిత్తిక, నిత్యములనెడి మూడు విధములైన ఉత్పత్తి క్రమములు వర్ణింపబడినవి.(43)



శ్లో ॥ దేహత్యాగశ్చ రాజర్షేర్విష్ణు రాతస్య ధీమతః
శాఖాప్రణయన మృషేర్మార్కండేయస్య సత్కథా
మహాపురుష విన్యాసః సూర్యస్య జగదాత్మనః 44

టీ :- తత ఇతి. మర్త్యపరిత్యాగః మనుష్యత్వస్యాంతర్ధానం. ద్వాదశస్కంధార్థమాహ - యుగేతి. యుగలక్షణం. తదనురూపావృత్తిశ్చేత్యర్థః. (44)

విష్ణురాతుని (పరీక్షిత్తు యొక్క) దేహత్యాగము, వ్యాసుడొనరించిన వేదశాఖల ప్రస్తావన, మార్కండేయునిసత్కథ, సూర్యభగవానుని విన్యాసములు మొదలైనవి ఈ ద్వాదశస్కంధమున వర్ణింపబడినవి. (44)

శ్లో ॥ ఇతి చోక్తం ద్విజశ్రేష్ఠా యత్పృష్టోఽహమిహాస్మివః
లీలావతారకర్మాణి కీర్తితానీహ సర్వశః - 45

టీ :- చతుర్విధ ఇతి. త్రివిధా ప్రాకృతికీ నైమిత్తికీ నిత్యా చేతి.(45)

ఓ ద్విజశ్రేష్ఠులారా! మీరు తెలుసికొనగోరిన కృష్ణ లీలావతార విశేషములను అన్నింటినీ మీకు తెలియపరచితిని. ఆయా కథల శ్రవణ కీర్తనముల వలన నానార్థములు లభించినవి.(45)

శ్లో ॥ పతితః స్ఖలితశ్చార్తః క్షుత్త్వావా వివశోఽబ్రువన్
'హరయే నమ' ఇత్యుచ్చైర్ముచ్యతే సర్వపాతకాత్ - 46

టీ :- శాఖేతి. ఋషేర్వ్యాసస్య సూర్యస్య చ విన్యాస ఇత్యర్థః.(46)

కూపాదులలో పడినప్పుడు మెట్లపై నుండి జారినప్పుడు, దుఃఖములోనున్నప్పుడు వివశులైయున్నప్పుడు హరయే నమః అని పెద్దగా పలికిన చాలును, సకల పాపములు దూరమగును. (అనగా స్వాధీనశరీరులైయిన్నప్పుడు స్మరించినచో విశేష ఫలము లభించునని తాత్పర్యము.) (46)



శ్లో ॥ సంకీర్త్యమానో భగవాననన్తః
శ్రుతానుభావో వ్యసనం హి పుంసామ్
ప్రవిశ్య చిత్తం విధునోత్యశేషం
యథా తమో౽ర్కో ౽భ్రమివాతివాతః - 47

టీ :- ఇతీతి. ఇతి చోక్తమితి. చకారాదన్యదపిచ వః యుష్మాభిః. ఇహ యత్పృష్టో౽స్మి. తదుక్తమితి. నను కిమేవం నానార్థకథనేన? తత్రాహ - లీలేతి. సర్వశః తత్తదర్థకీర్తన ద్వారేణేత్యర్థః. (47)

మానవులు హరిని కీర్తించినను, అనుభవమపూర్వకముగ కీర్తనము వినినను చాలును, ఆ హరి సమస్త దుఃఖములను పోగొట్టును. అట్లు స్తుతించువారి మనస్సులోనికి శ్రీహరి ప్రవేశించి, సూర్యుడు చీకటిని పారద్రోలినట్లు చండ వాయువు మేఘమును పారద్రోలినట్లు దుఃఖములను పారద్రోలును.(47)

శ్లో ॥ మృషాగిరస్తా హ్యసతీరసత్కథా
న కథ్యతే యద్భగవానధోక్షజః
తదేవ సత్యం తదుహైవ మంగలం
తదేవ పుణ్యం భగవద్గుణోదయమ్ -48

టీ :- ఏతత్కీర్తనేనాపి కిమిత్యపేక్షయాం తత్ఫలమాహ - ద్వాభ్యాం. పతిత ఇతి. పతితః. కూపాదిషు స్ఖలితః సోపానాదిషు ఆర్తః దుఃఖితః క్షుత్వా క్షుతః కృత్వా వివశో౽పి. (48)

హరి కీర్తనముతప్ప మిగిలిన వ్యతిరేక కీర్తనములన్నియు మిథ్యా ఫలముల నిచ్చును. అసత్కథలు పాపములనొసంగును గాన ఉత్తమ శ్లోకుడైన విష్ణువు యొక్క కథలనే వినవలెను. అదియే మంగళకారకము. అదియే పుణ్యప్రదము. అదియే అభ్యుదయకరము. (48)



శ్లో ॥ తదేవ రమ్యం రుచిరం నవం నవం
తదేవ శశ్వన్మనసో మహోత్సవమ్
తదేవ శోకార్ణవశోషణం నృణాం
యదుత్తమశ్లోక యశో౽ను గీయతే - 49

టీ :- సంకీర్త్యమాన ఇతి. సంకీర్త్యమానః. యద్వా శ్రుతోనుభావో యస్య సః. పుంసాం చిత్తం ప్రవిశ్య నిశ్శేషం దుఃఖం విధునోతి. హీతి సతామనుభవం ప్రమాణయతి - అర్కో గిరిగుహాదిధ్వాంతం న నివర్త యతీత్యపరితోషా ద్దృష్టాంతాంతరమాహ - అతివాతో భ్రమివేతి. (49)

విష్ణుకథయే రమణీయము. రుచిరము, నిత్యనూతనము. నిరంతరము మనస్సుకు అదియే మహోత్సవము. అదియే శోక సాగరమును శుష్కింపజేయు ప్రకాశము. విష్ణు కథయే ఉత్తమ శ్లోక యశోభాసురము. (49)

శ్లో ॥ న తద్వచశ్చిత్రపదం హరే ర్యశో
జగత్పవిత్రం ప్రగృణీత కర్హిచిత్
తద్ధ్వాంక్షతీర్థం న తు హంససేవితం
యత్రాచ్యుతస్తత్ర హి సాధవో౽మలాః - 50

టీ :- హరిసంకీర్తనమేవ మహాఫలం తద్వ్యతిరిక్తం సర్వం మిథ్యా లాపనమాత్రమితి ప్రపంచయతి - చతుర్భిః. మృషాగిర ఇతి. మృషాగిరః మిథ్యావాచః అసతీః అసత్యః అసతాం కథా యాసు తాః

హరి కీర్తనము లేని మాట చిత్రపదరంజకము గాదు. పవిత్రము గాదు. అట్టి వ్యర్థ ప్రసంగము కాకులవంటి నరులకు రతిస్థానమగునే గాని, జ్ఞానులైన హంసలకు సేవింపదగినది కాదు. అచ్యుతుని కీర్తించు వారే సాధువులు, నిర్మలురు. (50)

యత్ యాసు. ఉత్తమశ్లోకస్యయశోనుగీయత ఇతి యత్. తదేవ సత్యం తదేవ మంగలం ఉహేతిహర్షేభగవద్గుణానాముదయో యస్మాత్. (50)

శ్లో ॥ స వాగ్విసర్గో జనఘాత సంప్లవో
యస్మిన్ ప్రతిశ్లోకమబద్ధ వత్యపి
నామాన్యనంతస్య యశోంకితానియత్
శ్రుణ్వంతి గాయన్తి గృణంతి సాధవః - 51

టీ :- తదితి. నవం నవం యథా భవతి తథా రుచిరం రుచిప్రదం. మహానుత్సవో యస్మాత్.(51)

హరిని గూర్చిన వాక్కుల పుట్టుకయే మానవుల పాపములను నశింపజేయును. ఆ హరిని గూర్చిన మాటలు శ్లోకబద్ధములు కాకున్నను, కేవల నామమాత్రములైనను పాపహారములగును. ఆ అనంతుని కీర్తికి అంకితములైన మాటలనే సాధువులు వినెదరు. పాటలుగ పాడెదరు. ఆస్వాదించెదరు. (51)

శ్లో ॥ నైష్కర్మ్యమప్యచ్యుతభావవర్జితం
న శోభతే జ్ఞానమలం నిరంజనమ్
కుతః పునః శశ్వదభద్రమీశ్వరే
న హ్యర్పితం కర్మ యదుప్యనుత్తమమ్ - 52

టీ :- ఉపక్రమోపసంహారయోరేకరూపతాప్రదర్శనాయ పూర్వోక్తా ఏవ శ్లోకాః పఠ్యంతే. నేతి. చిత్రాణి పదాని యస్మిన్ తదపి జగత్పవిత్రయతీతి తథా తద్ధరేర్యశః. న ప్రగృణీత న వర్ణయత్. తద్వచః ధ్వాంక్షతీర్థం

బ్రహ్మమును ప్రకాశింపజేసెడి జ్ఞానము సైతము, హరిభక్తిలేని దైనచో రాణింపదు. అనగా అపరోక్షానుభూతి నీయదని తాత్పర్యము. ఈశ్వరార్పితముగానిచో ఎంతటి ఉత్తమమైన కర్మ అయినను ఎట్లు శోభించును? ఈశ్వర సమర్పితముగానిది అభద్రమే (అమంగళకరమే) అగును. అనగా ఫలమునిచ్చు సమయములో దుఃఖమునే కలిగించును. (52)



కాకతుల్యనరాణాం రతిస్థానం నతు హంసైః జ్ఞానిభిః సేవితం. తత్ర హేతుః - యత్రేతి. (52)

శ్లో ॥ యశః శ్రియామేవ పరిశ్రమః పరో
వర్ణా శ్రమాచారతపః శ్రుతాదిషు
అవిస్మృతిః శ్రీధర పాదపద్మయో
ర్గుణాను వాద శ్రవణాదిభిర్హరేః - 53

టీ :- స ఇతి. స వాగ్విసర్గః స ఏవ వాచః ప్రయోగః జనతాఘవిప్లవః జనసమూహానాశకః యత్యస్మాత్. తాన్యేవం అన్యైః కీర్త్యమానాని శృణ్వంతి శ్రోతరి సతి గాయంతి నోచేత్స్వయమేవ గృణంతి. (53)

శ్లో ॥ అవిస్మృతిః కృష్ణపదారవిందయోః
క్షిణోత్యభద్రాణి శమం తనోతి చ
సత్త్వస్య శుద్ధిం పరమాత్మభక్తిం
జ్ఞానం చ విజ్ఞాన విరాగయుక్తమ్ - 54

టీ :- ఇదానీం జ్ఞానకర్మాదరాదపి భగవత్కీర్తనాదిష్వేవాదరః కర్తవ్య ఇత్యాహ - త్రిభిః. నైష్కర్మ్య మితి. నైష్కర్మ్యం బ్రహ్మతత్ప్రకాశకం

వర్ణాశ్రమ ధర్మములను పాటించుట ద్వారా చేయబడు విశేష పరిశ్రమము కీర్తిని, సంపదలను మాత్రమే సమకూర్చును. కాని శ్రీహరి గుణములను అనువదించుట, వినుట అను కర్మలు మాత్రము శ్రీధరుని పాదపద్మములను మరచిపోకుండ చేయును. అనగా శాశ్వతానందమును కలిగించును. (53)

కృష్ణుని పాదారవిందములను మరువక యుండుట యనునది అభద్రములను, నశింపజేయును. శమమును విస్తరింప జేయును. సత్త్వగుణ శుద్ధిని కలిగించును. పరమాత్మభక్తినీ, విజ్ఞాన వైరాగ్యములతో కూడిన జ్ఞానము కలుగజేయును. (54)



యజ్జ్ఞానం యతో నిరంజనం ఉపాధినివర్తకం. తదప్యచ్యుత భక్తివర్జితం చేత్. న శోభతే నాపరోక్షపర్యంతం భవతీత్యర్థః. ఈశ్వరే నచేదర్పితం తర్హి, యదనుత్తమం సర్వోత్తమమపి కర్మ. తదపి పునః కుతః శోభతే. యతః శశ్వత్సాధనకాలే చ. అభద్రం దుఃఖాత్మకం. (54)

శ్లో ॥ యూయం ద్విజాగ్ర్యాబత భూరిభాగా
యచ్ఛశ్వదాత్మన్యఖిలాత్మభూతమ్
నారాయణం దేవమదేవమీశ
మజస్రభావా భజతా వివేశ్య - 55

టీ :- కించ యశశ్శ్రియామితి. వర్ణాశ్రమాచారాదిషు యః పరో మహాన్ పరిశ్రమః స యశోయుక్తానాయాం శ్రియామేవ కీర్తౌ సంపది చ కేవలం న పరమపురుషార్థమిత్యర్థః. గుణానువాదాదిభిస్తు. శ్రీధర పాదపద్మయో రవిస్మృతిర్భవతి. (55)

ఓ ద్విజోత్తములారా! మీరు మీ అంతః కరణములలో నారాయణుని నిలిపి, సేవింపుడు ఓ పుణ్యాత్ములారా! సర్వాంతర్యామి యైన దేవదేవుడగు ఆ శ్రీహరిని అజస్రభావులై (నిరంతరభావుకులై) సేవింపుడు. ఆ దేవుడు (తనకంటె మరియొక దైవము లేని వాడు) అయిన ఈశ్వరుని భజింపుడు. మీరు భూమిభాగులు (తపస్సు మొదలగు సంపదలు గలవారు) కావున నారాయణుని సేవింపుడని తాత్పర్యము. (55)



శ్లో ॥ అహం చ సంస్మారిత ఆత్మతత్త్వం
శ్రుతం పురా మే పరమర్షి వక్త్రాత్
ప్రాయోపవేశే నృపతేః పరీక్షితః
సదస్యృషీణాం మహతాం చ శృణ్వతామ్ - 56

టీ :- తతః కిమత ఆహ - అపస్మృతిరితి. క్షిణోతి నాశయతి.(56)

పూర్వము పరీక్షిత్తు ప్రాయోపవేశ సమయములో ఆతని సభలో ఋషుల సమక్షములో, వారు వినుచుండగా, పరమర్షియగు శుకుని ద్వారా నేను ఆత్మతత్త్వమును వింటిని. దానినిప్పుడు మీరు ప్రశ్నింపగా స్మరించి, మీకు చెప్పితిని. (56)

శ్లో ॥ ఏ తద్వః కథితం విప్రాః కథనీయోరుకర్మణః
మాహాత్మ్యం వాసుదేవస్య సర్వాశుభవినాశనమ్ - 57

టీ :- అథేదానీం శ్రోతౄనాత్మానం చాభినందయన్నాహ - ద్వాభ్యాం. యూయమితి. హే ద్విజాగ్ర్యాః. యద్యస్మాత్ ఆత్మన్యంతః కరణే. శ్రీనారాయణం అధివేశ్య శశ్వద్భుజత. సంభావనాయాం లోట్. అతో భూరిభాగాః బహుపుణ్యాః కథంభూతం అఖిలాత్మభూతం సర్వాంతర్యామిణం. అత ఏవ దేవం సర్వోపాస్యం అదేవం స దేవోఽన్యో యస్య తం. కుతః. ఈశం. యద్వా. యస్మాద్యూయం భూరిభాగాః తప ఆదిసంపన్నాః. తతో నారాయణం భజతేతి విధిః. (57)

ఓ విప్రులారా! కథనీయములగు (పేర్కొనదగినవగు) ఉరుకర్మలు (శ్రేష్ఠకర్మలు) గలవాడైన ఆ వాసుదేవుని సకలపాప వినాశకర మహత్త్వమును మీకు చెప్పితిని.(57)



శ్లో ॥ య ఏవం శ్రావయేన్నిత్యం యామక్షణమనన్యధీః
శ్రద్ధావాన్ యోఽనుశ్రుణుయాత్పునాత్యాత్మానమేవ సః - 58

టీ :- అహమితి. మే మయా శ్రుతం. (58)

ఈ హరిచరితమును ప్రతిజాములోను, ప్రతి క్షణము ఎవరు వినిపింతురో అట్టి అనన్యమనస్కులైన శ్రద్ధాళువులు పునీతులగుదురు. అట్టివారి దేహములే గాక, ఆత్మలును ధన్యములగును. (58)

శ్లో ॥ ద్వాదశ్యామేకాదశ్యాం వా శ్రుణ్వన్నాయుష్యవాన్భవేత్
పఠత్యనశ్నన్ప్రయతస్తతో భవత్య పాతకీ - 59

టీ :- ఏతత్పురాణకీర్తనాదిఫలం ప్రపంచయితు మాహాష్టభిః-ఏతదితి. (59)

ఈ హరిచరితమును ద్వాదశినాడుగాని, ఏకాదశినాడు గాని వినువారికి ఆయుష్యము పెరుగును. నిరాహారుడై ఎవడు ఈ చరితమును చదువునో అట్టివాడు పుణ్యాత్ముడగును. (59)

శ్లో ॥ పుష్కరే మధురాయాం చ ద్వారవత్యాం యతాత్మవాన్
ఉపోష్య సంహితామేతాం పఠిత్వా ముచ్యతే భయాత్ - 60

పుష్కరము, మధుర, ద్వారక మొదలగు పుణ్య క్షేత్రములలో నిరాహారముతో ఈ భాగవతసంహితను చదువువారు భయములనుండి విముక్తులగుదురు. (60)

శ్లో ॥ దేవతా మునయః సిద్ధాః పితరో మనవో నృపాః
యచ్ఛన్తి కామాన్ గృణతః శృణ్వతో యస్య కీర్తనాత్ - 61

టీ :- య ఇతి. యామక్షణం వేత్యర్థః. ఆత్మానమేవ సాక్షాత్పునాతి. న తు స్నానాదివద్దేహాదిమాత్రం. (60-61)

హరిని కీర్తించువారును, హరికథలు వినువారును అయిన దేవతలు, మునులు, సిద్ధులు, మనువులు, పితరులు, రాజులు తమ తమ అభీప్సితములను పొందగలరు. (61)



శ్లో ॥ ఋచో యజాంషి సామాని ద్విజోఽధీత్యానువిందితే
మధుకుల్యా ఘృతకుల్యాః పయః కుల్యాశ్చ తత్ఫలమ్ - 62

టీ :- ఋగాద్యదీత్య ద్విజో మధుకుల్యాది యదనువిందతే, తత్ఫలమేతామధీత్యానువిందత ఇతి.(62)

ఋగ్యజుస్సామవేదములను అధ్యయనము చేసిన ద్విజులు మధుకుల్య ఘృతకుల్య పయఃకుల్య ఫలములను పొందినట్లే ఈ హరి చరితమును పఠించువారు ఆ ఫలములనొందగలరు. (62)

శ్లో ॥ పురాణసంహితామేతామధీత్య ప్రయతో ద్విజః
ప్రోక్తం భగవతా యత్తు తత్పదం పరమం వ్రజేత్ - 63

సాక్షాత్తు భగవంతునిచే చెప్పబడిన ఈ భాగవతపురాణ సంహితను చదివెడి ద్విజుడు పరమ పదమైన భాగవంతుని స్థానమును పొందగలడు. (63)

శ్లో ॥ విప్రోఽధీత్యాప్నుయాత్ప్రజ్ఞాం రాజన్యోదధి మేఖలామ్
వైశ్యో నిధిపతిత్వం చ శూద్రః శుధ్యేత పాతకాత్ - 64

టీ :- కించ ప్రోక్తమితి. రాజన్య ఉదధిమేఖలాం పృథ్వీమితి సంధిరార్షః. (63,64)

ఈ హరిచరితమును చదివిన విప్రుడు ప్రజ్ఞను పొందును. రాజు సాగరమేఖలయగు సామ్రాజ్యమును పొందును. వైశ్యుడు నిధులకు అధిపతి యగును. శూద్రుడు పాతకముల నుండి బయల్పడును. రాజన్యోదధి అను చోట సంధి ఆర్షప్రయోగమని తెలియవలెను. (64)



శ్లో ॥ కలిమలసంహతి కాలనోఽఖిలేశో
హరిరితరత్ర న గీయతే హ్యభీక్ష్ణమ్
ఇహ తు పునర్భగవానశేషమూర్తిః
పరిపఠితోఽను పదం కథా ప్రసంగైః -65

టీ :- అస్య పురాణస్యైవం ప్రభావాతిరేకే కారణమాహ - కలిమలేతి. కలిమలానాం సంహతిం సమూహం కాలయతి వినాశయతీతి తథా ఇతరత్ర శాస్త్రాంతరే. (65)

కలికాలదోషసమూహములను నాశనమొనర్చెడి అఖిలేశుడైన హరి అడుగడుగున కీర్తింపబడుట వలన ఈ భాగవతసంహిత పుణ్యనిలయము. ప్రతి పదములోను అశేష మూర్తియగు కృష్ణ భగవానుడు అనేక కథా ప్రసంగముల ద్వారా కీర్తింపబడినాడు. (65)

శ్లో ॥ తమహమజమనన్త మాత్మతత్త్వం
జగదుదయస్థితి సంయమాత్మశక్తిమ్
ద్యుపతిభిరజ శక్ర శంకరాద్యైః
దురవసితస్తవమచ్యుతం నతోఽస్మి - 66

టీ :- శాస్త్రప్రతిపాదితం భగవంతం నమస్కరోతి - ద్వాభ్యాం. తమితి. జగదుదయస్థితి సంయమాత్మానో రజ ఆదయశ్శక్తయో యస్య తం. ద్యుపతిభిర్వైరపి. దురవస్థితః అవిజ్ఞాతః స్తవః స్తోత్రం యస్య తం.(66)

జగత్తు యొక్క సృష్టి స్థితిలయములకు మూలములైన రజస్సు మొదలైన గుణములను నియంత్రించువాడును, బ్రహ్మామహేశ్వర దేవేంద్రాది దేవతలకు సైతము సాధ్యముకాని స్తోత్రసముదాయమును గలవాడును, జన్మలేని వాడును, ఆత్మతత్త్వమైనవాడును అగు అచ్యుతుని నమస్కరించుచున్నాను. (66)





శ్లో ॥ ఉపచితనవశక్తిభిః స్మ ఆత్మ
న్యుపరచితస్థిర జంగమాలయాయ
భగవత ఉపలబ్ధి మాత్ర ధామ్నే
సుబుషభాయ నమః సనాతనాయ - 67

టీ :- ఉపచితేతి. ఉపచితాభిః. ఉద్రిక్తాభిః. తవ శక్తిభిః ప్రకృతి పురుషమహదహంకార పంచతన్మాత్రరూపాభిః. స్వ ఆత్మనేవ. ఉపరచితం స్థిరం జంగమం చాలయో యస్య తస్మై భగవతే. (67)

ప్రకృతి, పురుషుడు, మహత్తు, అహంకారము, పంచతన్మాత్రలు కలసి తొమ్మిది శక్తులకు మూలమైనవాడును, స్థావర జంగమాత్మకమైన సృష్టికి నిలయమైనవాడును, సురశ్రేష్ఠుడైన వాడును, సనాతనుడును అయిన భగవంతునకు నమస్కరించుచున్నాను. (67)

శ్లో ॥ స్వసుఖనిభృత చేతాస్త ద్వ్యుదస్తాన్యభావోఽ
ప్యజిత రుచిర లీలా కృష్ట సారస్త దీయమ్
వ్యతనుత కృపయా యస్త త్త్వదీపం పురాణం
తమఖిలవృజినఘ్నం వ్యాససూనుం నతోఽస్మి - 68

టీ :- శ్రీగురుం నమస్కరోతి - స్వసుఖేతి స్వసుఖేనైవ నిభృతం పూర్ణం చేతో యస్య సః తేనైవ వ్యుదస్తం అన్యస్మిన్ భావో యస్య తథాభూతోఽపి అజితస్య శ్రీకృష్ణస్య రుచిరాభిర్లీలాభిః ఆకృష్టః సారః స్వసునుగతం స్థైర్యం యస్య సః. తత్త్వదీపం పరమార్థప్రకాశకం. శ్రీభాగవతం పురాణం. యో వ్యతనుత తం నతోఽస్మీతి. (68)

ఆత్మానందముతో కూడిన మనస్సుగలవాడును, అన్నింటినీ ఆనందస్వరూపములుగ దర్శించువాడును, భగవంతుని లీలలచే ఆకర్షింపబడినవాడును, స్థిరమైన చిత్తముగలవాడును, పరమార్థ ప్రకాశమైన శ్రీ భాగవత పురాణ దీపమును వెలిగించినవాడును, కృపాసముద్రుడును, అఖిల పాపనాశకుడును అయిన వ్యాసపుత్రుడగు శ్రీ శుకమహర్షిని నమస్కరించుచున్నాను.(68)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే ద్వాదశస్కంధార్థ నిరూపణంనామ ద్వాదశోఽధ్యాయః**

**శ్రీమద్భాగవత మహాపురాణము యొక్క ద్వాదశస్కంధమునందలి ద్వాదశాధ్యాయము సమాప్తము.**



## త్రయోదశోఽధ్యాయః

**సూత ఉవాచ**

శ్లో ॥ యం బ్రహ్మా వరుణేంద్ర రుద్ర
మరుతః స్తున్వన్తి దివ్యైః స్తవైః
వేదైః సాంగపదక్రమోపనిషద్దైర్గాయన్తి యం
సామగాః ధ్యానావస్థిత తద్గతేన మనసా
పశ్యన్తి యం యోగినో యస్యాంతం న విదుః
సురాసురగణాః దేవాయ తస్మై నమః - 1

టీ :- త్రయోదశే పురాణానాం సంఖ్యామాహ యథాక్రమం, దానం దానస్య మాహాత్మ్యం శ్రీమద్భాగవతస్య చ. సర్వపురాణసంఖ్యాదీ నుపవర్ణయిష్యన్ తత్ప్రతిపాద్యం దేవం ప్రణమతి - యమితి. స్తవైర్వేదైశ్చ స్తున్వంతి స్తువంతి ఉపనిషచ్ఛబ్దస్యాకారాంతత్వం ఛందోనురోధేన ధ్యానేన అవస్థితం నిశ్చలం తద్గతం యన్మనస్తేన యస్యాంతం న విదుః. సురాసురగణాః.(1)

## త్రయోదశాధ్యాయము.

**సుతుడు పలుకుచున్నాడు.**

ఈ త్రయోదశాధ్యాయమున పురాణముల సంఖ్య యథా క్రమముగ తెలుపబడుచున్నది. అట్లే దానమహిమ, శ్రీమద్భాగవత మహిమ వివరింపబడుచున్నది. సకల పురాణ ప్రతిపాద్యుడైన భగవంతుని స్తుతించుచున్నాడు - ఎవనిని బ్రహ్మ, వరుణ, ఇంద్ర, రుద్ర,మరుత్తులు దివ్య స్తోత్రములతో స్తుతించుచున్నారో, సామగానము తెలిసిన వారు సాంగపదక్రమోపనిషత్తులతో కూడిన వేదములతో గానము చేయుచున్నారో, యోగులు ధ్యానాత్మకమైన మనస్సుతో దర్శించుచున్నారో, దేవదానవులు ఆతని పూర్ణరూపము నెరుగలే కున్నారో, అట్టి దేవదేవుడైన భగవంతునకు నమస్కరించుచున్నాను. (1)



శ్లో ॥ పృష్ఠే భ్రామ్యదమందమందరగిరి గ్రావాగ్రకండూయనాత్
నిద్రాలోః కమఠాకృతేర్భగవతః శ్వాసానిలాః పాన్తు వః
యత్సంస్కారకలాఽను వర్తనవశాద్వేలానిభేనాంభసాం
యాతాయాతమతంద్రితం జలనిధేర్నాద్యాపి విశ్రామ్యతి - 2

టీ :- క్షీరోదమథనాదౌదుర్జ్ఞేయత్వమేవ ప్రదర్శయితుం కూర్మావతార మనుస్మరన్నాశిషం ప్రార్థయతే - పృష్ఠ ఇతి. పృష్ఠే భ్రామ్యన్ అమందో గరిష్ఠో యో మందరగిరిస్తస్య యే గ్రావాణస్తేషా మగ్రాణితైః కండూయనాత్. తేన సుఖేన నిద్రాలోః నిద్రాశీలస్య యేషాం శ్వాసానిలానాం సంస్కారస్తేషాం కలా లేశః తదనువర్తనవశాత్. జలనిధేరంభసాం యాతాయాతం న విశ్రామతి. నను సముద్రక్షోభాదేవ తత్ న సంస్కారవశాత్తత్రాహ - వేలాక్షోభ స్తస్యనిభేన మిషేణ. (2)

క్షీరసాగరమథనసమయమున తెలియబడని కూర్మావతార మూర్తిని స్మరించుచు, ఆశీస్సులను కాంక్షించుచున్నాడు - వీపుపై నిలుపబడిన మందర పర్వతము యొక్క శిలల స్పర్శచే సుఖము ననుభవించుచు నిద్రించుచున్న కూర్మావతారమూర్తి యొక్క శ్వాసల నుండి వెలువడిన గాలులు సకలలోకములను రక్షించుగాక. ఆ శ్వాసల వలన కలిగిన గాలుల లేశముల అనువర్తనమువలననే సముద్రములలో అలలు చెలరేగుచు నేటికినీ విశ్రమింపక యున్నవి.(2)

శ్లో ॥ పురాణ సంఖ్యా సంభూతిమస్య వాచ్యప్రయోజనే
దానం దానస్య మాహాత్మ్యం పాఠాదేశ్చ నిబోధత - 3

టీ :- పురాణేతి. పురాణసంఖ్యాస్తాసాం సంభూతిం సమాహారం చ. అస్య తు శ్రీభాగవతస్య వాచ్యం విషయం ప్రయోజనం చ. దానం చ. దానస్య పాఠాదేశ్చ మాహాత్మ్యం చ నిబోధత. (3)

పురాణ సంహితల సంఖ్యయు, వాటి సమాహారమును, శ్రీమద్భాగవతవిషక్ష్మీము, ప్రయోజనము, దానమహిమ, పాఠాదుల మహిమను ఇప్పుడు తెలిసికొనుడు. (3)



శ్లో ॥ బ్రాహ్మం దశసహస్రాణి పాద్మం పంచోనషష్టి చ
శ్రీవైష్ణవం త్రయోవింశచ్చతుర్వింశతి శైవకమ్ - 4

టీ :- బ్రాహ్మమితి. త్రయోవింశత్త్రయోవింశతి. చతుర్వింశతి సహస్రాణి శైవకం శివపురాణం. (4)

బ్రహ్మపురాణములో పదివేలు, పద్మపురాణములో ఏబది యైదు వేలు, విష్ణుపురాణములో ఇరువదిమూడు వేలు, శివపురాణములో ఇరువది నాలుగు వేలు శ్లోకములున్నవి. (4)

శ్లో ॥ దశాష్టౌ శ్రీభాగవతం నారదం పంచవింశతిః
మార్కండం నవ వాహ్నంచ దశపంచ చతుః శతమ్ - 5

శ్లో ॥ చతుర్దశ భవిష్యం స్యాత్తథా పంచశతాని చ
దశాష్టౌ బ్రహ్మవైవర్తం లింగమేకాదశైవ తు - 6

టీ :- దశేతి. ఆగ్నేయం అగ్నిపురాణం పంచదశసహస్రాణి చత్వారిశతాని చ. (5,6)

శ్రీ భాగవతములో పదునెనిమిదివేలు, నారదపురాణములో ఇరువదియైదు వేలు, మార్కండేయ పురాణములో తొమ్మిదివేలు, అగ్నిపురాణములో పదునైదువేల నాలుగువందల శ్లోకములున్నవి.(5)

భవిష్య పురాణములో పదునాలుగు వేల అయిదువందలు, బ్రహ్మ వైవర్తపురాణములో పదునెనిమిదివేలు, లింగపురాణములో పదకొండువేల శ్లోకములున్నవి. (6)

శ్లో ॥ చతుర్వింశతి వారాహమేకాశీతి సహస్రకమ్
స్కాందం శతం తథా చైకం వామనం దశ కీర్తితమ్ - 7

టీ :- చతుర్వింశతీతి. స్కాందం శతాధికైకాశీతిసహస్రకం. (7)

వరాహ పురాణములో ఇరువది నాలుగువేల ఎనభైయొకటి, స్కాందపురాణములో ఎనభైయొక్క వేల ఒకవంద, వామన పురాణములో పదివేల శ్లోకములు గలవు. (7)



శ్లో ॥ కౌర్మం సప్తదశాఖ్యాతం మాత్స్యం తత్తు చతుర్దశ
ఏకోనవింశత్సౌ పర్ణం బ్రహ్మాండం ద్వాదశైవ తు - 8

టీ:- కౌర్మమితి. సౌవర్ణం గరుడపురాణం ఏకోనవింశత్ ఏకోనవింశతిః. (8)

కూర్మపురాణములో పదిహేడువేలు, మత్స్యపురాణములో పదునాలుగువేలు, గరుడ పురాణములో పందొమ్మిదివేలు, బ్రహ్మాండ పురాణములో పన్నెండువేలు శ్లోకములు గలవు. (8)

శ్లో ॥ ఏవం పురాణ సందోహశ్చతుర్లక్ష ఉదాహృతః
తత్రాష్టాదశసాహస్రం శ్రీభాగవతమిష్యతే - 9

టీ:- ఏవమితి. మహాభారతంత్వితిహాసః. రామాయణం చ. ఋషిప్రోక్తం కావ్యం అతః పురాణానాం సందోహః సమూహ శ్చతుర్లక్ష సంఖ్యాక ఏవ. (9)

ఈ విధముగ పురాణసమూహము నాలుగు లక్షల శ్లోకములతో కూడియున్నది. అందు శ్రీభాగవతము పదునెనిమిదివేల సంఖ్య గలదై యున్నది. (మహాభారతము ఇతిహాసము. రామాయణము 'ఋషి ప్రోక్తమగు కావ్యము'. అందువలన పురాణములలోని శ్లోక సంఖ్య నాలుగు లక్షలకే పరిమితము) (9)

శ్లో ॥ ఇదం భగవతా పూర్వం బ్రహ్మణే నాభిపంకజే
స్థితాయ భవభీతాయ కారుణ్యాత్సంప్రకాశితమ్ - 10

టీ :- ఇదానీమస్య వాచ్యప్రయోజనాదీన్ దర్శయితు మాహ - తత్రేతి. (10)

ఈ శ్రీమద్భాగవతము పూర్వము భగవంతునిచే నాభికమలము నసున్న బ్రహ్మదేవుని కొరకు చెప్పబడినది. భవభీతుడైన బ్రహ్మదేవునకు అత్యంత కరుణతో భగవంతుడు ఈ భాగవతమును తెలియజేసినాడు. (10)



శ్లో ॥ ఆదిమధ్యావసానేషు వైరాగ్యాఖ్యానసంయుతమ్
హరిలీలా కథా వ్రాతామృతానందిత సత్సురమ్ - 11

టీ :- ఆదీతి. హరిలీలాకథానాం వ్రాతః సమూహః. సఏవామృతం తేనానందితాస్సంతః సురాశ్చ యేన తత్. (11)

ఈ భాగవతము మొదలు, మధ్య, చివరలలో వైరాగ్యమును తెలిపెడి కథలు వర్ణింపబడినవి. ఇది హరిలీలలను గానము చేసి ఆనందించెడి సత్పురుషుల, దేవతల సమూహముల కథలు గలది.(11)

శ్లో ॥ సర్వ వేదాంతసారం యద్బ్రహ్మాత్మైకత్వలక్షణమ్
వస్త్వద్వితీయం తన్నిష్ఠం కైవల్యైక ప్రయోజనమ్ - 12

టీ :- సర్వేతి. తన్నిష్ఠం తస్య విషయం. (12)

ఈ భాగవతము సకల వేదాంతముల సారము. బ్రహ్మాత్మల ఐక్యము ప్రతిపాదించు స్వభావము గలది. ఇందలి కథా వస్తువు అద్వితీయము. అది బ్రహ్మము నందే లీనమై యుండునది. కైవల్య ప్రాప్తియే ఏకైక ప్రయోజనముగా గలది. (12)

శ్లో ॥ ప్రౌష్ఠపద్యాం పౌర్ణమాస్యాం హేమసింహ సమన్వితమ్
దదాతి యో భాగవతం స యాతి పరమాంగతిమ్ - 13

భాద్రపదమాసములోని పూర్ణిమనాడు స్వర్ణసింహాసనమున (బంగారుపీటపై) భాగవత గ్రంథమును నిలిపి దానము చేసెడి వారికి ఉత్తమగతులు లభించును. (13)

శ్లో ॥ రాజన్తే తావదన్యాని పురాణాని సతాం గణే
యావన్న దృశ్యతే సాక్షాచ్ఛ్రీమద్భాగవతం పరమ్ - 14

శ్రీమద్భాగవతము కనబడనంతవరకే ఇతర పురాణములు ప్రకాశించును. భాగవతము వినబడుచుండగా ఇతర పురాణ గాథలపై ఆసక్తి జనింపదని తాత్పర్యము. పురాణములలో కెల్ల భాగవతమే శ్రేష్ఠమగు పురాణము. (14)



టీ :- ప్రోష్ఠపద్యామితి. ప్రోష్ఠపద్యాం హేమసింహసమన్వితం స్వర్ణ సింహాసనారూఢం. (13,14)

శ్లో ॥ సర్వ వేదాన్తసారం హి శ్రీభాగవతమిష్యతే
తద్రసామృతతృప్తస్య నాన్యత్ర స్యాద్రతిః క్వచిత్ - 15

శ్రీభాగవతము సర్వ వేదాంతముల సారమైనందువలన దానిలోని అమృతమును ఆ స్వాదించినవారికి ఇతరములపై ప్రేమ జన్మింపదు. (15)

శ్లో ॥ నిమ్నగానాం యథా గంగా దేవానామచ్యుతో యథా
వైష్ణవానాం యథా శంభుః పురాణానామిదం తథా - 16

నదులన్నింటిలో గంగానదియే శ్రేష్ఠమైనట్లు, దేవతలందరిలో విష్ణువే శ్రేష్ఠుడైనట్లు, విష్ణుభక్తులైనవారిలో శివుడు శ్రేష్ఠుడైనట్లు, పురాణములన్నింటిలో భాగవతమే శ్రేష్ఠమైయున్నది.(16)

టీ :- సర్వేతి. తద్రసఏవామృతం తేన తృప్తస్య నిర్వృతస్య. (15,16)

శ్లో ॥ క్షేత్రాణాం చైవ సర్వేషాం యథా కాశీహ్యనుత్తమా
తథా పురాణవ్రాతానాం శ్రీమద్భాగవతం ద్విజాః - 17

సకల క్షేత్రములలో కాశీ క్షేత్రమే అత్యుత్తమమైనట్లు సకల పురాణ సమూహములో శ్రీమద్భాగతమే శ్రేష్ఠమైయున్నది. (17)

టీ :- శ్రీమదితి. పారమహంస్యం పరమహంసైః ప్రాప్యం నైష్కర్మ్యం సర్వకర్మోపరమః భక్త్యా తచ్ఛ్రవణాదిపరో విముచ్యతే. (17)



శ్లో ॥ శ్రీమద్భాగవతం పురాణమమలం యద్వైష్ణవానాం ప్రియం
యస్మిన్ పారమహంస్యమేకమమలం జ్ఞానం పరం గీయతే
తత్ర జ్ఞాన విరాగ భక్తి సహితం నైష్కర్మ్యమావిష్కృతం
తచ్ఛృణ్వన్విపఠన్ విచారణపరో భక్త్యా విముచ్యేన్నరః - 18

టీ :- శ్రీభాగవతసంప్రదాయప్రవర్తకరూపేణ భగవద్ధ్యానలక్షణం మంగలమాచరతి - కస్మా ఇతి. కస్మైకాయ బ్రహ్మణే. అతులః అసమః అయం శ్రీభాగవతరూపః పురా కల్పాదౌ తద్రూపేణ బ్రహ్మరూపేణ తద్రూపిణా నారదరూపిణా యోగీంద్రాయ శుకాయ కృష్ణరూపేణేతి సిద్ధం. తదాత్మనా శుకరూపేణ తత్పరం సత్యం శ్రీనారాయణాఖ్యం తత్త్వం ధీమహీతి గాయత్ర్యైవ యథోపక్రమ ముపసంహరన్ గాయత్ర్యాఖ్యా బ్రహ్మవిద్యేయమితి దర్శయతి.(18)

శ్రీమద్భాగవతము పురాణములన్నింటిలోను నిర్మలమైనది. ఇది విష్ణుభక్తులకు ప్రీతిని కలిగించును. ఇందులో పరమహంసలైన యోగులు పొందదగిన నిర్మల జ్ఞానము నిండియున్నది. జ్ఞానము, వైరాగ్యము, భక్తి అనువానిచే కూడిన నిష్కర్మభావము (సకల కర్మల విశ్రామము) ఆవిష్కరింపబడినది. భక్తితో ఈ భాగవతమును పఠించువారికినీ (శ్రవణించు) విను వారికినీ మోక్షము లభించును (18)

శ్లో ॥ కస్మై యేన విభాసితోఽయమతులో జ్ఞాన ప్రదీపః పురా
తద్రూపేణ చ నారదాయ మునయే కృష్ణాయ తద్రూపిణా
యోగీంద్రాయ తదాత్మనాథ భగవద్రాతాయ కారుణ్యతః
తచ్ఛుద్ధం విమలం విశోకమమృతం సత్యం పరం ధీమహి-19

శ్రీభాగవతసంప్రదాయమునకు ప్రవర్తకునిగా భగవంతుని ధ్యానించుచు మంగళము నాచరించుచున్నాడు - ఈ భాగవతము బ్రహ్మమును ప్రతిపాదించుటలో సాటిలేనిది. కలియుగారంభములో ఇది బ్రహ్మరూపములో నారదునకు చెప్పబడినది. నారదరూపమున నున్న బ్రహ్మచే వ్యాసునకు బోధింపబడినది. బ్రహ్మరూపుడైనవ్యాసునిచే

యోగీంద్రుడైన శ్రీశుకునకు శుకరూపమున బోధింపబడినది. ఇట్లు ఇంతమందించే బోధింపబడిన భాగవత రూపమైన నారాయణ తత్త్వమును ఆశ్రయించుచున్నాను. గాయత్రీ మంత్రపదములతో ఈ సంహితను ముగించుట వలన (సత్యం పరంధీమహి ఇత్యాదులచే) ఈ భాగవతము గాయత్రీ నామకమగు బ్రహ్మ విద్యయేయని తెలిపినట్లైనది. (19)

శ్లో ॥ నమస్తస్మై భగవతే వాసుదేవాయ సాక్షిణే
యఇదం కృపయా కస్మై వ్యాచచక్షే ముముక్షవే - 20

ఈ భాగవతమును దేవతగాను, గురువుగాను భావించి పలుకుచున్నాడు - సాక్షీరూపుడైన భగవంతుడు వాసుదేవునకు నమస్కారము. ఆ వాసుదేవుడే వ్యాసుని రూపమున దీనిని ముముక్షువులకొరకు (మోక్షము కోరు వారి కొరకు) దయతో చెప్పెను. (20)

శ్లో ॥ యోగీంద్రాయ నమస్తస్మై శుకాయ బ్రహ్మరూపిణే
సంసార సర్పదష్టం యో విష్ణురాతమమూముచత్ - 21

సంసారమనెడి సర్పముచే కాటువేయబడిన విష్ణురాతునికి (పరీక్షిన్మహారాజునకు) మోక్షమును కలుగచేసిన యోగీంద్రుడైన, బ్రహ్మరూపుడైన శుకమహర్షికి నమస్కారము. (21)





శ్లో ॥ భవే భవే యథా భక్తిః
పాదయోస్తవ జాయతే
తథా కురుష్వ దేవేశ
నాథస్త్వం నో యతః ప్రభో ! - 22

ఓ భగవంతుడా! ప్రతిజన్మయందును నీ పాదములపై భక్తి కలుగునట్లు అనుగ్రహింపుము. ఏలయన - మాకెల్లరికి నీవే రక్షకుడవు గదా! (22)

శ్లో ॥ నామ సంకీర్తనం యస్య
సర్వ పాపప్రణాశనమ్
ప్రణామోదుఃఖశమనః
తం నమామి హరిం పరమ్ - 23

ఎవని నామసంకీర్తనము సకల పాపములను పోగొట్టునో, ఎవనిని నమస్కరించినంతమాత్రమున సమస్త దుఃఖములు నశించునో, ఆ హరిని నమస్కరించుచున్నాను. ఆ హరియే పరమదైవము. (23).

టీ :- తమేవ దేవతారూపేణ గురురూపేణ చ ప్రణమతి - ద్వాభ్యాం నమ ఇతి. వ్యాచచక్షే వ్యాఖ్యాతవాన్.(19-23)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టాదశసాహస్ర్యాం**
**శ్రీవైయాసిక్యాం పారమహంస్యాం సంహితాయాం**
**ద్వాదశస్కంధే త్రయోదశోఽధ్యాయః**
**సమాప్తోఽయం గ్రంథః**
**ఇతిశమ్**

**శ్రీమద్భాగవత మహాపురాణముయొక్క ద్వాదశస్కంధమునందలి**
**త్రయోదశాధ్యాయము సమాప్తము.**



### వ్యాఖ్యానోపసంహారము

శ్లో ॥ భావార్థదీపికామేతాం భగవద్భక్తవత్సలామ్
పరమానందపాదాబ్జభృంగశ్రీః శ్రీధరో కరోత్ - 1

శ్లో ॥ స్వబాలచపలాలాపైః స్వలీలా పరివర్తితైః
ప్రీయతాం పరమానందనృహరిః సద్గురుః స్వయమ్ - 2

శ్లో ॥ శ్రీపరానంద సంప్రీత్యై గుహ్యం భాగవతం మయా
తన్మతేనేదమాఖ్యాతం న తు మన్మతి వైభవాత్ - 3

శ్లో ॥ క్వేదం నానా నిగూఢార్థం శ్రీమద్భాగవతం క్వను?
మందబుద్ధిరహం కృష్ణ ప్రేమ కిం కిం నకారయేత్ ?- 4

**ఇతిశ్రీమద్భాగవతే మహాపురాణే శ్రీమద్భాగవత భావార్థ దీపికాయాం శ్రీధర స్వామి విరచితాయాం టీకాయాం ద్వాదశ స్కంధే త్రయోదశోఽధ్యాయః**

**శ్రీకృష్ణాయ నమోస్తు**

భగవద్భక్తులకు ప్రీతిపాత్రమైనదగు ఈ 'భావార్థదీపిక' యనెడి టీకను (వ్యాఖ్యను) పరమానందుడైన కృష్ణుని పాదారవిందములపై వ్రాలెడి తుమ్మెదవంటి శ్రీధరుడు రచించెను. కృష్ణుని లీలలచే ఆకర్షింపబడి, పలికిన చిన్నపిల్లవాని చంచల భాషణములవలెనున్న ఈ వ్యాఖ్యాన వాక్కులను సద్గురులైన పరమానంద నరసింహుడు సంతోషముతో స్వీకరించి, తృప్తినొందును గాక. పరమానంద గురువు యొక్క సంతృప్తికై పరమ రహస్యమగు ఈ భాగవతము యొక్క వ్యాఖ్యను రచించితిని. ఆ గురువు యొక్క మతమునకు అనుగుణముగానే నేనీటీకను రచించితినిగాని, నా బుద్ధి కూడిన భాగవతమెక్కడ? మందబుద్ధినైన నేనెక్కడ? కృష్ణుని పై గల ప్రేమయే నన్ను ఇంతటి పనికి పురికొల్పి, పూర్తి చేయించినది గాని ఇతర ఘనత ఏదియు లేదు. 'మూకం కరోతి వాచాలం' అన్నట్లు పరమానందమీశుని లీలయే ఈ వ్యాఖ్యానరచనకు కారణమని శ్రీధరుడు త్రికరణ శుద్ధిగ భావించినట్లు ఈ మాటల వలన స్పష్టమగుచున్నది.

**ఇతి శమ్**

**ఓం తత్సత్**

సదానందో విజయతే

జయ కృష్ణానంద

మదనానందో విజయతే తరామ్

జయ మాధవానంద

# శ్రీగురుమదనానందసరస్వతీపీఠము

## రాంపురం, తొగుట మం., మెదక్ జిల్లా



పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ మాధవానందసరస్వతీస్వామివారు**

సాధనాత్ సాధ్యతే సర్వమ్ సాధనాత్ సాధ్యతే సర్వమ్ సాధనాత్ సాధ్యతే సర్వమ్ సాధనాత్ సాధ్యతే సర్వమ్ సాధనాత్ సాధ్యతే సర్వమ్ సాధనాత్ సాధ్యతే సర్వమ్